సూర్యరావు, క్రొత్తపల్లి

# జపాన్ దేశ చరిత్రము

కాకినాడ, 1904

Record no. 360

Sūryarāvu, Krottapalli

Japān dēśa caritramu

Kākināḍa, 1904

Record no. 360

Bibliographic Record Target

సూర్యరావు, క్రొత్తపల్లి.

జపాన్ దేశ చరిత్రము / ఇది క్రొత్తపల్లి సూర్యరావుచే నఱవములోనుండి వ్రాయబడినది.-

1. కూర్పు.- కాకినాడ : శ్రీబాలసరస్వతిముద్రాక్షరశాల, 1904.

(1), 110 p. ;19 cm.

Record no. 360

Sūryarāvu, Krottapalli.

Japān dēśa caritramu / idi Krottapalli Sūryarāvucē Naṟavamulōnuṇḍi vrāyabaḍinadi.- 1. kūrpu.- Kākināḍa : Śrībālasarasvatimudrākṣaraśāla, 1904.

(1), 110 p. ;19 cm.

Record no. 360

సరస్వత్యనుబంధము. 87.

శ్రీరస్తు.

# జపాన్ దేశ చరిత్రము.

The History of Japan.

ఇది

శ్రీసరస్వతిపత్రికకు మేనేజరగు

కొత్తపల్లి సూర్యరావుచే

నలువములలోనుండి వ్రాయఁబడినది.



కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1904

వెల రు. 0—8—0

# పీఠిక.

ఈగ్రంథము చెన్నపట్టనములోని "స్వదేశమిత్రన్" అను ద్రవిడవార్తాపత్రిక కధిపతులగు మహారాజశ్రీ జి. సుబ్రహ్మణ్యఅయ్యర్ అవర్‌ఘుల్ బి.ఏ. గారిచే నఱవములోఁ జక్కని శైలిలో వ్రాయఁబడినది. దాని నొక్క ప్రతిని మాపత్రికాధిపతులును శ్రీపోలవరసంస్థానాధిపతులునునగుమహారాజశ్రీ శ్రీరాజా శ్రీకొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణరావు బహద్దరు బి. ఏ. గారికిఁ దద్గ్రంథకర్తలు పంపియుండిరి. దానిని దెలుఁగులోనికి భాషాంతరీకరింపుమని మాపత్రికాధిపులు నాకనుజ్ఞ యొసంగిరి. మాసరస్వతీపత్రికలోనికై పూర్వప్రబంధములను సరస్వతీ నిలయభాండాగారమునుండి తేఁబోయి తంజావూరిలో నొకనెలయును బత్రికాప్రకటనమునకై చెన్నపట్టనములో నే డెనిమిది నెలలునుండి యలవఱచుకొనిన యఱవమునందలి నాయల్పజ్ఞానము శ్రీమాపత్రికాధిపతులయనుజ్ఞను నిర్వహించుటకై సాహసము పుట్టింప నుద్యమించి మాచదువరుల కృపచే ముగించితిని. బహుభాషలయందు సమస్త విషయములను దక్షులైన మహారాజశ్రీ సుబ్రహ్మణ్యఅయ్యరు అవర్‌ఘుల్ బి. ఏ. గారు రచించిన యీపుస్తకమును దెనుఁగుచేయుటలో ననుభవముచాలని నేను బలుచోటులఁ దప్పులు వ్రాసియుందును. అట్టి వీయుభయభాషల నిపుణులగు పెద్దలు కనిపెట్టినచో మన్నింపవేఁడుకొనుచున్నాను. నాకర్థముగాని తావులను నన్వయము కుదురని భాగములను బహుజాగ్రతగాఁ జదివి యొకరిద్దఱి నడిగి తెలిసికొనియే వ్రాసి యుండినను ప్రమాదపతితములుండక మానవు. ఇందు మూలగ్రంథములో నున్నవరుసనే పదాఱుప్రకరణములను విభజనగా వ్రాయుటయేకాక యెక్కడనైనా తప్పఁ దక్కిన యన్నితావులను బ్రతివాక్యమును సరిగాఁ దెనుఁగులోనికిఁ దెచ్చియుంటిని. కాని యఱవములో గ్రంథకర్తలు పొందుపఱచిన మధురశైలిని మాత్రము నేను దెనుఁగులోనికిఁ దేలేకపోయితినని చింతించుచున్న నన్ను వేత్తలు గుణలేశములం జూపి యూఱడింతురని నమ్ముచున్నాను. దేశోపకారపరాయణులైన యీయయ్యరుగారివంటివారు ప్రతిదేశభాషయందును నిట్టి యుపయోగగ్రంథములను వ్రాసి యాయాయెడలంగల జనులమౌఢ్యమును బాప వారికి దైవము తోడుపడుంగాక.

ఇట్లు విన్నవించు,

కొత్తపల్లి సూర్యారావు.

సరస్వతీ మేనేజరు.

# జపాన్ దేశచరిత్రము



(సంగ్రహము)

---

ఉపోద్ఘాతము.

**K.M.T**

## అన్యదేశస్థులసహవాసమవశ్యకము.

హిందువుల కన్యదేశసంబంధ మెప్పుడును లేకుండలేదు. ఆసియాఖండముయొక్క తూర్పుదిక్కు పడమరదిక్కులఁగల దేశములవారితో సంబంధము గలిగియున్నట్లు కొన్నిదృష్టాంతములు కనఁబడుచున్నవి. ఇతరులు హిందూదేశమునకును హిందువులితరదేశములకును సాధారణముగా రాకపోకలు చేసిరి. ఇండియాలో బౌద్ధమతము స్థాపింపఁబడిన కాలమున నామతాచార్యులన్నిదిక్కులకును వెళ్ళి బోధించి వచ్చినట్లు తెలియవచ్చుచున్నది. వీరు పడమర నీజిప్టుదేశమువఱకును వెళ్ళినట్లు చరిత్రములు చెప్పుచున్నవి. క్రైస్తవమహమ్మదీయమతములు ప్రబలమై బౌద్ధమతమక్కడ నిలిచినది కాదు. కానితక్కిన దేశములలో దక్షిణమున శిలోను ఉత్తరమున టిబెట్ తూర్పున బర్మా, హిందూచీనా, చీనా, జపాన్ మొదలగుదేశములలో నితరమతములు ప్రబలము కాకుండ బౌద్ధులుతమ మతమునే స్థాపించినారు. ఆదేశములనుండి మతాభిమానము గలవారు హిందూదేశమునకు పండితులయొద్ద మతవిషయములను నేర్చికొనవచ్చుచున్నచో నాపండితు లిప్పటివారివలె జాతిభేద మతభేదములు కలిగి యసూయపడువారు కాక వారికోరికలు తీర్చుచుండిరి. అశోకచక్రవర్తి చెల్లెలు సంగమిత్ర శిలోనులో బౌద్ధమతమును బోధించిన దనుమాటవినినచో నప్పటివారలకు నిప్పటివారికినిగల గుణాగుణముల భేదము తెలియుచున్నది.

తూర్పున కంబోడియాలో హిందూరాజులు పూర్వకాలమున రాజ్యపాలనము చేసిరనినందులకుం దగినగుర్తులగు నున్నతములగు రాజభవనములును దేవాలయములును దేవతావిగ్రహములును బెక్కు లిప్పటికిని గాన్పించుచున్నవి. అవియన్నియుఁజూచి యూరోపుదేశమునుండి వచ్చిన వర్తకు లాశ్చర్యపడుచున్నారు. ఆరీతినే ఫసిఫిక్కుమహాసముద్రములోని జావాద్వీపములోఁగూడ హిందువుల నాగరికతను బరిపాలనమును దెల్పుపాడువడిన కట్టడములును గుడులును జూడఁబడుచున్నవి. అందు మహాభారతము "భారతయుద్ధ" మనునామముతోఁ దమభాషలోనికి సంగ్రహముగాఁ దీసికొ

ని చరిత్రములలోఁ గలపికొనియున్నారు. అక్కడివారు తమద్వీపములో నొక్కొక్కచోట నిక్కడ నీయావిధముగా జరిగినదని భారతయుద్ధమక్కడ జరిగినట్లే స్థలనిర్దేశము చేసికొనియున్నారు. మతబోధకయి కొందఱు బ్రాహ్మణులు వెళ్ళి కాఁపురములుండిరి. ఒక గుజరాతుదేశపురాజు క్రీ. శ. 603 లో తనరాజ్యముపోనున్న సమయమున 5000 వేలజనముతోఁ దనకొడుకును జావాద్వీపమునకు 6 పెద్దయోడలును రమారమి 100 చిన్నయోడలను గూర్చి పంపినట్లు చరిత్రము చెప్పుచున్నది. జావాకు దక్షిణమున బలియను చిన్నద్వీపములో నిప్పటికిని హిందువులుకలరు. హిందూదేవాలయములున్నవి. హిందూమతమునున్నది. దూరదేశముపోయి హిందూదేశరాజులు స్థాపించిన రాజ్యములు, వారు తిరుగ హిందూదేశమునంగల తమవారికి సంభవించిన యాపత్తులను దీర్పవచ్చిన నింతలో మహమ్మదీయులారాజ్యములాక్రమించుకొని హిందూరాజ్యసంబంధములైన చిహ్నములు కనఁబడకుండఁ బాడుచేసిరి.

సాధారణముగాఁ బూర్వకాలమందు వర్తకమునకయి హిందువులు తక్కినదేశములకు వెళ్ళి వచ్చుచున్నట్లును యూరోపువారు ఇండియాదేశములోని విన్నాణపు సామానులు తీసికొనిపోయి వర్తకముచేసికొనునట్లును చరిత్రములు చెప్పుచున్నవి. మధ్యధరాసముద్రములోని యిటలీలో వర్తకులు ఇండియాలోని సరకులే తెప్పించుకొని వానివలన విశేషధనమార్జించిరని వినుచున్నారము. ఆఫ్రికాఖండమందలి దక్షిణాగ్రమును జుట్టి యిండియాకు రావచ్చునని పోర్చుగీసువారుకనిపెట్టునంతవఱకు ఇటలీవర్తకులు ఇండియాలోనిసరకుల వ్యాపారమువలననే యైశ్వర్యమును గీర్తిని పొందిరి. ఆప్రకారముగాఁ దూర్పుదేశములతోను ఇండియావిశేషముగా వాణిజ్యముచేయుచునే వచ్చినది. హిందువులు జాతిమతవ్యత్యాసములు గణింపక యోడలలో సరకులువేసికొని యితరరాష్ట్రములకేగి యమ్మి యక్కడివస్తువులుకొని తెచ్చుకొనువారు. చీనాదేశవర్తకమునకై బ్రాహ్మణుఁడొకఁడు నావపైవెళ్ళినట్లును మార్గమధ్యమునఁ దుపానుపట్టి యది బద్దలైనట్లు చీనావారిసహాయమున మరలస్వదేశమునకుఁ గొన్నినాళ్ళకుఁ జేరినట్లుగాఁ గలదు.

ఇట్లు పలువిధములగు నుద్దేశములతో నాదికాలమున మనవారితరదేశీయుల సంబంధము గలిగించుకొనినందున వారికి ధైర్యము బుద్ధికౌశలతయును వృద్ధిపొంది మనోవ్యథలు, చింతలు నించుకయు లేకుండ సుఖముగా నుండిరి.

ఇప్పుడు మనము మనపూర్వులుచేసినవి విడిచి యితరదేశస్థులతోడి సహవాసమును విడిచిపెట్టి మనపెద్దలు దేశాంతరములు వెళ్ళి చేసినపనులను మఱుపుజెంది దుస్థితి



కివచ్చినాము. అట్లుకాక ఆకాలమున పెద్దలేర్పఱచిన నడవడుల పరిహారముగా నన్యదేశస్థులతోడిసహవాసము వృద్ధిచేయుచువచ్చితిమేని వెనుకటి మనవారివలెనే మనమును సుఖింపుటకు సందేహములేదు. మనదేశమునకుహీనదశవచ్చుకాలముకనుకయేక్రమక్రమముగా నితరదేశములు వెళ్లుటయు నానాదేశములంగల ప్రజలసహవాసము చేయుటయు మానుకొన మొదలుపెట్టినాము. సముద్రముదాఁటి వేఱొకదేశము వెళ్లినవారిని వెలివేయుదుమని పెద్దలు విధించినారు. ఇట్లుగా రాను రాను మనవారు తామున్న యీహిందూదేశముతప్ప మఱియెక్కడను దేశములే లేవనుకొనునంతటి బుద్ధిమంతులగుచున్నారు. తాముపుణ్యభూమియని యెంచుకొను నీభరతఖండమున కావలివారందఱును మ్లేచ్ఛులనియు మూఢులనియుఁ గూడ ననఁదలపెట్టినారు. దామేసమస్తము నెఱిఁగియుంటిమనియుఁ దమరు తెలిసికొన్నది యితరకుఁ జెప్పఁగూడదనియు మూఢాభిప్రాయమును గలిగి తమదేశమువారే తమకంటె క్రిందివారని యెంచుకొనుచున్నారు.

ఇట్టి స్థితిలో నుండఁగనే గుజినీమహమ్మదు పండ్రెండు సారులు దండెత్తివచ్చినట్లు చెప్పుకొనుచున్నారు. ఆతనితోఁ గూడ నిండియాకువచ్చిన అల్బారునీయను మహమ్మదీయ విద్వాంసుఁడు హిందూశాస్త్రములు చాలకాలము నేర్చుకొని వానియందుఁగల సారమును గ్రహించి బ్రాహ్మణులయొక్క యసూయ, గర్వము, మేలుకీళ్ళు తెలియకుండుటయును దేశయాత్రచేయకపోవుటచేతనే గదా వీరిని విడువకున్నవని సగము విచారమును సగముసంతోషమును బొందెనఁట.

ఈకాలములో మనకును నితరదేశమువారికి నీవిషయములోనే వ్యత్యాసముకలిగి యున్నది. ఏదేశమువారు మనవలె నితరదేశము వెళ్ళుట దైవసమ్మతము గాదని భీష్మించుకొని యూరకున్నారో విచారింపుఁడు. ప్రతిదిక్కుననున్న జనులును నితరదేశములకు వచ్చి వర్తకరూపమున ధనమార్జించుకొని పోయి సుఖులగుచుండఁగా మనము మాత్రమెక్కడకును గదలక మందముగా నల్పజీవనముచేయుటకు మొదలిడినాము. ఇట్లెంతకాలము గడపఁగలము? సర్కారు ఉద్యోగమువలననో మఱియేదైనపని చేసియో నెలకు 15 లేక 20 రూపాయలు సంపాదించి తాము తమవారును విశేషార్జనము చేయుచున్నట్లు సంతోషించుచున్నారు. ఇట్టి 20 రూపాయలు ఆంగ్లేయవర్తకులు చిటికవేసినంతలో సంపాదించి యిక్కడనుండి కుప్పతిప్పలుగా ధనముఁ గొనిపోవుచున్నారు. వారికిని మనవారికిని గలభేదమేమి? వారికి ధైర్యమును బట్టుదలయును మిక్కుటముకలవు. మనవారియొద్ద నారెండును లేకయే పనిచేయ మొదలుపెట్టినను [illegible] ధైర్యము[illegible]చుచున్నారు. ఈకార్యమెట్లు నెఱవేఱునాయని చింతపడియిన్ని య[illegible] హీనప్రకారము కడవఱకు నిల్వ[illegible]బోవుచున్నారు.

ఏదేశమువారికయినను నంపదకి నితరదేశ యాత్రకు సాధ్యముకాదు. అట్లుపోవుటకు సాధ్యముకానివారు చదువుకొన్న వారైనయెడల( జరిత్రములు చదివి వివిధవిషయములు గ్రహించి తమబుద్ధిబలము కన(బఱతురుగదా! ఇండియాలో మొదటిగవర్నరు జనరల్ గారయిన వారన్ హేస్టింగ్స్ ధనాశచే రాజులకును బ్రజలకును బహుకష్టములు సంభవింప( జేసినట్లును, బ్రిటిష్‌గవర్నమెంటువా రాయనకిచ్చిన యధికారమునకు( దగినట్లు పాలించ లేదనియు పార్లమెంటులో( జెప్పి ఆయనచేసినపనులను లేశలేశములుగా విమర్శించి యుదహరించి, విన్నవారందఱును పైగవర్నరుజనరలువంటి దుష్టు( డుండునా యని నిందించులాగున( డామెస్వూడను జూచి యుండని హిందువులమీ(ద మిక్కిలిదయాళువై యిండియాలో జన్మకాలమంతయు వసించినవారికిని దెలియని సూక్ష్మవిషయములను గూడ గ్రహించి కన(బఱచి వాదముచేసి యెన్న(గు(జెసని పొగడ్తనుబొందిన ఎడ్మండుబ్రూకుదొరగారిండియాకు రాకుండ(గనే గ్రంథములం జదివియే గదా యట్టికరుణాస్వభావమును మంచిజ్ఞానమును మనయందుగన(బఱచిన సుస్వభావమును గలవారైరి? వారితరువాత( గొంతకాలమునకు జాన్ బ్రైట్, హెన్రీఫాసెట్ అనువారిరువురును జూడకుండ(గనే యిండియాకాపద్బాంధవులైరి. మనదేశము చూడకపోయినను వారు మనవారికంటె నెక్కువసంగతులు తెలిసికొనిరి.

అటువలెనే హిందువులమయిన మనమిప్పుడేమి చేయవలయుననగా:—కాలమునకు దేశమునకు వర్తమానమునకు( దగినరీతిని తమస్థితిగతులు చక్క(జేసికొని దినదినాభివృద్ధిలోనున్న జపాన్‌దేశస్థులు మొదలైనవారి సాంగత్యముచేసి వారిదేశములకు(బోకపోయినను వారియొక్క చరిత్రగ్రంథములు చదువుకొనియైనను వారువారుచేయు మార్గములనవలంబించి మనదేశమును వృద్ధిలోనికి( దెచ్చుయత్నములు చేయవలయును.

## ఇండియాయును నితరదేశములును.

ఏకాధిపత్యముగల చీనాలోమాత్రము 40 కోట్లజనులు గలర(ట. అదితప్ప మఱియేదేశమును మనయిండియావలె జనసంఖ్యయును విస్తీర్ణమును గలదియులేదు. ఇండియా 15 లక్షలచతురపుమైళ్ళ విస్తీర్ణమును 30 కోట్ల జనసంఖ్యయును గలదు. ఇంతపెద్దదేశమున కవశ్యమయిన జీవనోపాయములును బుద్ధిబలధనబలములును సుఖసౌఖ్యములును తగినట్లుండవలయునుగదా. అట్లుండు విధముచేయుట రా[illegible]లపని. దైవము దేశమునకు సరిపడునట్లు పర్వతములు, నదులు, భూసారమును, శీ[illegible]ష్ణములు, సృష్టించియున్నందున వానికి(దగినట్లు వ్యవసాయము మొదలగునవిచేయు[illegible]వలన నాహారపదార్థములెట్లు కావలసినన్ని కలుగుచున్నవో, అట్లె వ్యవసాయమువలన గలిగిన



వస్తువులను జేతిపనులమూలమున జనోపయోగమునకు వచ్చుటకు సాధనము లేవికలవో వానిని జేయించి సాహాయ్యముచేసి చాలనాళ్లనుండి జనులనుభవించు కష్టములను బోపి బలాఢ్యులగు నితరులు నీరసులను బాధింపకుండ( గాపాడి క్రమక్రమముగా ప్రజలస్థితి నభివృద్ధిలోనికి( దెచ్చుట రాజాంగమువారి పనియై యున్నది. ఈపనిని వహించిన ప్రభువులతో( బ్రజలకందఱకును బ్రతినిధిగా నొకడు నిల్చి వీరికష్టములన్నియు( జెప్పవలయును. ఒకదేశములోనివారే యొకరిపై నొకరు పోటీవచ్చి రెండవవారిని బడ(ద్రోయవలెనని చూచుచున్నట్లే యితరజాతివారిని తమకుభేదముగా నుండువారిని బుద్ధిబలముచే( గ్రిందుపఱుపవచ్చును. ఇపుడు రైలుబండ్లు, పొగయోడలు మెఱుపుసహాయమున తీ(గెటపాలు మొదలైన యుపాయములచే దూరము కాలమును గమనించుట మఱచియున్నారు. చీనాకును ఇంగ్లాండునకును నడుమనెన్ని వేలమైళ్ళోకలవు. ఉన్ననేమి? ఒకమాసములో యుద్ధనావలు సామానులు సరకులుతెచ్చు స్టీమరులు వచ్చిచేరుచున్నవి. అరగంటలో( జీనానుండి యింగ్లాండునకు తంతిమీద నెంతెంత సమాచారమైనను దెలియుచున్నది. ఇట్టున్న కాలములో నొకదేశమువారు మఱియొకదేశమువారిని మించి లాభమును బొందుట యుక్తముకదా! చీనా ఇండియా మొదలయిన యనాదియగుదేశములవారి నితరులు తమలాభముకొఱకై కదా క్రిందుపఱిచియున్నారు. కా(బట్టి యేదేశమువారుగాని మఱియొకదేశమువారిని మీ(ద(బడి బలవంతముగా నష్టమునకు లోనుజేయకుండ( బ్రభువులు కాపాడుచుండవలయును. ఈరీతిని గోటానకోట్లు జనులు కాలముగడపుటకు( దగినటుల(గాపాడుటకు(గా నెంతబుద్ధి, శౌర్యము, ధైర్యము, చేతిపనులనేర్పు, మైత్రత, ధనవ్యయము మొదలయినవి యుండవలయునో చూడు(డు. పరిపాలించువారికే కాక మిగిలిన జనులందఱకును గూడ నీగుణములవశ్యమే. ఇవియున్నంతమట్టునకు పరులకులో(బడకుండ స్వతంత్రము, స్వాధీనముగలిగియుండవచ్చును.

ఈవిధమగు గుణములు పైదేశమువారికున్నవి గాన వారు గొప్పదశలోనుండిరి. ఇవిలేనివారము గనుకనే మనము మొదలగు ఆసియా జాతివారును హీనదశయందుండిరి. గొప్పస్థితిలోనున్న పైదేశములవారిలో( గూడ( బైన( జెప్పిన మంచిగుణములు కొందఱియందు లేవు. చాలకాలమువఱకు బ్రిటిషుదేశమువా (ఇంగ్లీషువారు) రీవిధమగు సద్గుణములచేతనే యితరములగు నన్నిదేశములవారికంటె రాజ్యతంత్రములయందు [illegible]రసమును బొంది యుండుటయేకాక యంపతికిని గావలసిన సాధనసామగ్రి తమచేతిపనులయందలి యుపాయములచేత( జేసియిచ్చి తమదేశమువారితోపాను దక్కి

నదేశముల వారితోడను, వ్యాపారమునశిపి వస్తుసంగ్రహమున ధనవంతులైరి. కాని యితరదేశములవారును గన్నుమూసికొనియుండలేదు. వారును దామున్ బ్రిటిష్‌వారికంటె వెనుకఁబడియున్నామని బాగుగనాలోచించి తెలిసికొని యవశ్యమయిన యత్నములు చేయుచురాఁగాఁ గాలక్రమమున బ్రిటిష్‌వారిని మించినవారైరి. గతించిన పది సంవత్సరములలో జర్మనీయును అమెరికాయు నిట్టివియైనవి. ఇంగ్లీషువారికంటె ఎక్కుడుగా యంత్రసహాయమునఁ బనులుచేయుటనేర్చుకొని వ్యాపారముచేయుటకుఁ దగినసామానులు మంచివియును, చవకగా సులభముగా నమ్మఁదగినవియును జేసి బ్రిటిష్‌వారు వర్తకము చేయుచున్న స్థలములకే వారునువచ్చిపోటీగావచ్చినట్లు కనఁబడి వారివ్యాపారమును దాములోఁగొన్నవారైరి. ఇండియా, బ్రిటిషువారిసహాయము గలిగియున్నదైనప్పటికి, నిక్కడనుగూడ జర్మనీవారును అమెరికావారును బ్రిటిషువారిని మించినవర్తకము నడుపుచున్నారు.

ఇట్లుండుటచేఁ దమకునష్టమును గ్రించుఁదనమును వచ్చుచున్నదని బ్రిటిష్‌వారితేఁగి మఱవారివలె ముక్కుమూసికొని 'పోనీ వారేపోయినారు, దైవమునకిచ్చినది మనకుఁజాలు' ననియూరకుండలేదు. దక్షిణాఫ్రికాయుద్ధము జరగిన మూఁడేండ్లలో బ్రిటిషువారివ్యాపారమునందుండుటకుఁ దీరుబడిలేక దానియందే తదేకనిష్ఠగా నుండిరి. యుద్ధము ముగియఁగనే బ్రిటిషురాజ్యాంగమువారును, వర్తకులును, ధనవంతులును, దేశాభిమానులును మిక్కిలిసంతసించి యిఁకమనమెక్కునిమిషమైనను నశ్రద్ధ చేసితిమా దేశములోనివాడుకలు చెడునని యత్నముమీఁద యత్నము చేయుచున్నారు. రాజాంగమువారికంటె వర్తకులే తమస్వంతధనముతోఁ దామేముందుఁగాఁగాలూనఁ ద్రొక్కుకొను నుపాయములను వెదకుచున్నారు. ఎంతధనము వెలనైనను, శరీరకష్టముకావలసి యున్నను, వానినిగుఱించి యించుకయిన లక్ష్యముచేయక అమెరికామొదలగు దేశములకుఁ దమకార్యస్థులను, మఱికొందఱు బుద్ధిమంతులను అచ్చట నేయేకారణములచేతఁ బనులభివృద్ధిచేసి బలపడి యున్నారోయనునది తెలిసికొని వచ్చుటకుఁ బంపి తెలిసికొనుచున్నారు. మిస్టర్ ఆల్‌ఫ్రెడ్ మోసిల్ అనునాయన బ్రిటన్‌లో నేనైపునండియైనను కొంతమందివర్తకులను పనులుచేయువారిని గూర్చి చేర్చి అమెరికాకు వెళ్ళి వారివలన నసూయలేకుండ సంతోషమును నాదరమును బొంది వచ్చులాగున నచ్చోటఁగల యనేకకర్మశాలలలోనికేగి బాగుగాఁ బరిశీలించి, ధనసంగ్రహమునందాశగలిగియున్న వారిలో బుద్ధిశాలురు, ననుభవముగలవారు నైనవారితో నాలోచించి తమదేశమునకువచ్చి విశేషముగా విరివిగాఁ బ్రచురము చేయుచున్నారు.



ఏకారణములచేత అమెరికావారు తక్కిన యందఱిని దమయెదుట నిలువలేని వారినిగాఁ జేయుచున్నారని తామిప్పుడు తెలిసికొని యున్నారో ఆకారణములచేతనే బ్రిటిషువారును ముందునిలుచుటకుఁ దగినన్ని ప్రయత్నములు చేయఁదలంచుచున్నారు. ఈరీతిని రాజాంగమువారును జనులును ఆయాకాలస్థితులకుఁ దగినట్లు సోమరితనములేకుండ సాహసముతోడనుయత్నముతోడను క్రొత్తక్రొత్తవిచేయుచుఁ గాచియుండిననే గదా దేశము బాగుపడును. మనదేశములోని ధనము నితరులోడల కొలఁదిఁగొనిపోవుచుండఁగా మనలో బుద్ధిశాలురు పురాణముచదువువారికి బంగారుతోడాలు వేయుటయందే, యాలోచనలును ధనమును గాలమును వ్యర్థముచేసినచోఁ గొన్నినాళ్ళలోఁ బౌరాణికునకు బహుమానమిచ్చుటకు డబ్బుకనఁబడునా.

## క్రొత్తయుపాయములును వస్తుసంపాదనమును.

ఇండియాకును మఱియొకదేశమునకును గల వ్యత్యాసమేమనఁగా:—ఇతరదేశములలోనేదేని నభివృద్ధికుపయోగమైన యుపాయము నొకదాని నెవ్వరైన నాలోచించి చెప్పిన వెంటనే జనులందఱును నంగీకరించి యదినెఱవేఱునట్లు కృషిచేయుచున్నారు. చేసినస్వల్పకాలములోనే వృద్ధికి వచ్చుచున్నారు. ఇండియాలోనూ యట్లు నడచుటలేదు. జపాన్‌లోను, మనదేశములో నెట్లో యట్లే పూర్వము పనులన్నియుఁ జేతులతోనే సూక్ష్మముగాఁ జేయఁబడెనుగాని యంత్రసాధనములవలనఁ గాదు. సుమారు 60 సంవత్సరములకుముందు జపానులో గొప్పకలఁత కలిగి యంతకు ముందున్న రాజాంగ నిబంధనలు మార్పఁబడి యింగ్లాండుమొదలయిన అయిరోపాదేశమునందువలెఁ బార్లమెంటనియు జనులు నియమించు వారనియుఁ గ్రొత్తపద్ధతులు చేయఁబడినవి. అప్పటినుంటి జపాన్‌లో ఐరోపా, అమెరికా మొదలగు దేశములవలెనే యన్నివిషయములును జరపఁబడుచున్నవి, రాజులకును జనులకును గావలసిన సామానులు పూర్వమువలెఁ జేతులతోఁ జేయకుండ యంత్రసహాయముననే జేసికొనుచుండవలయునని యాలోచించి వెంటనే యట్లారంభించివారు. వర్తకులును బనులుచేయువారును యంత్రములతోనే సామానులుచేసి తమదేశములోనే కాక బ్రిటిషు, జర్మనీమొదలగు దేశములవారికిఁ బోటీగా నితరదేశములలోఁ గూడ నమ్ముచున్నారు. ఇండియాలోనిప్పుడు జపాన్‌లోఁ జేయఁబడు నగ్గిపెట్టులు విశేషముగాఁ గర్చుపడుచున్నవి.

ఈప్రకారమే మనదేశమువారును క్రొత్తయుక్తులెవ్వరైనఁ జెప్పినయెడల నానిని జనులనుసరించి తమసౌఖ్యమార్గమును గనిపెట్టిరేగదా యభివృద్ధిలోనికివత్తురు. చేతి

బలమువలనను నుపాయమువలనను జేయఁబడుసామానులు నీకాలములో నుపయోగపడ
వనియు, యంత్రములతోఁ జేసిన వస్తువులే చాలకాలముండుననియు మనవారికిప్పుడు
స్పష్టముగాఁ దెలిసియుండియును నొకరైనను చాలధనముపెట్టి యంత్రములు తెప్పిం
చి మంచివి చవకగా ‘నేను జేసెద’ నని ముందు నిలుచువారు కానఁబడరు. అంతధ
నము పెట్టుబడిపెట్టు ధనికులు మనదేశములోనంతగా లేకపోయినను బొత్తిగా లేరని చె
ప్పనల్లపడదు. ముఖ్యముగా మనజమీందారు లీవిధమయిన క్రొత్తపనులలోఁ బ్రవేశించి
తాము నులాభమును బొంది దేశమునకు మేలుచేసి జనులకుఁ గనఁబఱపవలెను. ఈజ
మీందారులకీవిధకార్యములలోఁ గొంత నష్టమువచ్చినను బాధలేదు. ఒకటిరెండుమాఱు
లుచేసి కార్యసఫలతనొంది లోకమునకు లాభముచూపవచ్చును. ఇట్టిమంచిపనుల
లోనే వీరుప్రవేశించుట మంచిదై యుండఁగాఁ బలువిధముల వృథావ్యయముచేసి సొ
మ్ము గడ్డిపరకకూడఁగాకుండ నెగరఁగొట్టుచున్నారు.

జమిందారులుగాక వర్తకులు, నుద్యోగస్థులు మొదలయిన వారింగూర్చి చె
ప్పవలెనన్న వీరికి నితరజనులవలెనే మితిలేనిధనాశకలదనుటకు సందేహములేదుగాని
సంపాదించు నుపాయములు బాగుగఁ దెలిసికొని వానిం జేయుచున్నారా? ఈదినము
లలో నేపనియును యంత్రోపయోగమునఁ జేయవలయుననియు నట్లుకావించుటకు
సంచిమొదలు చాల కావలసియుండు ననియు వీరికిఁ దెలిసియున్నప్పటికిని దమరు న
గలుచేయించుటయందును, గొప్పలకుఁ బోయి పెండ్లిండ్లలో భోగపుమేళములు మొద
లయిన వృథావ్యయములయందును పెట్టుచున్నారే కాని తాముశ్రమపడియైనను కర్మశా
లలకు సొమ్ముపెట్టి పనులుచేయించి సహాయముచేయవలయునను నభిప్రాయము వారిమ
నస్సులలోఁ బుట్టనేలేదు. కొంచెముసొమ్ముపెట్టి పనిప్రారంభించి విశేషలాభము
పొందఁ దగిన పనులీదేశములో నెన్నియోకలవు. సమయమునకుఁ దగినట్లు త
మగుణములను నాచారములను నభిమానమువిడిచి మార్చి ‘ధనమూలమిదంజ
గత్తని యున్నది కాఁబట్టి, మొదట కావలసినమట్టుకు ధనము సంపాదించి
తమకును దమకుటుంబమువారికిని భోజనమునకు వేఱొకచోట వెదకుకొనకుం
డఁ జేసికొని చివరకు జ్ఞానవిచారముననో మఱియొక కాలక్షేపముననో సం
తోషింపనెంచినఁగదా మనయభివృద్ధికి హేతువుకలుగును! ఇతరదేశస్థులు మన
దేశములోని ఆవుల, మేకలు, గేదెలు మొదలగువాని యెముకలను కంటికిఁగనఁబడిన
చోటినుండి యెల్లనేఱితీసి యోడలునిండ వేసికొనిపోయి లక్షలకొలఁది గడించుకొను
చున్నారు. కుక్క, నక్క, మేక, పసరము, మొదలగునవి చచ్చినచోట్లకెల్లఁబోయి



వానితోళ్లు సంపాదించి బాగుచేసి ఆచర్మములతో బహువిధములైన సామానులుచేసి
సొమ్ము గడించుచున్నారు. మఱికొన్నిస్థలములలో నగరములలోని పెంటలును మ
నుష్యులయొక్క పశువులయొక్క మలాదికమును అసహ్యించుకొనకుండఁ బోగుచేసి
దానినిం జేయవలసినవిధమున జాగ్రతచేసి పొలములకు ఎరువుగా నుపయోగించు
చున్నారు.

ఈవిధముగా ధనముందాశచేఁ బ్రయత్నించు జనులీపనినీచమయినది యీ
పని మంచిదని చూడక యేకార్యముగాని బిచ్చమెత్తుకొనుట దొంగతనముచేయు
టకంటె మేలైనదని సాహసముతోఁ బాటుపడుచుండ మనము మట్టుకు జాతిక
ట్టుబాట్లను బెట్టుకొని యీవర్ణమువారీకార్యము చేయరాదని నిర్బంధములు కలిగిం
చుకొని యుంటిమి. అట్లుగాక కాలానుసారముగాఁ గ్రొత్తయుపాయములను సమ్మ
తించి పలువిధములైన నూతనకర్మస్థానములు స్థాపించి హిందువులు ధనవంతులగుకాల
ము వచ్చునాయని దేశాభిమానులు పలుదైవములకు మ్రొక్కుచున్నారు. పైమనవా
రివలె జపానులోని పెద్దమనుష్యులు నిర్బంధములను గమనించుటయే లేదు. కొంచె
మైనను వెనుక దీయక క్రొత్తయుపాయములఁ గనిపెట్టి వాని నవలంబించియున్నారు.
ఇంకను నవలంబించుచున్నారు.

## దేశాభిమానమున్నచో బాగుపడవచ్చును.

జపాను దేశచరిత్రము చదివినవారు ఆదేశమువారు ముందుకు వచ్చినందుకుఁ గల
కారణములు వారియైకమత్యమును దేశాభిమానమునే యని తెలిసికొనఁ గలరు. మన
వారు తమమేలు చూచుకొనుటకే పాలుమాలికష్టపడుచుండ దేశక్షేమమున కెట్లుపా
టుపడఁగలరు? కాఁబట్టి సోమరితనము విడిచి ధనసంపాదనమునకుఁ గావలసిన తం
త్రములు నేర్చుకొని క్రమక్రమముగా యత్నించినఁగాని వారువారు పదార్థసంపాద
నముచేసి జీవించుటకష్టమని యెవ్వరికిఁ దోఁచదు? బద్ధకపడి యుంటిమా దేశము
యొక్క సంఘక్షేమమే చెడి యిప్పుడున్నట్టే కష్టములు, దుఃఖములు, రోగములు మ
నలను విడువవు. ఇంతపెద్దదేశములో ముప్పదికోట్ల జనులుండఁగా వేయిమంది దేశా
భిమానులుండకపోరు. ఆవేయిమందియును దేశకష్టములు పోవుటకుగా నేరేయ
త్నములొనర్పవలయునో వానిలోఁ బ్రవేశించి ప్రారంభించిన పని ముగించియే తీరెద
మని నడుముకట్టి సిద్ధపడవలెను. మనదేశము నభివృద్ధిలోనికిఁ దెచ్చుట కెన్నియో
కష్టము లున్నవి. అందు మొదటిది:—మనకు రాజాంగమువారి యాదరువు చాలినం
త లేదు. దానితోడు ఆంగ్లేయుల వ్యాపారము, స్థితి యభివృద్ధికి రావలెనని చూచు

చున్నారే కాని హిందువులుకూడ నట్టివారు కావలయునని యూహ తక్కువగానే కలిగియున్నారు. రెండవది:—ఇంగ్లీషువారు మనకుఁ బోటీవచ్చి కొసుల యపరిమితధనమును సామర్థ్యమును గలిసినట్టు తనమున్ను మఱికొన్ని యితరోపాయములున్న గలిగి మనము మీఁదికి రాకుండఁ జేయఁగలరు. వీరి నెదిరించి పోటీపెట్టు సత్తువ మనకు లేదు. మనకు ధనము లేదు, బుద్ధిసూక్ష్మత లేదు, ధైర్యము తక్కువ. మఱియు నికొక్కలముకుఁ బైవారికివలె పదార్థసంగ్రహమునకుఁ దగిన నానావిధతంత్రములు యంత్రములును మనకు లేవు. ఇట్టిచో నేవిధమున వారితోఁ బోటీగా నిలువఁగలము? పులితోఁ బసవ మెదిరించునా? కాని కొన్ని వేళలలో సాధ్యపడును. అడవిలో మేఁతకేగిన పశువులన్నియు నొక్కటిగాఁ గూడి పెద్దపులిపైపునకు ముఖములు పెట్టి రొక్కుమ్మడి మీఁదఁబడి పొడిచి పాఱఁదోలుదురు అని వినుచున్నాము గదా! అట్లే మనకు సంభవించిన యాపత్తును దప్పించుకొనవలెను. ఐకమత్యమును దేశాభిమానము ననునీ రెండే మనకు ఆయుధములు. ఇవి తప్ప వేఱు సాధనములు మనకు లేవు. ఉన్నను బనిచేయవు. ఇవి సామాన్యమయినవి కావు. ఎంతబలవంతుఁడగు శత్రువునైనను వీనితో జయింపవచ్చును. కావున నీయాయుధములు ధరించి మనవారు యుద్ధమునకు తయారుపడవలెను. ఒకలక్షమంది హిందువు లిట్లు సిద్ధపడి పైనచెప్పిన వేయిమంది దేశాభిమానులను ముందుంచుకొని ధైర్యసాహసములతోఁ బోరాడిన యెడల మనకుఁ బ్రతికక్షులుగా వచ్చెడు నితరదేశవర్తకుల యున్నస్థితి నడఁగింపవచ్చునని పూర్ణముగా నమ్మవచ్చును. ఇట్లు చేయక పోయితిమా మనదేశము నిశ్చయముగా దీనదశకువచ్చి పాడగునని తెలిసికొనవచ్చును. మనకాలములో బీదవాండ్రు కడుపులు సగము నిండించుకొని జీవించుచున్నారు. ఇప్పటి స్థితిచూడఁగా ముందిదియు నుండదేమో యని భయము పుట్టుచున్నది.

ఒకనాఁటి కొకనాఁడు మనదేశములోని సరకులు పరదేశములకుఁ గొనిపోఁబడుచున్నవి. ఇంగ్లీషువారు వ్యాపారము చేతిపనులు మొదలగు వానివలన వచ్చులాభముఁ గొనుటయే కాక మన నిక్షేపములు భూమినుండి త్రవ్వి బంగారు, వెండి, ఇనుము, నేలబొగ్గు, కారుసీసము, అభ్రకము మొదలయిన లోహములు గడ్డలుగడ్డలుగా ష్టీమరులు నిండించుకొని పోవుచున్నారు. విత్తనము నాఁటి భూమిమీఁదఁ బండించిన పంటయందురా, యీసంవత్సరము పండకున్న వచ్చుసంవత్సరము పండును. ఇతరపంటలు సగము తీసికొని పోయిన సగము మనకు మిగులును. గనులు త్రవ్వి భూమిగుల్లచేసి పోయినచో వానిలోనుండి తీసికొనిన పదార్థము లెప్పటికి మనకు మరలఁ బూర్తిగా



యగునా? అది నట్టిది. పదిసంవత్సరముల నాఁటికి మనభూమిలోనున్న బంగారము పూర్తిగాఁ దఱిగి రాళ్ళును మన్ను మాత్రము నిలుచును. ఇట్టి యపాయస్థితిలో మనదేశమునకుఁగా మనవారు ఒక చేతులు ముడుచుకొని 'యెట్లో దినములు వెళ్ళిపోవును. మొక్క చేసినవాఁడు నీళ్ళుపోయఁడా' యని వేదాంతము చెప్పుచుండిరా కొద్దికాలములోనే మనపూర్వనాగరికత చెడి వేదశాస్త్రేతిహాసము లున్నతావు తెలియకుండఁబోయి దేవాలయము బ్రహ్మాలయములు చూచువారు లేక విద్య, గ్రంథములు, వ్యాపారము నేమియుఁ దెలియని శుద్ధమూర్ఖులయి ఆంగ్లేయులకో లేక యేదేశమువారీదేశమును జయింతురో వారికో ఆఫ్రికాఖండములోని యడవిమనుష్యులవలె వశులై పోవుదురు. మేము పూర్వమీదేశవాసులము, ఇదిమా దేశము, ఈదేశమునకు మేమే స్వతంత్రులము, ఇందుఁగల పదార్థములన్నియు మావి కాని యితరులవి కావు, మాయిష్టము వచ్చినట్లు దేశపాలనము చేయుదుము మాపూర్వీకాచారముల స్థాపనలు శాస్త్రములు కాపాడఁబడిన రానురాను ధనము విద్య అధికారము స్వాతంత్ర్యము గౌరవమును బొందెదమనియు నిశ్చయింప నెవరికైన నాశయముదోఁచిన యెడల వారు మనకది తెలియఁ జేసినచో నెంతో ఘనమగు నుపకారము చేసినవా రగుదురు గదా! కాని మనకొక విషయమునమాత్రము విశేషసాధక మున్నది. ఏదియనఁగా:—మనలను ఇంగ్లీషువారు పాలించుచుండుట వలన మనకేమియు హానిలేదని నమ్మవచ్చును. బ్రిటిషు రాజాంగమువారు మనధనాదికముఁ గొనినను విరోధముమాత్రము చేయరు. ఈసహాయము గొని మనవారైనంత యత్నమును జేసితిమా యవి సాధ్యమగుటలో నెవ్వరు నాటంకము చేయువారుండరు. కనుక యీసమయము పోఁగొట్టుకొనక యీదేశమునకు రాఁబోవు లాభనష్టముల నాలోచించి యందఱు నొక్కటిగాఁ గూడి దేశాభిమానముతో మనతరువాతివారి క్షేమమునకయి కష్టములో సుఖములోపడి మనము యత్నములు చేయవలెను.

దేశాభిమానమును జనైక్యమును నను రెండాయుధములు హిందువులు ధరింపవలెనని చెప్పినారు, వానిం బట్టుకొని యేమిచేయువలయును! అని యిదిచదివినవారడుగవచ్చును. చేతిపనులు నశించుచున్నవి. వ్యాపారము పరీక్షకము నాంగ్లేయుల ప్రబలము వలన మనవశములో లేవు. కావున నింకను మనదేశస్థుల చేతులలో పనులున్నవి. అవిపూర్వకాలపు వాని క్రిందనెన్నఁబడి యేదో మూలమూలఁబడి వానివలనఁ [illegible] పనివాండ్రు సామాన్యజీవనము చేయుచున్నారు. వారిని మనమాదరింపకుంటిమా [illegible] కాలములో నాపనులు నశించును. వారుచేసిన సరకులు కొనువారే లేరు. ఎవ్వరైనను [illegible]వసరముచేతనో ముచ్చట[illegible] దంతపుసామానులు కొన్ని చేయుమని

ముందుసొమ్మిచ్చినచో దాని నాపనివాండ్రు తిండిక్రింద సెలవుచేసి వారికిఁ జేసి యీవలసిన వస్తువులు చిరకాలమీయక పోవుటచే వారును వీరును గలహము పెంచుకొనుటయుఁ జిట్టచివరకు చేసియిచ్చుటయుఁ సాధారణముగా జరగుచున్నది. పనివాండ్రిట్లుచేయుట బీదతనము చేతనేగాని మఱియొందువలననుగాదు. ఇట్లు ముందుసొమ్మిచ్చినవారికిఁ జేసియిచ్చుటయేగాని తమస్వంతధనముతో నెక్కువగా సరకులుచేసి పట్టనములకుఁ దీసికొనిపోయి లాభమున కమ్ముకొనుసామర్థ్యము వారియందులేదు. తాముచేయు సామానులెవ్వరుకొందురో యెక్కడికిఁ బట్టుకొని పోవలెనో వారెఱుఁగనే యెఱుఁగరు. ఇట్టి యంధకారములోఁ బడియున్న కర్మకారులలో ముఖ్యమయినవారు బట్టలునేయు సాలీలు మున్నగువారు. వీరిప్పటికిని నాణెమయిన బట్టలును మోటుబట్టలును గూడ నేయుచున్నారు. మాంచెస్టరు పట్టనపు పోటీవలనఁ బ్రతిదినముఁ గట్టుకొనుటకుఁ దగిన సామాన్యవస్త్రములు గూడ నిక్కడ నేయఁబడక పోయినను జరీబట్టలు, తలరుమాళ్ళు, చేతిరుమాళ్లు, రుమాళ్లు, దుప్పటములు మొదలయినవి నేయఁబడుచున్నవి. బీదలు కట్టుకొనుటకుఁ దగిన ముతకబట్టలిక్కడే నేయఁబడుచున్నవి. ఉద్యోగస్థులు ధరింపఁ దగిన వెలగల రోమసంబంధమయిన వస్త్రములు ఇండియాలోఁ జేయఁబడుచున్నవి. ఇదిగాక నిన్నటివఱకు మనస్త్రీలు మనదేశములో నేయఁబడునవియే కట్టుకొనుచుండువారు. ఇప్పుడు ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాంసు, మున్నగుతావులనుండి వచ్చు చీటీతానులు చవుకగా వచ్చుచున్నవనియుఁ గంటికి ధాతుగా నగపడుచున్నవనియుఁ వానింగొని యుపయోగించుచున్నారు. ఈయలవాటుల నిండియావారు మానుకొనవలెను. ఇతరదేశములనుండి దిగుమతీయగు నేవస్త్రములును స్త్రీలుగాని పురుషులుగాని ధరింపవలదు. ధరింపమని వ్రతముపూనవలయును. స్త్రీలు ధరించువానిం జెప్పినయెడల, మన కోర్నాడు, కాంచీపురము, మధుర యీమున్నగు స్థలములలో నేయఁబడువానికంటె శ్రేష్ఠమయినవి యేదేశములోఁ జిక్కును? బీదలకుఁ దగినట్లు పల్లెటూళ్ళలో గట్టివి చిరగిపోనివి నేయుచున్నారుగదా! పురుషులు కట్టుకొను బట్టలును మనదేశములో నూళ్ళలో నేయునవియే కొనవచ్చును. సీమబట్టలవలె మనదేశపువి కంటికి ధగధగమని కనఁబడక పోయినను, బహుకాలము వాడుకలో నుండును గనుక వానిం గొనుటలో నష్టమింతయును లేదు. చొక్కాయిలకును, కొన్ని దళసరివి మనవారు నేయుచున్నారు. వానినే మనదేశస్థులు కొని యుపయోగింపవలెను. బట్టలేకాక యీవిధముగా ననేకములైన చిల్లరసామాను లిక్కడనే చేయఁబడుచున్నదున దప్పకుండ నాసరకులే కొని వాడుకొనుచుండవలెను. కలము చెక్కు-



కొను కీలుకత్తులు, కప్పతాళములు, మట్టితోఁ జేయు పాత్రలు, వినోదములైన యాటసామానులు మొదలైనవి యిండియాలోనే చేయుచున్నారు. కావున సీమసరుకులు కొనము, మనదేశసామానులే కొందుమని తలంచికొనవలయును. కల్కత్తాలోను, కాకినాడలోను, అహమదాబాదులోను వస్తుప్రదర్శన సభలు జరగినపుడు వానింజూచి మనదేశములో నిక్కడివారి కుపయోగపడు పలుసరకు లిక్కడనే చేయఁబడుచున్నవిగదా యని యా[illegible] దోఁచక మానదు. ఇట్టి వస్తువులన్నియుఁ గొంపలోకొక్కచోటికిఁ జేర్చియుంచి యమ్ముచున్న సామానులంగడులను గొనుటకు వీలుగా నుండును. అందుకుగా నిట్టిది యొక్కయంగడి పెట్టించుట మన దేశాభిమానుల మొదటి పని యైయున్నది.

### సోమరితనము మనలను బాధచేయుచున్నది.

ఒకని మేలుకొఱకు, వాని ప్రయత్నమున్ను, పరులసహాయము నెట్లవశ్యములో యట్లే యొక జనసంఘము మేలును గూర్చియు నీరెండే కావలసియున్నవి. ఇండియాలో నివసించుజనుల మేలు ముఖ్యముగా నన్యులైన బ్రిటిష్‌రాజ్యమువారివలననే కావలసియున్నది. జనులుసామర్థ్యమును ననుభవము లేనివారునై యున్నారు. వారియొద్ద ధనములేదు. మైత్రిలేదు. వారు తమరు చేయు ప్రయత్నములవలననే పెద్దకార్యములగునని నమ్ముకొనుట సరికాదు. కావునఁ బ్రభువులే వారికిఁ గావలసినవివి, యక్కఱలేనివివి యని యేర్పాటుచేసి యివ్వవలయును. ఇట్టివానిలోఁ బ్రభువులు సంబంధము కలుగఁ జేసికొనఁ గూడదని యింగ్లాండుదేశమువారి యభిప్రాయము, కాని జర్మనీ, ఫ్రాంసు, అమెరికా, జపాన్ మొదలుగాఁగల యితరదేశస్థులు, పరిపాలనచేయువారే మేలుచేయవలయుననియు, ఏయేవిషయము జనులలోఁ జాలామందికి లాభకరమైనదై యుండి జనులవలనఁ జేయుటకుసాధ్యము కాకయుండునో దానిని రాజులే చేసియిచ్చుట ముఖ్యమనియు నెంచుచున్నారు. ఇంగ్లాండులోఁ గూడఁ బైనఁ గనఁబఱచిన పురాతనాభిప్రాయములు మారి బలహీనులను బలవంతులు హింసింపకుండ దుర్బలులను మోసముచేయకుండఁ దామే తెలివితక్కువచేఁ దమ్ము మోసముచేసికొనకుండునట్టి యభిప్రాయముతో జనులయొక్క స్వవిషయములలో నేలెడువారు సంబంధము కల్పించుకొనవచ్చునని నిశ్చయము క్రమక్రమముగాఁ జేయఁబడుచున్నది. ఇండియాలో నట్టికట్టుపాటులేదు. ఇక్కడ బీదలను ధనవంతులు పీల్చి పిప్పిచేయుచున్నారు. అధికారులు సామాన్యజనులను హింసించుచుఁ దమగొప్పను గనఁబఱచుకొనుచున్నారు. తెల్లవారు నల్లవారిని దేలికగా గణించుచున్నారు. ఇట్టి యక్రమములు

పోఁగొట్టుటకు నిండియాలో రాజ్యాంగమువారు ప్రవేశించుటలేదు. ఆక్రమములను వారించుటయే కాక సహాయము చేయుటయును ప్రభువులపనియే యైనప్పటికిని నదియుం జేయుట కానము. ఇండియాలో నకస్మాత్తుగా భూమిలోను వృక్షములలోను గనులలోను గనఁబడిన వస్తువులను గాంచి యివి యీపనులకక్కఱపడవచ్చును, వీని నిట్లు చేయవలెనని సలహాచెప్పి ప్రచురపఱచిన యెడల లోకుల కెంతయైన నుపయోగముగా నుండును. ఇతరదేశరాజ్యాంగము వారట్లు చేయుచున్నారు. మనదేశమున నదిలేదు.

ఈప్రకారముగా రాజాంగమువారు దేశక్షేమమున కక్కఱ గావలసిన పనులను జేయుచుండఁగాఁ బ్రజలేమయిన మేలుపడు కార్యములను జేయుచున్నారా యని విచారింతము. ప్రజలు తమలోఁ దామొనర్చుకొనఁ దగిన మేలుపనులు చాలకలవని యందఱికి నివిదితమే. అందు మొదటిది:— ప్రతిమనుష్యుఁడును దనస్థితిని వృద్ధిచేసికొనవలెనని తలంపు గలిగి యుండవలెను గదా! దేశమున కవశ్యమయిన మేళ్ళుచేసి తమకు లాభము వచ్చునట్లు చేయఁ దగినపనులు తారసిల్లినప్పుడు వానిం జేయవచ్చును గదా! తమకే లాభము లేకపోయినను దేశక్షేమమునకు నావశ్యకమయిన కార్యములు చేయవచ్చును గదా! ఇట్టి సమయము మనవారికిఁ దటస్థించుటలేదనికాని యవకాశము లేదనికాని చెప్పుట కేవలము నసత్యము. అనేకులు మిరాసీదారులు, వర్తకులు, ఉద్యోగస్థులు, వకీళ్ళు, ఉపాధ్యాయులుఁ గొంతకాలము పనిలేక యూరక కూర్చుండి యుండుట తటస్థించుచున్నది. ఆకాలములో నేమిచేయుచున్నారు. తమకుఁగాని యితరులకుఁగాని లాభకరమైన పనిఁజేయుచున్నారా! లేదు. ఆసావకాశదినములలో నిద్రపోవుట, ఆటలాడుట, వృథాప్రసంగములు చేయుటలచేఁ గాలము వ్యయపఱచుచున్నారు. వీరందఱును దమశక్తికొలఁది దేశక్షేమమునకయి పాటుపడుచుండిరా యెంతయుపయోగముగానుండును. గ్రామాధికారులైన మిరాసీదారులు తీరుబడిగానున్నపుడు గ్రామములోని రయితులు మొదలగు జనులను జోగుచేసి పత్రికలు చదివి వినిపించి వారినిఁగూడఁ జదువుమని బోధింపవచ్చును. లేక యూరిలో నేదైన తగవువచ్చి న్యాయస్థానముల కెక్కఁ జూచినపుడు వారిని బిలిచి మీరు ప్లీడర్లకు సాక్షులకు సొమ్మెందుకు సెలవు చేసికొందురు, మేము పంచాయతీ చేసి చెప్పినట్లు వినవలసినదని మందలించి వారిప్రయత్నములు నివారించి తామే న్యాయము చెప్పవచ్చును. ధనముగలవారియొద్ద తక్కువఫాయిదాకు కొంతధనము తెచ్చి చిన్నబ్యాంకి నొకటిస్థాపించి చిన్నచిన్న రయితులకు తక్కువవడ్డీలకు బదుళ్ళిచ్చి లాభముచేయవచ్చును.



ఊరువదలి పట్టణములలోనికి వచ్చినయెడల వకీళ్ళు, ఉపాధ్యాయులు, వైద్యులు, వర్తకులు మొదలగువారు తమకు ధనమెక్కువ దొరకినను సూహతో వారిని మఱింత చిక్కులలో దింపి పాడుచేయుదురుగాని బాగుచేయుటలేదు. ఆగ్రామస్థులు చదువుకొనిన వారయినను వృత్తాంతపత్రికలు చదువరు. లోకవ్యవహారములు వారికి బొత్తిగాఁ దెలియవు. చిన్నతనమున నేర్చుకొనిన యక్షరములుకూడ నభ్యాసములేక కొందఱు మఱచిపోయినారు. అట్లుగాక చదువు వృద్ధిచేసి తమజిల్లాలోనో తాలూకాలోనో లేక తమయూరిలోనో కల వ్యవహారములు చిత్రములు మొదలయినవి పత్రికలకు వ్రాయరాదా! మ్యునిసిపాలిటీవారికి వ్రాసి జనోపకారము చేయవచ్చును. ఇరుగుపొరుగువారికి బంధువులకు స్నేహితులకుఁ గలుగుచుండెడు వ్యాజ్యములలో మాధ్యస్థులై తీర్చుచుండవచ్చును. కార్ఖానాలుపెట్టి యేమైన గ్రామమువారికుపయోగించు పనులు చేయింపవచ్చును. పెట్టుబడిసొమ్ము సంపాదించి పనులేవైన చేయింపవచ్చును. ఇకనెన్నియో వ్యాపారములు చేయవచ్చును. ఆంగ్లేయులు, అమెరికావారు మొదలయినవారు కనఁబఱచు డాంబు దర్పము అట్టహాసములలోఁ బదిలో నొకవంతైన మనవారికడలేవు. ఎల్లప్పుడు నేదోలాభమునకు పనిచేయుచుండవలయునుగాని సోమరితనముగాఁ జెడిపోరాదను నిశ్చయబుద్ధి మనవారిలో లేదు. ఎప్పటికిఁ గలుగునో!

## దేశమున కొక్కనాయకుఁ డుండవలయును.

బ్రిటిష్ దేశములోఁ గూడ పెక్కువిషయములను గమనించి చేయుటలోఁ గూడ జనులందఱి నొక్కటిగాఁ జేర్చి సరియైనమార్గమున నడపించుట కొక్కొక్కనాయకుఁ డేర్పడియున్నాఁడు. రాజాంగసంబంధములోఁ బూర్వమునుండి యాదేశములో రెండు కక్షులేర్పడియున్నవి. అందొక కక్షిని కన్సర్వేటివ్ లేక టోరీ యనియును రెండవదానిని లిబరల్ లేక ర్యాడికల్ అనియుఁ బిలుతురు. ఈరెండును యూనియనిస్టు అనియును హోమ్రూలర్ అనియును జాలనాళ్ళక్రిందటనే పేరుపడినవి. బ్రిటిషుదేశమువారి రాజాంగసంబంధమయిన యేసంఘకార్యమునందును వైరెండు కక్షులలో నొకకక్షవారు చేరియుందురు. పార్లిమెంటుకు మెంబర్లనుగా నప్పుడప్పుడు జనులను నియమింపఁ బోవునప్పుడు ప్రతివారును దమతమ భాగమునఁ జేరినవారినే మెంబరుగా నియమింప పార్లిమెంటుమొత్తము మెంబర్లలోఁ గొందఱొక పార్శ్వమునను మఱికొందఱు మఱియొకపార్శ్వమునను జేరియుందురు. ఈరెండు కక్షులలో నేకక్షిలోఁ జేరినవారెక్కువసంఖ్య గలిగియున్నారో ఆకక్షిలోనున్న ముఖ్యులు

మంత్రులుగా మహారాజువలన నియమింపఁబడుదురు. ఈనియమింపఁబడిన మంత్రులు తమ కక్షిదారులకు నాయకులుగా దేశమువారివలన నంగీకరింపఁబడుదురు. ఈవిధముననే రెండవకక్షిలోఁ గూడ ముఖ్యులుగా మునుపొకసారి మంత్రులుగా నియమింపఁబడినవారు దేశములో రెండవకక్షివారికి నాయకులుగా నంగీకరింపఁ బడుదురు. ఇట్లు రాజకార్యవిషయములలో బుద్ధిమంతులయిన యెవరైనను నాయకులు వీరని తెలిసికొని వారు తెలియఁజేయు నభిప్రాయములకు సమ్మతించి వారు చెప్పినట్లును గోరునట్లును నడుచుకొనుచుందురు. ఒకసారి నాయకుఁడుగా నొకరేర్పడినట్లయిన వానిపై విరోధమునసూయఁ గనఁబఱచి వాని నగౌరవపఱచి మాటలాడి క్రిందికిఁ ద్రోసివేయవలెనని యెవ్వఁడును దలంపరు. అధికారిగా నేర్పడినవారొకటి రెండు విషయములలోఁ బరిశ్రమలేనివారైనను దెలిసినవారు వానికి సహాయముచేసి తమతోఁ గలిపి త్రిప్పుకొందురు. ఒకప్పుడు నియమింపఁబడిన వాఁడు రానురాను దగువులమాఱివాఁడని నిజము కనుఁగొనఁబడినచో రెండవతడవ వానిం దొలఁగించి తగిన మఱియొక్కనినేర్పఱచెదరు. నియామకునియిన వానిని, దినదినమును దప్పులుపట్టి కొండెములు చెప్పి యేయుపాయముచేతనైనఁ బడఁద్రోయవలెనని యెవ్వరును జూడరు. ఈప్రకారముగా రాజకార్యములకొఱకుఁ బ్రధానిని నియమించునట్లే మతవిషయికములకుఁ దప్ప మిగిలినయన్ని విషయములందును గూడ నిశ్చయింతురు. కట్టుదిట్టములు చేయునప్పుడును, బన్నులు కట్టునప్పుడును బైనియామకులయభిప్రాయమును, దానింబట్టి ప్రజల యభిప్రాయములను గూడఁ బుచ్చుకొందురు. ఇతరములైన వ్యాపారము, చేతిపనులు, దేశక్షేమము, కష్టసుఖములు, న్యాయాన్యాయములు సంపద్విపత్తులును బరీక్షించి జనులు సరియైన మార్గము వలంబించునట్లు చేయు నధికారులను నియమించెదరు. అట్టి యధికారులప్రయత్నముల వలన జనులు క్రమక్రమముగా జ్ఞానమును సంఘసౌఖ్యమును గలుగునట్లు చేసికొని తమలాభనష్టములను విచారించుకొని యధికారులమోసములకు లోనుగాకుండు నట్లలవాటు పడుచున్నారు. ఈయేర్పాటుచేతనే బ్రిటిష్‌వారియొక్క యభివృద్ధికయి దొరకిన వసతి యింతింతని చెప్పలేము. బ్రిటిష్‌దేశములో నెట్లో అట్లె నాగరికముగల ప్రతి యితరదేశమునందును బ్రజలకు నాయకులేర్పడియున్నారు. జపాన్‌దేశమిట్టి నాయకులుండుటచేతనే యిపుడింతటి మంచిస్థితిలోనికి వచ్చియున్నదని యీపుస్తకము చదివినవారికిఁ దెలియఁగలదు.

ఇండియాలోఁగూడ నిట్లు నియమింపఁబడుట మిక్కిలి యవశ్యము. ఇప్పుడు కొంచెము కొంచెముగా దేశాభిమానమును, జ్ఞానమును, సౌఖ్యమునందాశయు, మనస్సు



లలో మొలకలెత్తుచున్నవి. బుద్ధిమంతులైన కొందఱియొద్దికి మనము వెళ్ళి వేఱువేఱుగా దేశమును గుఱించి మాటలాడితిమా "నాశక్తికొలఁదికి సహాయముచేయుటకు సిద్ధముగానున్నా" నని యెవరిమట్టుకువారు చెప్పుచుందురు. కాని యీపనిచేయవలయును, దీనికయి యీసమయమున నిట్లు ప్రయత్నముచేయవలయు నని నియమము వారికిఁ దెలియనందునఁ దటస్థులయి యున్నారు. ముఖ్యులలో నొకరొకవిధముగాఁ జెప్పిన రెండవవారు రెండవవిధముగాఁ జెప్పుచున్నారు. ఏది జను లంగీకరింపఁగలరు? ఈదేశమున బుద్ధిమంతులు పెద్దమనుష్యులు పెక్కుమంది యుందురు. జనులలో నభిప్రాయభేదములు వచ్చినపు డందఱును "ఈపెద్దమనుష్యులు చెప్పినట్లు మనము నడచుకొంద" మని యొక నియమము చేసికొనవలయును. అట్లు నియమించుకోఁబడిన పెద్దమనుష్యులు ధైర్యశాలురుగాను చుఱుకుకఱుకు గలవారును, సామర్థ్యము, దేశాభిమానము నున్నవారు, వాక్చాతుర్యమున్నవారునుగా నుండుట మిక్కిలి మంచిది. అట్లుండినచో వారి యధికారము జనులయందు రాణించును. చుఱచుఱలాడుచుండు ధైర్యములేక, ఆంగ్లేయోద్యోగిని జూచి గజగజలాడునట్టి నాయకుఁ డేర్పడినందున లాభములేదు. చుఱుకుఁదనము దిట్టతనములేకపోయినచో నప్పుడప్పుడు దేశములోనానాభాగములకు వెళ్ళి యచ్చటివారి కుత్సాహము గలిగింపలేరు. మాటలనేర్పుగలవారుగా నుండవలయును. ఇట్టినాయకులు ఇండియాకంతకు నొక్కరిద్దఱుగాక యొక్కొకభాగమునకు (డివిజనుకు) ఒక్కొక్కరుండవలయును. అట్లున్నచో జనులందఱు నైకమత్యము నేర్చుకొనుటకును దేశసౌఖ్యముగోరువారగుటకును బహుకాలము పట్టును. పూర్వమునుండి హిందువులు జాతిమతాచారములచే వేఱుపడి యైకమత్యమునకు మాఱుగా విరోధభావముం గలిగియున్నారు. ముప్పదికోట్ల హిందువులును విరోధములేక యైకమత్యము గలిగినవారయిరేని వీరివలన జయింపరాని కార్యమొకటి జగంబున నుండునా? ఇఁక నేయితరగుణములలోను హిందువులు కొఱఁతపడినవారు కారు. కాకపోయినను ముందటి యాలోచనయును కలిసికట్టుతనమును లేనివారమగుటచే ముప్పదికోట్ల జనమును ముప్పదికోట్ల కాకులతో సమానులమగుదుము.

శ్రీరస్తు.

# జపాన్ దేశచరిత్రము.

## చరిత్రప్రారంభము.

---

### మొదటిప్రకరణము.

---

ఇండియాదేశమునకుఁ దూర్పుభాగమున బంగాళాఖాతములో సింగపూరు పినాంగు మొదలయిన రేవులు దాఁటి పసిఫిక్కుసముద్రముఁజేరి యుత్తరమునఁ జీనాసముద్రముం దాఁటి మొత్తము సుమారు పదుమూఁడు నాళ్లుయోడమీఁదిప్రయాణము చేసి జపాన్దేశమునకు వెళ్లవలయును.

ఈజపాన్ దేశమిప్పుడు విశేషమయిన కీర్తిని బొంది సైన్యబలపరాక్రమములచే పరిశుద్ధమైన సామర్థ్యముగలిగి సమయానుగుణమైన నాగరికతయు దానికిఁ దగిన శౌర్యధైర్యములును గలిగి యైరోపాదేశమునతో సమానమయినదని యెన్నఁబడుచున్నది. ఐరోపావారు నమెరికావారును దాము తెల్లవారగుటచేఁ దమతోసమానులితరవర్ణములవారిలో లేరనియుఁ దామే యీ[illegible]కిని దలవారై వారి సరకులు వర్తకము చేతిపనులు రాజ్యము మున్నగు నన్నియు వహింపఁ దగినవారమనియుఁ దమకు వారేమియు నసూయచేఁ జేయస్వాతంత్ర్యత లేని వారనియూ దలఁచుకొనుచున్నారు. ఐరోపా, అమెరికా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, మొదలయిన దేశములవారందఱును దెల్లవారనియుఁ దక్కినదేశములలో నివసించు హిందువులు, చీనావారు, జపాన్ వారు పారసీకులు, మహమ్మదీయులు, మొదలయినవారు నల్లవారనియు రెండుభేదములు సాధారణముగాఁ గలిగియున్న తెల్లవారు తమ సైన్యబలమువలనను గ్రంథములుచదివి నేర్చుకొనిన తంత్రముల సహాయమువలనను చేతిపనులు వర్తకము మొదలగువానియందుఁ గనఁబఱచుచున్న నిపుణతవలనను నితరజాతివారిని గ్రిందుపఱచి, పలుసౌఖ్యములను బొందుచున్నారు. లోకములో జపాను తప్పఁ దక్కిన తుర్కి, ఈజిప్టు, పెర్షియా, ఇండియా, చీనా, ఆఫ్రికా దక్షిణఅమెరికా, మఱియు సముద్రములలో నక్కడక్కడనున్న ద్వీపాంతరములును, ఐరోపావారి యొక్కగాని అమెరికావారియొక్కగాని పైవిచారణలోనో అధికారములోనో చేరియే యున్నవి. ఈతెల్లవారు ఆధిపత్యముగాని యధికారముగాని వ్యాపారముగాని స్థాపింపని తావు ప్రపంచమునం



దొక్కటియును గనఁబడదు. ఈరీతిగాఁ బశ్చిమదేశస్థుల బలము ప్రతిదిక్కున వృద్ధిపొందుచుండఁగా నాజాతిలోఁ జేరని జపానుదేశమువారు మాత్రము తమస్వాతంత్ర్యతను గాపాడుకొనుచువచ్చుటయే గాక పైవారితో సమానులుగా నంగీకరింపఁబడుచు వచ్చుచున్నారు.

సమీపమందలి చీనాదేశములో బాక్సరులను మోటజాతివారు తమదేశములోని కితరదేశమువారు రాకపోకలు చేయఁగూడదను నసూయచేత నక్కడకువచ్చినవారిని బాధించి చంపుటకు మొదలుపెట్టఁగా నింగ్లీషువారు తమవారికి సంభవించిన యాపదయును దమకుసంభవించిన పరాభవమును మనస్సునం దుంచుకొని ప్రతిక్రియచేయవలయునను తలంపుతోఁ జీనావారిమీఁదికి సేనలను బంపి బాక్సర్లను యుద్ధములోఁ జంపినారు. అప్పుడు జపానువారు ఐరోపావారితోఁ గలసి రణముచేసి వారికంటె యుద్ధములు చేయుటలోఁ దక్కువవారు కారను కీర్తిని బొందియున్నారు. భూమిమీఁదఁ జేయు యుద్ధములలోను సముద్రయుద్ధములలోను జపానువారు చూపించిన సామర్థ్యమును రుష్యావారును జర్మనీవారును గూడఁ జూచి యాశ్చర్యపడి పొగడియున్నారు.

యూరోపువారి నాగరికత గుణములు, చర్యలు, ధనము భూమి యెల్లెడవ్యాపించి యిచ్చిపుచ్చుకొనుట వ్యాపారముచేయుట, చేతిపనులొనర్చుట మొదలగువానివలన లాభనష్టహేతువు లేర్పడివచ్చుచున్నందున, వారికి, లోలోపలనే పోటీగా యసహనముగలిగి యెవరికి విశేషలాభము వచ్చునో యని వారు యత్నించుచున్నస్థితులలో జపానువారి స్నేహమువలన రాఁదగిన బలమునకుఁ గాని వారివిరోధమువలన వచ్చు దుర్బలమునకుఁ గాని యూరోపువారశ్రద్ధగానుండ వీలులేనివారగుచున్నారు. ఈయుద్దేశముతోడనే బ్రిటిష్వారు జపానువారి స్నేహమును గోరి వారితో 1902 సంవత్సరప్రారంభమున నొక యొడంబడిక చేసికొనిరి.

జపానుకు సమీపమునను్న చీనారాజ్యము పూర్వనాగరికతనే యనుసరించి తత్కాలమునఁ గల యూరోపునాగరికపువాడుకలు విచారింపక యాలోచనతక్కువచేతను రాచరికమందలి క్రమభంగమయిన కట్టుపాట్లచేతను దన్నుదానే కాపాడుకొనుశక్తి లేనిదైనది. కావున నది యూరోపువారి యత్యాశకు భక్ష్యమగునేమో యని తోఁచినందున నీయైరోపావారిలో నెవ్వరేకాలములో నితరుల జాగ్రత్తగా నున్నసమయమును గనిపెట్టి చీనాను కట్టిపుచ్చుకొందురో యని తలంపులుగలిగి చీనారాజ్యము తత్కాలమున నెంత స్థలవిస్తీర్ణము గలిగి యున్నదో య

దియే యెప్పుడును నిల్చియుండు విధము నైరోపావారు మాట్లాడుకొనిరి. అయినను, నొకరాజ్యమువారు మఱియొకరాజ్యమువారియందు నమ్మకము లేనివారై ముందేమి జరగునో యని సంకోచించి బ్రిటీషువారు జపానువారితోఁ బైనచెప్పినవిధమున నొడంబడిక చేసికొనిరి. చీనాకును జపానుకును దగ్గఱగానున్న రుషియావారు చీనాయొక్కయుత్తరభాగమును కట్టుకొని చీనాసముద్రమున కొద్దునఁ దమవ్యాపారమునకును సముద్రయుద్ధములుచేయుటకు వీలేర్పఱచుకొనుటకును నొకరేవు కావలయునని దానిపైఁ గన్నుపెట్టుకొని యున్నారు. ఇట్టి వీరి ప్రయత్నము నెఱవేరకుండు నుపాయము నాంగ్లేయులును అమెరికావారును మిక్కిలి జాగ్రత్తతోఁ జూచుచు వచ్చుచున్నారు. కాఁబట్టి చీనాదేశమును దానిదాఁపుననున్న కొరియా యను నింకొకదేశమును నిప్పు డనుభవించుచున్న స్వాధీనత యెప్పుడును గలిగి యుండవలయు ననునది యింగ్లీషువారి తలంపుగా నున్నది.

ఈప్రకారముగాఁ బడమటదేశస్థులైన యింగ్లీషువారు తూర్పుదేశములను స్వాధీనము చేసికొను ప్రయత్నములలో జపానుదేశమువారి సహాయము వారికొక సాధనముగా దలఁపఁబడుచున్నదను గొప్పవిషయము గతించిన ముప్పదియైదు సంవత్సరములలోపున నాదేశము పొందియున్నది. ఈగౌరవము నాదేశము పొందిన విషయము హిందువులు తెలిసికొనఁ దగియున్న దని యెంచి యిప్పటి జపాన్‌దేశ చరిత్రసంగ్రహము వ్రాయమొదలిడఁబడెను.

జప్పాన్‌రాజ్యము విస్తీర్ణమునందును జనసంఖ్యయందును నిండియాకంటెఁ జాల తక్కువ. అది పెక్కుద్వీపములుగా నున్నను నొక్కరాజ్యాంగమునకు లోఁబడి యున్నది. ఆద్వీపములు 411 లెక్కకువచ్చుచున్నవి. స్థలవిస్తీర్ణము సుమారు 15000 చతురపుమైళ్ళుకలదు. అనఁగా నిండియాయొక్క విస్తీర్ణములోఁ బదిలో నొక్కపాలున్నది. జనులు రమారమి 43,80,000. అనఁగా జన్నపట్టనరాజధానిలోని జనసంఖ్యకంటెఁ గొంచెమధికము. (చెన్నరాజధానిలోని జనులసంఖ్య 88,00,000) అయినను జనులుమిక్కిలి యిఱకటముగా నివసించుచున్నారు. చెన్నరాజధానిలో నొకచదరపుమైలునకు సరాసరి 270 మందికంటె నెక్కుడు మనుష్యులులేరు. ఏకాధిపత్యమగు జపానుదేశములోనో 880 మంది కలరు. కావున నీదేశము ప్రపంచమునందలి యేదేశముకంటెను గూడ నెక్కుడు జనసంఖ్యకలది. ఆదేశమునందును ఇండియావలెనే యక్కడి జనులకు వ్యవసాయమే ముఖ్యాధారము. చెన్నరాజధాని జపానుకంటె నధికవిస్తీర్ణము కల దైనను నుత్తరహిందూస్థానమునందును



యూరోపుదేశములోను గలయట్లు వర్తకము చేతిపనులు ముమ్మరముగా జరగుపట్టనములులేవు. ఒకలక్షమంది వసించు పట్టనములు చెన్నరాజధానిలో మూఁటికన్న నెక్కువలేనేలేవు. జపాన్‌దేశమునం దిట్టిపట్టనము లెనిమిది యున్నవి. జనులెంతయిరుకుగాఁ గాఁపురము చేయుచున్నను మనదేశమునందువలెనే జపానులోఁ గూడ నిరుడు నూరుగురున్న నీయేడు నూటపాతికగా నభివృద్ధి యగుచున్నది. ఇట్లు పెరుఁగుటవలనఁ గాలక్రమమున జనులకు వ్యవసాయము చేసికొని జీవించుటకును జాలినంత వీలుండకపోవు సమయము వచ్చును. మనదేశమునందును నీకారణముచేతనేగదా జనులకు జీవనోపాయములు తక్కువగుచున్నవి. అయినను జపానులో వ్యాపారములును చేతిపనులును మిక్కిలి చుఱుకుగా సమయానుగుణముగాఁ బెరిఁగివచ్చుచున్నందున వ్యవసాయము వలన దొరకుచున్న జీవనోపాయముకంటెఁ బైనఁ జెప్పిన స్వదేశములలోఁ బాగుగా వ్యాపారము చేయఁబడి చేతిపనులు క్రొత్తక్రొత్తగా వృద్ధియగుచుండుట వలన జనులను ధనాశకలిగి దీవులలోఁ బలుతావులఁ బెక్కురేవులలో సుఖపడుచున్నారనుట నిశ్చయమైన విషయము.



## రెండవప్రకరణము.

జప్పానువారు బౌద్ధమతావలంబకులు, ఈబౌద్ధమతము మనదేశములో సుమారు 2,600 సంవత్సరములకుఁ బూర్వము, ఉత్తరహిందూస్థానములో నీకాలమున అసామ్ అనిపిలువఁడు ప్రదేశములోఁ జేరిన కపిలవస్తువను క్షత్రియరాజ్యమునకు ప్రభువై యుండిన యొక్కగొప్పవానివలన స్థాపింపఁబడిన మతమని మనవారందఱు నెఱుఁగుదురు. ఈయన శాక్యముని యనియును పిమ్మట బౌద్ధముని యనియును జెప్పఁబడి దశావతారములలోఁ బదునొకటవ యవతారముగా నెంచఁబడిన గౌతమార్యవంశమున జనియించెను. ఈమత మార్యదేశమున సింధు, గంగా, యమున, నర్మద, తపతి, గోదావరి, కృష్ణ, కావేరి మొదలైన పుణ్యనదులు ప్రవహించుప్రతిభాగమునందును బ్రవహింపని భాగములందును గూడ బహుసంవత్సరములు ప్రబలముగా వ్యాపించి యామతమునననుసరించిన పలువిధములైన పద్ధతులు నాచారములును మనమతమువా రంగీకరించి మనమతాచారములలోఁ జేర్చియుండినందున నాబౌద్ధమతపుఁ బూర్వచరిత్రమును మనవారొక్కింత వినుట యవశ్యమే. కాని యీచిన్నపుస్తకములో వివరముగా వ్రాయుటకు వీలులేదు. కావున నొకవిధముగా సంగ్రహరూపమున నుడువఁబడును.

ఈబౌద్ధమతము హిందూదేశమున 1500 సంవత్సరములు పలుచోట్ల నవలంబింపఁబడియాచరింపఁబడినది. ఆదికాలమున బౌద్ధముని యున్నప్పుడును పిమ్మట వారిశిష్యపరంపరకాలములోను నీమతము మిక్కిలి ముమ్మరముగాఁ బ్రజలకు బోధింపఁబడి హిందూమతాచారములలో ననేకభేదములు గలుగుటకుఁ గారణమైనది. అనేకరాజు లీమతము నాదరించినందున నిది ప్రజలలోఁ గూడ విస్తారముగా వ్యాపించినది. బౌద్ధమతస్థులు మనవేదము లనాదియనిగాని సత్యమనిగాని నమ్మినవారు కారు. కాకపోయినను లోకము మాయయనియు సంసారము దుఃఖహేతు వనియు నాత్మకు పెక్కుజన్మములు కలవనియు లౌకికసుఖదుఃఖములను బట్టియే జన్మసార్థకమనియు ధర్మము చేయుటవలననే పునర్జన్మము నశించి తుదకు ముక్తిసిద్ధించుననియు నీరీతిని మన వేదాంతశాస్త్రమునందలి యంశములనే యవలంబించినవారు. అయినను విగ్రహారాధన వర్ణాశ్రమభేదములు యజ్ఞములు మొదలగు కొన్ని నిత్యనైమిత్తికకర్మలతోఁ గూడిన వైదికధర్మములు నామతమాదరింపక విరోధించినందున బౌద్ధమతమును వైదికమతమును వేఱువేఱుగా విడిపోయినవి. కొందఱురాజులు బౌద్ధమతమును మఱికొందఱు రాజులు



వైదికమతమును బరిపాలించినందున నొకరాజ్యముతో నొకరాజ్యమునకు మతభేదముల వలన వాదములు యుద్ధములు జరఁగి ధనహాని ప్రాణహాని సంభవించియు సంభవింపని యట్టిసమాధానముతో నుండినవి.

దాదాపుగా 2200 యేండ్లకుఁ బూర్వము, అనఁగా శాక్యముని బౌద్ధమతము స్థాపించిన 250 సంవత్సరములకుఁ బిమ్మట మగధదేశము నేలిన యశోకచక్రవర్తి వైదికమతమును విడిచి బౌద్ధమతము ననుసరించి దానిని మిక్కిలి ప్రబలముచేయుచు వచ్చెను. మాంసము తినుట మద్యపానము చేయుట యాగములలోఁ బశువులను జంపుట, దేవతలకుఁ బ్రాణులను బలియిచ్చుట, తక్కువజాతివారియందుఁ గ్రూరముగా నడచుట, స్త్రీలకు సన్న్యాసము మొదలయిన నివృత్తిమార్గములు తగవని చేయు నేర్పాటులును మున్నగు నీయాచారములు బ్రాహ్మణమతస్థులలో సామాన్యముగా నప్పటికాలములో నుండఁగా వాని నీబౌద్ధమతము ఖండించి మాన్పినది. ఇందుచే బ్రాహ్మణులకును బౌద్ధులకును దమలో భేదబుద్ధి కలిగి బౌద్ధమతము తలయెత్తుట వైదికమతమునకు ముప్పగుచున్నదని తెలిసి బ్రాహ్మణక్షత్రియశ్రేష్ఠులు పూర్వాచారములు బౌద్ధమతాచారములకు లోఁబడకుండ నొకవిధముగా మార్చి యెప్పటియట్లు జనులకు వైదికమతమునం దభిమానము పుట్టునట్లు చేయ మొదలుపెట్టిరి. హిందూమతాచార్యు లయిన శంకరులు రామానుజులవారు మొదలయినవారు బౌద్ధులతో వాదప్రతివాదములు కావించి బ్రాహ్మణమతము నక్కడక్కడ స్థాపించిరి.

ఇట్లుండఁగా బౌద్ధమతమువారును గ్రమక్రమముగాఁ దమలో బహువిధములైన భేదములు కలిగి నీచాచారముల నవలంబించి లౌకికవ్యవహారములలోఁ దగిలి యాశలకు లోనైరి. బౌద్ధమతము ననుసరించి సన్న్యాసమే విశేషమార్గమయినదని చెప్పఁబడినందున లక్షమంది సంసారములను విడిచి గ్రామములకు వెలుపటిభాగములయందు స్థాపింపఁబడియున్న మఠములలో నివసించి బిచ్చమెత్తుకొని భోజనముచేయుచు రాఁగా దేశమునందు బలువిధములైన పనులు వర్తకములు చేయువారున్నను వారి నాదరించి ప్రోత్సాహము చేయువారు లేకపోయిరి. బౌద్ధసన్న్యాసులును దమకు నియామకమయిన ధర్మములు కొంచెముకొంచెముగా విడిచి నీచాచారముల నవలంబించి సజ్జనులహృదయములలోఁ బావమయం దగౌరవమును దుకొల్పుకొనిరి. ఈవిధముగా బౌద్ధమతము గౌరవహీన మగుచు రానురాను హిందూమతాచార్యులప్రయత్నముల వలన బ్రాహ్మణమతము వృద్ధియగుచు బౌద్ధమతము హీనస్థితికి వచ్చినందున నిప్పటికి సుమారు వేయిసంవత్సరములకుఁ బూర్వము మహమ్మదీయులును నితరదేశ

ములనుండి యిండియామీఁదికి దండెత్త నారంభించిరి. మహమ్మదీయు లన్యమతద్వేషములు గలవారగుటచే నిక్కడఁ దమయునికికిఁ దగినసదుపాయములు గలుగునట్లు హిందువులతోను బౌద్ధులతోను విరోధించి వారిస్థాపనల నడఁచివేయఁ దలపెట్టిరి. ఆకాలము మొదలు బౌద్ధమతము మనయిండియాలోఁ గ్రమక్రమముగాఁ దక్కువయి చివరకుఁ గనఁబడకుండనే పోయినది.

ఇప్పుడిండియాలో 71,30000 మంది బౌద్ధమతస్థులున్నట్లు లెక్కవేయఁబడినది. అయినను బూర్ణముగా బౌద్ధమతస్థులయిన 69 లక్షలబర్మావారిని దీసివేసి చూడఁగా నిండియాలో నిల్చిన బౌద్ధులు 230 000 లకు మిక్కిలి లేరు. వీరు చాలమట్టుకు బంగాళము, ఆసాం, అండమాను ద్వీపములు, కాశ్మీరములలో నివసించినవారు. చెన్నపురి రాజధానిలోమాత్రమే 1086 గురు బౌద్ధులు మాత్రమే యున్నట్లు లెక్కకనఁబడుచున్నది, బౌద్ధమత మిండియాలో మిక్కిలియున్నతదశయందున్నకాలములో బౌద్ధమతాచార్యులు పరదేశములకు వెళ్ళి యక్కడక్కడఁ దమ మతమును స్థాపించిరి. సిలోన్, బర్మా, సయాం, కంబోడియా, సుమాత్రా జావా ద్వీపములు, టిబెట్, చైనా, కొరియా, జపాన్ అనునట్టి తూర్పుదిక్కుననున్న యీదేశములలోను [illegible] బడమటిదిక్కుల నున్న ఆఫ్గనిస్థానము, పర్షియా, ఈజిప్టు మొదలయిన దేశములలోను నీమతము బోధింపఁ బడుచు వచ్చుటయే కాక నక్కడి పూర్వమతస్థాపనములకుఁ గూడఁ గొంచెము భేదము కల్పించుచునే వచ్చెను. క్రీస్తుమతము మహమ్మదీయమతము నీదేశములలో స్థాపింపఁబడి ప్రబలమయినందున బౌద్ధమతాచారములయొక్క గుఱుతు లిప్పుడొక్కచోటను గూడఁ గనఁబడుటలేదు. అయిరోపావారవలంబించి ప్రపంచమంతయు నిండించుచు వచ్చుచున్న క్రీస్తుమతస్థాపకుఁడైన యేసుక్రీస్తు బౌద్ధమతధర్మములను దెలిసియున్నాఁడను నభిప్రాయము నిప్పటిబుద్ధిమంతులయిన పండితులు కొందఱికిఁ గలిగియున్నది. ఇప్పుడు సిలోనులోను బైనఁ జెప్పఁబడిన తూర్పుదేశములలోను బౌద్ధమతమే ముఖ్యమైనదిగా నెంచి సుమారు 40 కోట్లజనులకుఁ బైఁగా నీమతధర్మములనే యనుష్ఠించుచున్నారు.

ఇంచుమించుగా 1850 సంవత్సరములకు ముందు జపాను సమీపముననున్న కొరియా రాజ్యమునుండి జపాన్దేశమునకు వచ్చియున్న రాజదూతలు బౌద్ధమతప్రతిమనొకదానిని బౌద్ధమతధర్మములు స్పష్టముగాఁ దెలియు కొన్నిగ్రంథములును జపాన్చక్రవర్తికిచ్చిరి. ఆకాలమునకుఁ బూర్వమే కొరియా, చీనా దేశములలో బౌద్ధమతము స్థాపింపఁబడి యారెండుదేశములును నైకమత్యముగలిగి నాగరికత



నందుఁ బ్రసిద్ధినొంది యున్నందున నక్కడ నేయేస్థాపనలు ప్రతిష్ఠలు చేయఁబడియున్నవో యవియే తాము నాచరింపవలయు నను నమ్మకము జపాన్దేశమువారికిఁ గలిగినది. చక్రవర్తికిని వారియొద్దఁ గలవారికిని నీక్రొత్తమతమునకు సహాయము చేయ నిష్టము గలిగియుండెను. అయినను ఏదేశమునందుఁ గాని నవీనాచారములు ముఖ్యముగా మతవిషయికమైనవి భేదములు గలిగియుండునేగాని తోడనే యందఱు నొక్కమా టంగీకరించుట యుండదు. కాఁబట్టి యీబౌద్ధమతము ననుసరించిన సాధారణులకును మఱికొందఱు గొప్పకుటుంబమువారికి నుద్యోగస్థులకును విరోధము కలిగినది అయినను గాలక్రమమునఁ గొరియానుండి జపానునకు వచ్చుచుఁ బోవుచుండు జనసంఘము వలనఁ గొరియాలో నున్న బౌద్ధమతసంబంధములయిన ధర్మములు నున్నతతయు జపాన్ దేశస్థులలో వృద్ధియైనది. చక్రవర్తియు గొప్పగృహస్థులును నామతము నాచరించిరి. ఇండియాలో నేప్రకారముగా నశోకచక్రవర్తి యార్యమతానుష్ఠానపరాయణుఁడైయుండియుఁ బిమ్మట బౌద్ధమతమును బొంది దానినిండియాయందంతటను బ్రబలము చేసినాఁడో యాప్రకారముగనే జపాన్దేశములో షోటోకుతాయిషీ యను రాజు బౌద్ధమతమును స్థిరపఱచెను. రాజ్యాంగమువారే [illegible]నాదరింపఁ దలఁపెట్టినందువలన నది జనులలో సర్వసామాన్యముగాఁ బ్రబలుట[illegible] నమ్ముటకును ముఖ్యమయిన సాధనమయినది, ఆదేశపురాజు కొరియానుండి యొకబౌద్ధుని పిలిపించుకొని వానివలన దొంగతనము, నసత్యము చెప్పుట, కల్లుత్రాగుట, హింసచేయుట, వ్యభిచారము,ను బంచమహాపాతకము లని యుపదేశింపఁ బడెను. బౌద్ధసంబంధవిగ్రహములను జాలచేయించి శ్రేష్ఠమయిన యుత్సవములు చేయించినారు. పలుతావుల నాలయములు కట్టించిరి. ఈషోటోకుతాయిషీ క్రీస్తుపుట్టిన 622 సంవత్సరమున మృతినొందెను. తరువాత వచ్చినప్రభువులును మిగులభక్తిశ్రద్ధలతో నీమతమును రక్షించుచు వచ్చినందున జపానువారి గుణవిశేషములు, శాస్త్రములు, విద్యలు, కర్మలు మొదలయినవియును నైకమత్యముతోఁ గూడిననాగరికతయు బౌద్ధమతానుష్ఠానము యొక్క సహాయమును బొందినవై వృద్ధిపొందుచు వచ్చినవి.

## మూఁడవ ప్రకరణము

పూర్వకాలమున లోకములో నేదేశమునందును రాజుగా నొకఁడు పాలించుచుండ వానిని జుట్టికొలిచి యున దేశమునందలి పాళెదారులు, ముఠాదారులు పలెసేయ తేకులు సామంతరాజులుండి పెద్దరాజునావరుపు వలన వానికిఁ గావలసిన సమయములలో ధనము సైన్యము మొదలైన విచ్చి సహాయము చేయుచు వచ్చిరను విషయములు చరిత్రములయందుఁ జెప్పఁబడుచున్నవి. ఇవి సిద్ధాంతములనుటకు సందియము లేదు. అరీతినే జపాను దేశములోను జక్రవర్తి యొకఁడేకాధిపత్యము చేయుచు నున్నతస్థానమునందుండఁగా నతనికి సమీపప్రదేశములయందును దూరమునను చిన్నచిన్న రాజులు పలువురుండిరి. వీరును సమప్రజలయొద్దఁ బన్నులు పుచ్చుకొని సైన్యముం జేర్చి కోటలు నిర్మించుకొని న్యాయపరిపాలనము మొదలగు రాజకృత్యములను జేయుచు వచ్చినారు. వీరిలోఁ గూడ నొకొక్కసమయమున నందఱికంటె నొక్కఁడు బలవంతుఁడై యుండి చుట్టుప్రక్కలనున్న చిల్లరరాజులను భయపెట్టుచు వచ్చినదే గాక చక్రవర్తిని తమకు లోఁబడినవానింగాఁ జేసికొనుచు వచ్చెను. ఈవిధమున 12 వ శతాబ్దము చివర యోరిటోమో యను చిన్నరాజు ప్రబలుఁడై చక్రవర్తిని దనవశము చేసికొని వానిపేరుమీఁదఁ దానే పెద్దచక్రవర్తివలె సకలరాజ్యాంగాధికారములను చెల్లించుచు వచ్చినదానికిఁ దోడుగా నాకాలము మొదలు 1868 సంవత్సరమున సంభవించిన కలహము వఱకును సుమారు 700 సంవత్సరములు వీనిసంతతివారే సకలరాజ్యాధికారములను నడుపుచు పేరునకుమాత్రము చక్రవర్తి నొకనిని సింహాసనము మీఁదఁ గూర్చుండఁ బెట్టుచు వచ్చిరి.

ఈరీతినే యిండియాలోఁ గూడ జరగినది. మొగలాయిచక్రవర్తులు ఢిల్లీనగరమున నేకచ్ఛత్రాధిపత్యము స్థాపించి యిండియాయంతయును ఢిల్లీయేకాధిపత్యములోనికిఁ జేర్చి వారి శ్రేష్ఠత్వము, గొప్పతనము, ఐశ్వర్యము, కీర్తియుఁ బ్రపంచమునం దెల్లెడల వ్యాపింపఁ జేయుచు వచ్చిన దినములలో 17 వ శతాబ్దారంభమున మొగలాయి చక్రవర్తియయిన ఔరంగజీబు మహమ్మదీయమతముపై నెక్కుడగు నభిమానము కలిగి హిందువులను హింసింపనారంభము చేయుటచే నాతని కాలముననే మొగలాయి వంశస్థుల యధికారమును బలమును రాజ్యవిస్తీర్ణమును దక్కువైనందున ఔరంగజీబునకుఁ బిమ్మటఁ జక్రవర్తిగా వచ్చిన వాని సంతతివారే కచ్ఛత్రాధిపత్యములోఁ బలుపోట్లుగల కలహములను బోఁగొట్టి యధికారమును స్థాపించి రాజ్యము చే



యుసామర్థ్యము లేనివారయి నందున రమారమి యిండియాయందంతటను నిండియున్న మొగలాయీల యేకాధిపత్యము చిట్టచివరకు 18 వ శతాబ్దమధ్యమున ఢిల్లీనగరమును దాని చుట్టుప్రక్కలనున్న కొన్నిస్థలములు మాత్రమే మిగిలినవి.

మొగలాయిచక్రవర్తి తనకు మంత్రులే సైన్యబలమును ధనబలమును వృద్ధిచేయుచుండ వారికి లోఁబడి యెప్పుడైనఁ జక్రవర్తిని నియమించుటకుఁ గాని తప్పించుటకుఁ గాని వారే స్వతంత్రులుగా నుండునట్లు చేయ నా మొగలాయిరాజ్య మెక్కడనుండెనో యాస్థలము తెలియరాకుండ నడఁగిపోయినది. ఈ మొగలాయి ప్రభుత్వమువలననే మయిసూరుసంస్థానములోను కూడ 17—18 శతాబ్దములలో యిక్కట్టు సంభవించినది.

చాలకాలమునుండి మైసూరురాజ్యము హిందూరాజులు పరిపాలించుచు రాఁగా 17 శతాబ్దములోఁ గర్ణాటకములో నున్న యామహమ్మదీయులలో నధికారులతో మైసూరుసంస్థాన మెదిరింపవలసివచ్చినపుడు హైదరాలీయను నొకరాణువవీరుఁడు తనసామర్థ్యముచేతను గుప్తతంత్రముచేతను రాజునకు సేవకునివలె నటించి సైన్యమును దనవశము చేసికొని రాజును లోఁబఱచుకొని యతని నొకమూలఁబడఁ జేసెను. హైదరాలీ బ్రతికి యున్నంతకాలమునందంతయు రాజు పైస్థితిలోనే యుంచఁబడుటయే కాక హైదరాలీ చనిపోయిన పిమ్మట నతని కుమారుఁడైన టిప్పుసుల్తాను మైసూరురాజ్యమునకుఁ బ్రభువుగా నియమింపఁబడినాఁడే కాని హిందూరాజునకు హైదరాలీ వేసిన హీనస్థితిలోనుండి విమోచనము కలుగకపోయినది. టిప్పుసుల్తాను బ్రిటిషువారితో యుద్ధముచేసి చనిపోఁగా మైసూరుసంస్థానమును బ్రిటిషువారు పుచ్చుకొనినపుడు దానిని బూర్వకాలపు హిందూరాజవంశములోని వాఁడును నపుడు బాల్యదశలో నున్నవాఁడును నైన మహారాజకృష్ణరాజఉడయారయన కొప్పగించిరి. ఆకృష్ణరాజ ఉడయారు పేరనే యిప్పటికిని మైసూరుసంస్థానము వచ్చుచున్నది.

ఈప్రకారముగనే జపాన్ దేశములోను జక్రవర్తి నొకమూలవైచి పేరునకుమాత్రము చక్రవర్తిగా నుండులాగున యోరిటోమో యొక్క వంశము వారున్ను ఆవంశము నశించినపిదప వానికిఁ బోటీగాఁ జాలకాలము పోరాడుచువచ్చిన మఱియొక బలవంతుని వంశమువారును నక్లే యప్పుడప్పుడెవఁడు బలవంతుఁడై తనయధికారమును స్థాపింప శక్తిగలిగి యున్నాఁడో వానివంశమువారును షోగూన్ అనుపట్టముగట్టి జపాను దేశమును పాలించుచు వచ్చెనువారు. ఇట్లు పరిపాలింపవచ్చినవారు కూడఁ గాలక్రమమున రాజ్యాధికారమును దమవశమే చేసికొనకుండ పేరుమాత్రము పె

ట్టుకొని, సర్వాధికారము దమవశముచేసిన బలవంతున కొప్పగించి, యాబలశాలి తమయిష్టమువచ్చినట్లు నియమించుచుఁ దప్పించుచురాఁగా నది షోగూనులకుఁ గష్ట కారణమయినది. ఇట్లు చక్రవర్తియును బొత్తిగ నధికారము లేనివాఁడై షోగూనులు హీనస్థితికి రాఁగా రాజ్యాంగము లేకపోవుటచేత జపానుదేశములో నక్కడక్కడ సేనానాయకులుగా నేర్పడియున్నవారు బలవంతులై తమసైన్యముల నాదరించు నిమిత్తము రైతులను గష్టపెట్టి ధనము గొనఁజొచ్చిరి. దేశస్థితి యిట్లున్నను శాంతగుణముగల జనులు పరిపాలకులయెడల భయభక్తులతో సంచరించుచున్నందునఁ బొదుపుగాను నెమ్మదిగాను ననువుగానే జీవించుచుండిరి. కాని వర్తకముగాని కారుఖానాలు మొదలైన చేతిపనులు గాని సాగనందున మొత్తమున జనులు దరిద్రులుగానే యుండిరి. ఇట్లుండిన కాలమున నిండియాలో మొగలాయిప్రభుత్వము బలముడిగి బంగాళము, అయోధ్య, గూర్జరము. హైదరాబాదు, కర్ణాటకము మొదలయిన ప్రదేశములు మొగలాయి చక్రవర్తి పేరుమీఁదఁ బరిపాలించుచు వచ్చిన నవాబు లెట్లు చక్రవర్తియధికారమును ధిక్కరించి స్వాధీనప్రభుత్వము చేసికొనుచు వచ్చిరో, యట్లే, జపానులోఁ జక్రవర్తియొకఁ డున్నను వానిని మీఱి షోగూనను వారేర్పడినను వారిని మీఱి యక్కడికక్కడనే చిన్నచిన్నమాగాణములను నిర్వాహకులుగా నేర్పడియున్న యుద్యోగస్థులు, స్వతంత్రులుగాను, ఆయారాజ్యముల కాయావారే స్వతంత్రప్రభువులుగాను నేలుబడి చేయుచు వచ్చిరి. 1568 సంవత్సరమున నోబునాకా యను నొకబలవంతుఁడు షోగూను పట్టనమువారికిఁ బ్రతినిధిగా నియమింపఁబడి తనసైన్యబలమువలనను ధైర్యమువలనను సర్వాధికారమును దనచేతిలో నుంచుకొని జపాన్ దేశమునంతయుఁ దనయధికారమునకు లోఁబఱిచి తానే చక్రవర్తియై యేలవలె ననుపేరాస గలవాఁడై తన్నెదిరించిన యితరప్రబలులతోఁ బోరుచేసి చివరకు 1582 సంవత్సరమున వీని నొకచోట విరోధులు పొంచి చుట్టుకొని చంపఁజూడఁ దానును నింటికిఁ జిచ్చును నిప్పుముట్టించి హత్యచేసుకొనెను.

ఈతని కాలములో సెంటు జేవియర్ అను లోకప్రసిద్ధుఁడైన క్రీసుమతాచార్యుఁడు జపానుకు వచ్చి యనేకజనులను క్రీసుమతమువారినిగాఁ జేయుటయేఁగాక మాగాణములకు నాయకులైన చిన్నరాజు లనుగూడఁ దనమతమునఁ జేరునట్లు చేసి 'పోపు' అను లోకగురువుగారుండు రోమాపురపీఠమునకు చిన్నరాజులలోఁ గొందఱిని బంపనక్కడఁ 'బోపు' ఆచార్యులుగారు వీరిని మిక్కిలి మరియాదగా నుప



చారములు చేసి బహుమానములతోఁ బంపినారు. నోబునాకా యొక్క కాలములోనే యెట్లుక్రైస్తవమతస్థులు వీరిసహాయమున నడపుచు వచ్చినారో యట్లే వారికాలమునకుఁ బిమ్మటివారును వారిమోస్తరుగనే యత్యాశయును సైన్యబలమును గల హిదేయోషి కాలములోను గూడఁ గ్రైస్తవులు నడచుచు వచ్చిరి. ఇట్లుండ సెంటుజేవియరు స్థాపించిన క్రైస్తవప్రవర్తన యనునది స్పెయిను దేశములోను పోర్చుగలుదేశమునందును గల యితరక్రీస్తుమతస్థులయొక్క యసూయను వృద్ధిచేసినది. పోర్చుగీజువారింతకుమును పే జపానులో విశేషముగా వర్తకములు చేయుచు వచ్చుచున్నది చూచి స్పెయినుదేశమువారు సహింపలేక యప్పుడు స్పెయినుదేశమునకు లోనైయున్న ఫిలిపైను ద్వీపమునకు ముఖ్యపట్టనమయిన మనిలాలోనున్న స్పానియానాయకుండు జపానుతో వ్యాపారము చేయ ననుమతి యడిగి వార్తయంపఁగా హిదేయోషియును దానికి సమ్మతించెను వెంటనే సెంటుజేవియరుగారి స్వకీయక్రైస్తవమతస్థులకును స్పానియావారికి విరోధము కలిగి యొకరిమీఁద మఱియొకరు హిదేయోషికి క్రైస్తవులు కేవలమతప్రబలమునకై వచ్చినవారు కారనియును జివరకు జపానుదేశమునే తమవశమునకు లోనుగావించుకొని పాలించవలెనని తలంపు గలవారనియును సందేహము గలిగినది. నాప్రభువయిన రాజే యితర జనులను వశపఱచుకొనుటకు మొదట మతాచార్యులను బంపి వారిని గ్రీస్తువారినిగాఁ జేసి పిమ్మట సైన్యమును బంపి యాక్రైస్తవజనులతోఁ జేరిన దేశమునే సులభముగా జయించు నని పోర్చుగీసువారి సముద్రసేనాధిపతి 1587 సంవత్సరమునఁ జెప్పిన కొన్నివాక్యము లీసందేహమును మఱింత బలపఱిచె నది హిదేయోషీ మనస్సులో లోఁతుగా నాలోచించి యాక్రీస్తువారిని దనదేశములో నొకనిముషమయినను నిలువనిచ్చుట పెద్దయాపదకు మూలమగు నని నిశ్చయించి యిరువది దినములలోపున జపానులోనుండు నన్యమతాచార్యు లెవ్వరుగాని జపానుదేశము విడిచిపోకున్నయెడల వారు హింసింపఁబడెదరని ఖండితమయిన యుత్తరువును బ్రచురము చేసెను. ఆయుత్తరవు ననుసరించి యనేకేతరమతాచార్యులు జపాను విడిచిపోయిరిగాని 1598 సంవత్సరమున వారిలో 60 మంది కనఁబడఁగా వారిని నాకశాక్కియను జపానులోని యొక రేవునకుఁ దీసికొనిపోయి యచ్చట నగ్నిలోఁ బడవైచి చంపిరి. జపానులోని క్రైస్తవమతమును వేఱుతోఁ బెకలింపవలె ననిన తలంపున జపానువారామతమువారికి జంపుట కిదియే మొదటితడవ.

ఇది యిట్లుండ హిదేయోషీ కలహమొనర్చి పెక్కుమాగాణములను జయించి చక్రవర్తియొక్క యధికారమును బలపఱచినట్లు ప్రచురముచేయుచుఁ దనయధికార

మానే బలపఱచుకొనియెను. ఈ హిదేయోషీకి గల యత్యాశకుఁ దగినసామర్థ్యము గలవాఁడనియు నిదివఱకే చెప్పియుంటిమి. 'జపాను దేశమునంతయు నొక్కటిగాఁ జేర్చి యొక్కఁగొనుగు నీవను నిల్పి యాప్రభుండు రాజ్యాబలము వలన [illegible] లు చేయించి తక్కిన యవసరమయిన సామగ్రిని సిద్ధపఱచి కొరియాదేశమును జయింతును. అట్లు జయించినందులకు బహుమతిగా నాకొరియాదేశమును నావశము చేసినయెడల నాబలముచేఁ గొరియాలో నుండి సైన్యమును బయలువెడలించి చీనాదేశమును గూడ లోఁబఱచుకొందును. కొరియా, చీనా, జపాన్, యీమూఁడింటిని నొక ప్రభుత్వముక్రింద నమర్చెదను. ఈదేశముల నన్నిటిని నొకఁడు తుంగచాఁపలోఁ బెట్టిచుట్టి చంకలోఁ బెట్టుకొని సులువుగాఁ బోఁదగినట్లుచేయఁగల' నని చెప్పెను. ఇట్లు చెప్పుటకుఁ దగిన హిదేయోషీ జపాను నంతను నొక్కటిగావశము చేసికొని యున్నందునఁ గొరియా, చీనా దేశములను జయించి తనవశముఁ జేసికొనవలసిన పని యొక్కటి మిగిలియున్నది. ఏయుద్ధవీరుఁ డితరదేశమును దనబలముచే నాక్రమించి యేలవలయునను నాసపడి యుండునో కాని వీనికొకవిధమయిన మిషకనఁబడకుండదు. దీనికి జరిత్రదృష్టాంతము లనేకములు చెప్పఁగలము. హిదేయోషీకిఁ గూడ నీవిధమయిన సాకు కనఁబడకుండ లేదు. చాలకాలమునుండి కొరియాదేశపురాజు జపాను చక్రవర్తికి బహుమానములు కానుకలు బంపుట వాడుకయై యుండి కొంతకాలమునుండి యాయాచారమును నిల్పివేసినందున హిదేయోషీ యదియొక కారణముగాఁ గల్పించి కొరియారాజునకు మఱవిపంపఁగాఁ గొరియాప్రభువు తనమంత్రులను జపానునకుఁ బంపి సంధికివిరోధముగాకుండఁ జేయవలయు నని యత్నించెను గాని లాభకారి కాకపోయెను. హిదేయోషీ మూఁడులక్షల సైన్యమును సిద్ధపఱచి స్వయముగా నాసేనలను నడపఁదగిన సేనానాయకుల నియమించి పంపెను. కొరియారాజు జపాన్ దేశమునుండివచ్చిన యాసేనలనెదిరించు సామర్థ్యము లేనివాఁ డయినందున చీనాదేశప్రభుని సహాయమును మిక్కిలిగాఁ గోరి యడుగ నందువలనఁ గొంతసహాయము కలిగినది. పలుతావుల యుద్ధములు జరగి మొత్తముమీఁద జపాను సేనలోనివారు గెలిచినను వారును గొరియా, చీనాదేశస్థులవలెనే యీలాభములేని యుద్ధమునందు మనశ్చాంచల్యము గలిగి దాని నేవిధముగానైన ముగించుట మంచిదని నిశ్చయించిరి. ఆదులకుఁ దగినట్లె సంధిచేయఁ బడిరి. కొరియాకు యుద్ధమున కేగిన సేనలు జపానునకుఁ దిరిగిపోయెను. ఈవిధముగా ప్రపంచమునందు నాదికాలము మొదలిప్పటివఱకును రాజులు దురాశకులవారై యుద్ధ



ములుచేసి ధనహాని, ప్రాణహాని, కలవులు, కష్టములు మొదలైనవి కలుగఁజేయుచుండిరి. ఈయుద్ధము మొదలుపెట్టినవాఁడు మఱియేవిధమయిన లాభమునుగాని పొందినవాఁడు కాఁడు. కొరియాలో యుద్ధము జరగినకాలమంతయును జపానులోఁ దన నివాసస్థానమయిన కోటలోనుండి దనసేనలు జయించి ధ్వజమెత్తి కీర్తినిబొంది తిరిగి వచ్చుటలేదే యను నాలోచనతోఁ గనిపెట్టుకొనియుండ, హిదేయోషీకి క్రమక్రమముగా గెలుపులున్నవని గాని క్రొత్తక్రొత్తగా దేశములు జయింపఁబడినవనిగాని వార్తలు రాకుండఁ దనసేనాధిపతులు మేలు నడపుటలో నొకరితో నొకరు భేదబుద్ధి గలిగినవారనియుఁ దమసేన యుపవాసములతోడను నితరదుఃఖములతోడను గష్టములు పొందిననియుఁ గొరియాదేశస్థులు తమ్ము భయపెట్టి నిందించి శాపము లిచ్చినారనియు నే వాతలు వచ్చినవి. అయిన నొకరీతిగా మాత్ర మీయుద్ధముచేత జపానుకు మేలే కలిగినది. కొరియాలో నుండి జపానుకుఁ దిరిగివచ్చుసమయమున నక్కడనున్న కొందఱు పనివాండ్రను జపానునకుఁ దెచ్చి యచ్చటనే శాకపురమును [illegible] దున నిప్పటిదాఁక జపానువారు సుందరమ్ముయిన పింగాణి సామానులు చేయుదురను కీర్తికి గారణభూతులయిరి.

హిదేయోషీ 1598 సంవత్సరమున మృతినొందెను. ఇతనికొడుకు చిన్నవాఁడయి యున్నందున టోకుగావా అయియేసు అనువాఁడు షోగూను పట్టమును వహించి 1615 సంవత్సరమునఁ రాజ్యాంగమును మిక్కిలి సమర్థతతోడను దేశాభిమానముతోడను నడపుచురాఁగా నతనిసంతతివారు సుమారు 250 సంవత్సరములవఱకు నాదేశమునకుఁ గలుగుచు వచ్చిన క్షేమలాభములలోఁ బాలుపంచుకొనుచు వచ్చిరి. హిదేయోషీవలెనే యచ్చటచ్చటఁ గల మాగాణములలో స్వతంత్రులై పరిపాలించుచు వచ్చిన యుద్ధనాయకులు తమసైన్యబలమువలనఁ గ్రిందుపఱచి దేశమందే సమాధానమును నభివృద్ధిని స్థాపింపవలసిన దైనను ఈ అయియేసు మూర్ఖగుణమును బ్రతిక్రియచేయు గుణమును లేనివాఁడయి నిధానముగలవాఁడుగాను సామోపాయమున దృష్టిగలవాఁడుగాను న్నందున నాకాలమున చిన్నచిన్న రాజులుగా నున్న 260 మందిని దన[illegible] భక్తివిశ్వాసములు గలవారినిగాఁ జేసికొనియెను. ఎప్పుడును వాడుకలోలేని క్రొత్తయాచారములుగాని చాలకాలమునకు ముందే పొందుకొనియున్న స్థాపనములకు విరోధముగాఁ గొత్తవిగాని దేశమువారి కిష్టములేనివి నెలవేర్పఁ గూడదని యెఱిఁగి యప్పటి స్థితికిఁ దగినట్లు మాఱునట్లు చేయుటలో రాజ్యాంగమువారి విధియని యెంచి యట్లుచేయుచుచు వచ్చెను. కాఁబట్టి జపానుదేశములో యొరిటోమో కాలము

మొదలు పెక్కువందలసంవత్సరములనుండి చక్రవర్తియనియును షోగూ ననియును రెండుభేదములుగా నున్న పాలనమును దటాలున మార్చుట యుక్తముకాదని తలఁచెను. కనుక చక్రవర్తియొకఁడున్నాఁడనియు నతఁడు దేవునియవతారమనియు, నతఁడు సూర్యభగవానుఁడే యాదిపితయని నమ్మినవాఁడనియు, నతని జనులెల్లరు విధేయులై యుండవలయు ననియు వానికే సమస్తమయిన కానుకలు గౌరవములు చేయవలయుననియు నొక్కప్రక్కను దలంచుచుండ రెండవప్రక్కను రాచఱికముతోఁ జేరిన సకలాధికారములను జనులఁబాలించుట శిక్షించుట కష్టసుఖములను గనిపెట్టుట మొదలైనవి షోగూను రాణువవీరుఁడే దేశాధిపత్యపరిపాలనము నడుపుచువచ్చెను. యోరిటోమో మొదట షోగూనుపట్టము వహించినకాలము మొదలు అయియేలును దానాస్థానమునకుఁ జక్రవర్తిచేత నియమింపఁబడిన కాలమువఱకు జపానుచరిత్రమనునది బహుసంవత్సరములు యుద్ధము, విరోధములు, దుష్టత్వము, పూర్ణముగాఁ గలిగియున్నదేకాని విశేషమయిన వృద్ధిని బొందలే దని అయియేలు మనస్సులో విచారము గలిగియున్నవాఁడైనను బైనచెప్పినట్లు రెండువిధములుగానున్న రాజ్యాంగమే జపానునకుఁ దగని దని నిశ్చయించి యాపరిపాలనమెట్లు బాగుపఱచి యాపదలు కష్టములు లేని జనసౌఖ్యమును గలుగుటకుఁ దగినహేతువులు కల్పింతునా యని యధికచింతను బొందెను. దీనికిఁ దగినట్లు కొరియాదేశమునకును దమకును బూర్వయుద్ధమువలన సంభవించిన విరోధమును సమరసచేయుటకు కొరియారాజును దానును విరోధభావమును మార్చుకొని స్నేహభావమును బొందిరి. అయినను కొరియాదేశమునకాయుద్ధమువలన సంభవించిన కష్టములుమాత్రము సులభముగాఁ బోయినవి కావు. అవి నాఁడు నగరముఁ గూడఁ జెఱచినవి. కర్మస్థానములు పాడైనవి. ఫలవత్తరములైన పొలములు బీడుపడిపోయినవి. ఒకకాలములో నీకొరియాదేశ మనుకల్పకవృక్షము జపానుదేశమును దనకుఁ గావలసిన విద్యలు, చేతిపనులు మొదలైన నాగరికఫలములను గోసికొననిచ్చిన దైనను హిదేయోషి నడపిన యుద్ధములకుఁ దర్వాత యుద్ధరోగములవలన నెండి, మాడి, కొమ్మలు లేని మోడై నిలిచి యున్నది.

అయియేలు యీవిధముగా మాగాణముల కధిపతులైనవారి నెల్లరను జయించి తనకువశవర్తులనుగాఁ జేసికొనియుఁ, గొరియా, చీనాదేశములలో నున్న వ్యత్యాసములను సరిచేసియు, పరిపాలనమును దానును నిశముంచుఁ బాలింపవచ్చెడు తనవంశమువారును నీయీవిధముగా నడుచుకొనవలె నీయీరీతుల నుండవలెనని బాగుగా నాలోచించి విధానములేర్పఱచియుఁ బలువిధములైన దేశాభివృద్ధికిఁ దగినకార్యములు చేయుటయందే తలంపు గలవాఁడై యుండెను. హిదేయోషివలె నితఁడు యుద్ధవీరుఁ డని ప్రసిద్ధికలవాఁడు కాఁడు. పలుభేదములు గలిగియున్న జనుల నొక్కటిగాఁ జేర్చుటలోను, చట్టములు నిర్మించుటలోను, విరోధములు మట్టులు విశేషముగాఁ గలతావుల నవియఁడగించుటలోను పేరుపొందినవాఁడు. ఇంతియు కాక యీతఁడే విద్యావంతుఁడును విద్యాభివృద్ధియందాసక్తి కలవాఁడునుగా నుండెను. ఆకాలమున జపానువారు చీనాదేశమునే విద్యావిషయమునను నాగరికతయందు శ్రేష్ఠమైనదని తలంచి యాదేశవిద్యయు నాగరికతను స్వీకరించుచుండిరి. ఈరీతిగనే జపానులోఁ బలుతావుల విద్యాశాలలు నిర్మించి వానిలో యుద్ధశాస్త్రములతోఁబాటు బుద్ధి నెమ్మది మొదలయినవి కలుగు శాస్త్రములు కూడ నేర్పుటకుఁ దగినయేర్పాటులు చేయఁబడినవి. చీనాదేశశాస్త్రములు ముఖ్యముగా నేర్పఁబడినప్పటికిని జీనాగ్రంథములు చదువుటయుఁ జూచివ్రాయుటయు బహుకష్టముగా నుండెను. ఏలయనఁగా:—ప్రపంచమునందలి యితరభాషలన్నిటికిని నేర్పడియున్న యక్షరములలో నొక్కొక్కయక్షర మొక్కొక్కధ్వనికి గుఱుతుగా నున్నట్లుండక చీనాభాషలోఁబ్రతియక్షరమును దనయాచారమును బట్టి యొక్కొక్కవస్తువునకుఁ గుఱుతుగా నున్నది. అనఁగాఁ బక్షియని వ్రాయుటకుఁ బక్షివలెనాకారముగల యొక యక్షరముండును. చెట్టును గుఱించుటకుఁ జెట్టువలె నొకయక్షర మేర్పడియుండును. ఈవిధముగా చీనాపుస్తకమును జదువువాఁడు వేలకొలఁది గుఱుతులు నేర్చుకొనవలసివచ్చును. చీనాభాషయొక్కస్థితి యిప్పటికి నిట్లేయున్నది. జపానుదేశములోఁ గూడ నీచీనాయక్షరములే వాడుకలో నున్నను యితర యూరోపుదేశభాషలవలె నక్షరములు కల్పించుకొనుటకుఁ దగిన ప్రయత్నములు చేయఁబడుచున్నవని వినుచున్నారము.



అయియేలు విద్యాభివృద్ధియగు ప్రయత్నములలో నుండుటయే కాక రాజ్యాంగపుఁ గట్టుబాట్లునిమిత్తము మాగాణముల యధికారులయొక్క స్థితులు నాధిపత్యములును నిశ్చయపఱచి వారుకూడ విద్యావిషయమునందుఁ దగిన యత్నములు తమతమ తావులలోఁ జేయుటకు మాటలాడెను. సామాన్యజనులలోను, వర్తకులు, కర్మకారులు, వ్యవసాయదారులు మొదలయిన వీరికిఁ బైన చామురాయను నొకవిధమైనవారిని నియమించెను. ఈ చామురాయి శాఖవారు మనదేశములో బ్రాహ్మణులు క్షత్రియులువంటివారు. ఎట్లయిననేమి వీరే యుద్ధపుఁ బనులును విద్యావిషయికవ్యాసంగమును జేయువారై యుండినవారు. జపాన్ దేశము యిరోపాదేశములతో సమత్వమును వహించి యిరోపియా నాగరికతలలో మిగుల శ్రేష్ఠతను గాంచి ముందడుగు వే

యయున్న కాలమయిన యిప్పుడుఁ గూడ నీచామరాయి శాఖవారే షైమెట్టుమీఁద నిల్చి తాకేయితరజనులను నడపించుచు వచ్చుచుండిరి. వీరుముఖ్యముగాఁ బట్టణము లలో నివసించుచుందురు. వీరి కీపనులని యేమియు నేర్పడియుండకపోయినందువఁ గాలక్రమమున సోమరులై యితరులయెడ గర్వముగాను పరాయాగ్రస్తులుగాను మస లుచు జీవనము చేయుచున్నారు. అయినప్పటికిని, నాగరికతములో నేది మేలుచేయఁ దగినదో, యేది గౌరవముపొందఁదగినదో, విద్యాలాభము గలదో యాసాధనము ల న్నియు వీరియొద్దనే కలవు. సమీపమునందు, జపానుదేశమునందు గలుగుచుండు మార్పులు మొదలయినవానికి వీరే కారణభూతులని చెప్పవలయును. వీరే ప్రపంచము లోని యితరభాగములకును వెళ్ళి శాస్త్రములు నేర్చుకొనివచ్చి తమదేశములో సందతి కిని బోధించుచుందువారు. మధ్యకాలములో నరాజకముగా నున్న రాజ్యాంగాధికా రములను దిరుగ నిలువఁ బెట్టినదియును, ప్రతినిధులప్రభుపాలనము జపానులో సులభ ముగా నుండునేమోయని తలఁచినదియుఁ బ్రతిమనుజునకును స్వతంత్రతను, మతద్వే షము లేకుండుటయు రాజ్యాంగపరిమాణములను నిప్పటికాలములోఁ దగినట్లుండుటను ను వీరముందుండి ప్రయత్నములు చేసినందుననే సాధింపఁ బడినవనియుఁ జెప్పవల యును జపానులో నిప్పుడు యిరోపియాదేశములోవలెనే దినచర్యపత్రికలును మాసపత్రి కలును బయలువెడలి వెల్లివిరియుటయు వీరివలననే. చరిత్రములు, శాస్త్రగ్రంథము లు, రాజ్యపాలనకుఁ దగిన చట్టనిర్మాణములు, వ్యాపారవృద్ధి, మొదలయినవియు నీచామరాయి వంశమువారే తమసామర్థ్యమువలన వృద్ధిచేయుచు వచ్చినవారు. వీరు విద్యార్థులే కాకుండ యుద్ధములందు శౌర్యమువీర్యము గలవారైనందున యుద్ధయ త్నములును విద్యాయత్నములును సమానముగా వీరుచేయుచుండినవారు. గుఱ్ఱపువడ కలు, నస్త్రశస్త్రసాధకమును వీరు బాగుగా నెఱుఁగుదురు.

---



## నాలుగవ ప్రకరణము.

---

చీనాదేశములోవలెనే జపానుదేశములోఁ గూడ, బెద్దవారి మాటకుఁ జిన్నవా రు విధేయులయి నడచుటయే కులాచారముగా నున్నది. తండ్రికిఁ గుమారుఁడును మ గనికిఁ బెండ్లామును యజమానికి సేవకుఁడును విధేయతగా సంచరించుట జపానుదేశ మువారికి శాస్త్రసమ్మతమయి యున్నది.

ఇండియాలోఁ గూడ నీయాచారమే పూర్వకాలమునుండియు ననుష్ఠింపఁబడు చు వచ్చుచున్నను నిపుడింగ్లీషువారి నాగరికతావ్యాపకమునకు ఫలముగా నీయాచార ముతగ్గుచువచ్చుచున్నది. జనులలో చాలమంది తమతమ జన్మభూమియందే నివసించు చు వ్యవసాయమును గాక వేఱుకర్మములను జేయనివారయి, దూరదేశములకుఁబోవుచు వచ్చుచుండు నావశ్యకములేకుండ నున్నకాలములో నీవిధముగాఁ బెద్దవారికిఁబిన్నవా రును, యజమానికి సేవకుఁడును బరంపరగా నడఁగియుండి జీవించుట సాధ్యమగునే కాని, యెప్పుడు నొకదేశములోనే వ్యవసాయము చేయుటయేఁ గాక వ్యాపారము, వర్తకము, చేతిపనులు, ఉద్యోగము మొదలయిన జీవనోపాయము లనేకములు వృ ద్ధియగుచున్నవో యాకాలములో నొక్కచోట స్థిరముగా నివాసముచేయకుండ స్వే చ్ఛగా ననేకస్థలములకుఁ బోయి ధనసంపాదనచేయ మొదలుపెట్టినారో యపుడు ప్ర తివారును దమపెద్దల యాజ్ఞలకు బద్ధులై వారియిష్టవృత్తిప్రకారము నడచుటకు శక్య ము కాదని మేము చెప్పకుండఁ గ నే తెల్లమగుచున్నది గదా! ఇట్లే యిపుడిండియా లో జరగుచున్నది. పూర్వమువలె నిప్పుడు ధైర్యమును బుద్ధియు, విద్యయుఁ గల వారు దాము బుట్టినగ్రామములోనే యొక్కకుటుంబములోనే యుండి సేవ్యమునే న మ్ముకొని యుండుట. సాధ్యముగాకున్నది గదా! కాఁబట్టి యిండియాలోని చిన్నవారు పెద్దలమాటలను మీఱి నడచుచున్నారని యాచిన్నవారి లోపముగాఁ గొందఱుద్ఘోషించుచున్నట్లు మనమును సమ్మతించుట. న్యాయముకాదు. అ ట్లే తెల్లవారును నొక్కయజమానినే నమ్మి వానినే యాశ్రయించుకొని యుండుట లో మేలులేదని యెక్కడఁ దమజీవనమునకుఁ దగినట్లు విశేషవసతులు కనబడుచు న్నవో యక్కడకుఁ దాము స్వేచ్ఛగాఁ జనుచున్నారు. ఇఁకముందును గ్రమక్రమ ముగా యైరోపియానాగరికతయు ప్రబలమయినకొలఁది నీయాచారము వృద్ధియగునే కాని తక్కువకాదు.

జపానుదేశములోఁ దొల్లిఁటిజనులు తామక్కడక్కడఁగా పురము చేయుచున్నయి

థికారులకు లోఁబడి వారిచెప్పినట్లు చేయుచుఁ గ్రింది మెట్టుపయి నుండుటయు, వీరిక్రింది వారిని వీరు నడపుటయు, వీరిక్రిందివారు వీరికి లోఁబడియున్న రయితులను నడిపించుటయు రయితులు తమకుటుంబములలో నందఱికి నధికులై తక్కినకుటుంబమువారిని నడపుటయు, మగఁడు చెప్పినట్లు భార్యవినుటయు, యజమానిచెప్పినరీతిని పనివాఁడు ప్రవర్తించుటయు, సదాచారముగాఁ జెప్పఁబడినట్లు జరగుచు వచ్చుచున్నందున జనసమూహమొక్కనిబంధనకుం గట్టువడి యమరికగా వాసముచేయుచున్నది.

ప్రతివిషయములోను జపానువారి యాచారము ఇండియాలోఁ బూర్వమనుష్ఠింపఁబడుచువచ్చిన యాచారముల ననుసరించియే యున్నది. అయియేసుకు, రెండవచక్రవర్తి యని చెప్పఁదగిన షోగూనుపట్టమును జక్రవర్తి యివ్వఁబోఁగా నదితనకుఁ దండ్రి వలదని తన కుమారున కిప్పించి తనకుద్యోగమక్కఱలేదనియెను. అట్లు వలవను సాచారము జపానుదేశములోఁ గలదు. చాలకాలము లోకవ్యాపారములలోఁ దిరిగి వార్ధకమున నరణ్యము మొదలయిన రహస్యస్థలములలోఁ బరమాత్మవిద్యయందు దగు నిష్ఠగా నుండుటయును యార్యులపూర్వాచారము గదా! రాజులే గాక సామాన్యగృహస్థులును బ్రాహ్మణులుగాని క్షత్రియులుగాని వైశ్యులుగాని యైనచో సంసారమును విడిచి యుండుట మనవారుకూడ నెఱుఁగుదురు. అట్లే జపానులో అయియేసు గూడఁ జేసినను దాను చిరకాలము గావించిన పూర్వోద్యోగమునమాత్రము బొత్తిగా విడువలేదు. ఈషోగూనుప్రభుత్వము తనవంశస్థులకే పరంపరగా వచ్చుచుండవలయునని, యీతనియభిప్రాయము దానికిఁ దగినట్లు కావలసిన యేర్పాటులు తనజీవితకాలమంతయుఁ గావించుచుండెను.

రాజ్యాంగవిషయము నిక్కడ నిట్లుండ జపానుదేశమునకు నితరదేశములకును బూర్వమునుండియు నొక్కవిధముగానున్న సంబంధము విరివిగా వృద్ధిఁబొంద మొదలుపెట్టినది. ఇంతకుఁ బూర్వమే పోర్తుగీసువారును, స్పానియావారును, ఆదేశములోఁ గ్రీస్తుమతస్థాపనము చేయయత్నించుచు వచ్చిరని చెప్పినారము. వారితో హాలండుదేశస్థులయిన డచ్చివారును గలసిరి. అయినను డచ్చివారి తలంపు క్రీస్తుమతస్థాపనమే గాకుండ హాలండుకును జపానుకును వర్తకసంబంధమయిన రాకపోకలు గూడ జరపవలెనని యున్నది. తమదేశములో మదింపుగలిగినవియు నుపయోగము గలవియు నయిన సామానులు చాలకలవనియును నవియిచ్చి జపానులోనున్న సరకులు తీసికొని పోవుటకు మాకభిప్రాయము గలదనియును డచ్చివారు చెప్పుచువచ్చిరి. ఈ



విధముగా డచ్చివారిని మొట్టమొదట దమదేశమునకుఁ దీసికొనివచ్చినవాఁడు ఆడమ్స్ అనువాఁడు వాఁడు అయియేసుయొక్క ప్రియమును సంపాదించుకొని యాకాలమున జపానురాజ్యాంగమువారి కితరదేశములను గుఱించి తెలిసికొనవలసిన యంశములు తెలిపి జపానురాజ్యమునకుఁ బ్రక్కనున్న గొంతభూస్థితిని అయియేసువలనఁ బుచ్చుకొని యొకజపానుస్త్రీని బెండ్లిచేసికొని యచ్చటనే 1620 వ సంవత్సరమున మృతినొందెను. వీనిసహాయముననే కొందఱు జపానువారు కొన్ని యోడలను జేయించినారు. ఈమధ్యకాలమున అయియేసు హాలండుదేశపురాజునకు 1610 వ సంవత్సరమున హాలండుదేశమువారు జపానులో నెక్కడయిన వర్తకము చేసికొనవచ్చుననియు వర్తకమునకుఁ దగినవిధమున శాలలు నిర్మించుకొనవచ్చుననియు నప్పుడును దానిపిమ్మటను నేయాటంకముగాని కష్టములుగాని లేకుండ వ్యాపారము చేసికొనవచ్చుననియు నొకసమాచారమును దూతచేతపంపెను. దానినిపట్టి హాలండురాజుగారు కొన్ని యోడలను జపానునకుఁ బంపఁగా అయియేసును అక్కడవర్తకము చేయు డచ్చివారికి జపానుదేశస్థు లేవిధమయిన యపాయముగాని బాధగాని చేయరాదని యుత్తరవును బ్రచురము చేసినాఁడు. ఈవిధమున 1611 వ సంవత్సరమునఁ బాదుకొనిన చట్టము చాలకాలము వఱకుఁ గష్టనిష్ఠూరములకు సమ్మతించి వచ్చునట్లు ప్రజలనడిపించుచు రాఁగాఁ జిట్టచివరకుఁ గొన్ని సంవత్సరములకు పిమ్మట డచ్చివారేకాక యితరదేశస్థులు గూడ జపానుదేశమున వ్యాపారము గావించుకొనవచ్చునని యేర్పాటు చేయఁబడెను. డచ్చివారిని జూచి యింగ్లీషువారుఁ గూడ జపానుదేశములో వర్తకముచేయ మొదలుపెట్టియును డచ్చివారును దామును మిత్రతతోఁ దూర్పుదేశములలో వ్యాపారము చేయశక్తిలేక చివరకు జపాను వర్తకమునే మానుకొనిరి.

1605 వ సంవత్సరమున అయియేసు షోగూన్‌పదమును వదిలి 1711 వ సంవత్సరమున మరణమును బొందుదాఁకఁ దమవంశమువారే యెల్లకాలము షోగూను ఉద్యోగమును గలిగియుండునట్లు చేయవలె నను యత్నము చేయుటయే గాక యది నెఱవేఱుటకుఁగా నవశ్యమయిన కార్యముచేయుటయేగాక విద్యావిషయమయి కూడ నవకాశమున్నంతవఱకుఁ బాటుపడెనని వినుచున్నారము.

ఆకాలమునఁ గొరియాదేశమే నాగరికతకుఁ బేరుపడియున్నందున నక్కడనుండి జపానువారు పుస్తకము లచ్చువేయుట మొదలయిన విద్యలను నేర్చుకొనిరి. కొరియాలోవలెఁ జీనాలోఁ గూడ నచ్చుకూర్చుట వాఁడుకలో నున్నది. అప్పుడు ఆ యిరోపాదేశమున నీవిద్యయెఱిఁగినవారు లేరు. ఈవిద్య కొరియా చీనాదేశముల

వారికి 1800 సంవత్సరముననే తెలిసినది. అయిరోపావారికిది సుమారు 109 సంవత్సరముల పిమ్మటఁ దెలిసినది. అయినను చాలకాలమువఱకు అయిరోపావారు తాము మేలైనయుక్తిచేతనే యీవిద్యకనిపెట్టినట్లు చెప్పుచుండువారుకలరు. ఈయచ్చుగూర్పువిద్యను అయియేసు జపానుదేశములోఁ బ్రబలపఱచెను. అయియేసు చనిపోవుటకు మున్ను జపానులో నాచారవ్యవహారములు స్థిరపఱచుటకుఁగా నొకశాస్త్రగ్రంథము వ్రాసి పెట్టినట్లు వాడుకకలదు. కాని యది యాతఁడేరచియించెనో లేక యితరులుచేసిరో యను సందేహమునకు కిషముగలదని కొందఱు జపానువారభిప్రాయపడియున్నారు. చాలకాలము వఱకుఁ బరమరహస్యముగా షోగూనురాజగృహమున దాఁచఁబడియుండిన యీశాస్త్రము యొక్క ప్రతినొకదానిని గొప్పయుద్యోగములోనున్నవారు మాత్రము సంవత్సరమున కొకసారి చదువవచ్చునని యేర్పాటుచేయఁబడియెను. మనదేశమువలెనే జపానులోనివారి యాచారానుష్ఠానములును బహువిధములుగా నురడకురిడునట్లు పెద్దలుచేసినశాస్త్రములను సాధారణజనులు తమబుద్ధికుశలతవలన నేర్చుకొని మంచిమార్గమును బట్టి లోకులను వృద్ధిలోనికిఁ దెచ్చుటకు వీలుకలుగకపోయెను. ఎందువలన ననఁగా:—వారు దానిని చదువకుండఁగనే క్రమక్రమముగా మఱచిపోవుచు వచ్చి కొందఱుమాత్రమే చదివి తెలిసికొనుచుండుట సంభవించినది. చదువనేర్చినకొందఱిట్లు శాస్త్రమును జదువు వారివారి వంశముతో సంబంధించిన యాచారముల ననుసరించి నడచుచు దుష్టశిక్షణ శిష్టరక్షణములు రాజులయందలి లోపములుగా నెన్నుచువచ్చిరి. శాస్త్రమిట్టి వారికే తెలిసినఁగాని సాధారణులెల్లరు మేలుకొఱకు గాదు. అయియేసు వ్రాసిపోయిన శాస్త్రములో నొకభాగము జనులాచరింపవలసిన ధర్మములను గుఱించి చెప్పఁబడియెను. ఇంకొకభాగములో రాజ్యవిధులును రాజకార్యనిర్వాహకవిషయములును గలవు. మూఁడవభాగములో చట్టములు నిర్మించుట మొదలగు తత్సంబంధములును దక్కిన భాగములో అయియేసు చరిత్రములో జరిగిన కొన్నికథలును గలవు. చీనావారి గ్రంథములను నేర్చికొని వానిలోనుండి యెత్తి యీశాస్త్రము అయియేసువ్రాసినట్లు వాడుకయున్నది. ఆకాలమునకుఁ దగినట్టి యుద్ధకార్యములు మిక్కిలి యవశ్యమయిన వనియును ఆపనులు చేయువారిని గాపాడుట యగత్యమనియుఁ దనగ్రంథములో అయియేసు స్పష్టముగా దెలిపియున్నాఁడు. తమపుస్తకములో నొకచోట నీక్రిందఁజెప్పరీతిని జెప్పుటమన పూర్వ హిందూరాజుల మనస్సులలోఁ దలంపుగాఁ గొనకుండనుండిరి. ఎట్లన:—నా యౌవనములో విరోధుల దేశములను జయించి నాపూర్వులకు శత్రువులుగాను



న్నవాళ్ళపయిఁ బగతీర్చుకొనవలె నను యత్నములో నున్నవాఁడనేగాని వేఱుకాదు. కాని మహాజ్ఞానిరైన యూరోయనువారు మాత్రము రాజ్యమేకచ్ఛత్రముగా నున్నపుడు ప్రతివారును సమాధానముగా నుండునట్లు చేయుటయే రాజు ప్రజలకొనర్చు ముఖ్యమయిన మేలని చెప్పిరి. ఈవిధానము సరియైన ప్రమాణము నాధారము చేసికొనియున్నదని నమ్మిరయే దానిని నేను తప్పకుండ వెంబడించుచు వచ్చుచున్నాను. నా సంతతి వారును దీనిననుసరించి నడువవలయును. అదియెవ్వఁడు నిలుపుచేయునో వాఁడు నాసంతతివాఁడు కాఁడు. ప్రజలు వానికి లోఁబడి యుండరు. ఇతర కులాచారములను గూర్చి అయియేసు చెప్పినదానిలోఁ బ్రతిమనుజుఁడును వివాహము చేసికొనవలసినదను విషయమును విశేషముగా వ్రాసినాను. పదాఱుసంవత్సరములు దాఁటినపిమ్మట వివాహముకాకుండ నుండరాదనియు, నట్టివారికిఁ దగిన మధ్యవర్తులు వివాహసంబంధము కుదిర్చి పెండ్లిచేయించవలె ననియుఁ గూఁతురుబిడ్డలతో వివాహసంబంధములు చేయరాదనియుఁ గులము వృద్ధిఁగాఁ జూడవలయు ననియు, శాస్త్రప్రకారము వివాహముచేసికొని సుఖముగా నున్న సంతతివారివలనఁ బితృదేవతలు సంతోషమును బొందువారనియు, మానవులలో సమస్తజాతులవారును వివాహమునే ముఖ్యవిధిగా నెంచుచున్నారనియుఁ జెప్పినారు. హిందువులలోఁ బెనిమిటిచనిపోయినా భార్యకూడ నగ్నిప్రవేశము చేయుట యెట్లాచారమో యాప్రకారమే జపానుదేశములోఁ గూడ యజమాని మృతినొందినా యాతనిసేవకులును భార్యమున్నగువారును ప్రాణత్యాగము గావించుకొన్నచో స్వర్గములో యజమానికి సహాయులుగా నుందురను వెఱ్ఱినమ్మకముతో మరణమునొందు నాచారముకలదు. అయియేసుకాలములో అనఁగా 800 సంవత్సరములకుఁ బూర్వము జపానులో నీయాచారమున్నదనుటకు దృష్టాంతముగాఅయియేసు తనపుస్తకములో నీయాచారమును ఖండించి ఖండించి వ్రాసియుండెను. అట్లు వ్రాసియును, బూర్వాచారమని యెవ్వఁడు తనయజమానితోఁ గూడఁ బ్రాణములు పోఁగొట్టుకొనునో వానిసొత్తు రాజ్యాంగమువారు పుచ్చుకొని వానివంశము వారినందఱిని గష్టములు పాలుచేసెదరని హెచ్చరించెను.

అయియేసు వంశమువారు షోగూను అధికారమును వహించి యేకాధిపత్యము చేయుచువచ్చిన దినములలోనే జప్పానుదేశము యొక్క పూర్వగౌరవము మహోన్నతముగా నుండెను. జపానుదేశమునకుఁ గలిగిన పట్టు మిక్కిలి కీర్తినిబొందియున్నదాని విద్యలున్ను కళలున్ను ఆకాలములోనే శ్రేష్ఠముగా నుండెను. కంచు[illegible] రఁగించి పో[illegible]యుటయును ఉక్కుతోఁ గత్తులు మొదలగు స్థిరమయిన సర్వసా[illegible]

రణవస్త్రవులును లోకులకే చేయుటయును వీనికంటె నాగరికతగల చిత్రరువులవ్రాయుఁగల విద్యయును, మొదట చీనాదేశమునుండి జపానుదేశమునకు వచ్చియున్నను జపానులోనివి మిక్కిలి శ్రేష్ఠతను బొంది యాకాలమునను లోకములోనివారు వానిని గాంచి మోహించునట్లుండినవి. అయినను జీవనోపాయమునకుఁ దగినకొన్నివిద్యలలో జపానువారు చీనావారికిఁ గేవలము సమీపమందుండుటవలనఁ జీనావారివలెనే వింతలైన యనుష్ఠానములను గావించుచుండిరి. మనదేశములోఁ బూర్వకాలమునుండి వాడుకలో నున్న వైద్యమునకు నింగ్లీషువారి వైద్యమునకు భేదమెట్లున్నదో యట్లే చీనాలోను జపానులో మునుపటినుండి యున్న వైద్యమునకును నిప్పటి యింగ్లీషువైద్యమునకును వ్యత్యాసము కలదు. ఆరీతినే ప్రతిదేశమునందును బూర్వకాలమున వారివారి బుద్ధికుశలతలను బట్టి వైద్యశాస్త్రమును మందులును జేయించి మానవులకు సాధ్యమయిన బాధలను బోఁగొట్టుచు జనాభివృద్ధి గావించువారుండిరి. అట్లేర్పడిన శాస్త్రములును, మతులును, విశేషముగా మూఢభక్తిని దెలియనితనమును, నాధారము చేసికొని జనులయొక్క దుఃఖమునకుఁ గారణభూతము లైనవనియే చెప్పవలయును. మనదేశమే దానికి నిదర్శనముగాఁ దీసికొన్నను, వైద్యులు తమయౌషధములనుపయోగించుటలోను దంత్రులు నన్నిమాటలు చెప్పుటలోను జబ్బు కుదుర్చునట్లు నటించి తమతెలివితక్కువచేత బాధవృద్ధిపఱచుచున్నారు. కాని యాయారోగులకు దైవదత్తమయిన శరీరదార్ఢ్యముచేతనే కొన్నినాళ్ళకుఁ దమంతటదామే నివారణ యగుచున్నవి. శాస్త్రయుక్తులవలనను మందులవలనను బ్రాణులకు రాఁదగిన సౌఖ్యములలో ముఖ్యమయిన భాగమేదియనఁగాఁ బ్రకృతులు కనిపెట్టి నడిపించుటయే. రెండవవిధాన మపాయకరము. జపానులో వైద్యవిషయమయి యొకవిచిత్రము కలదని చెప్పఁబడుచున్నది. ఎట్లనః—ఏవైద్యుఁడు మందిచ్చుటలోను, వానినిలోనికిఁ బుచ్చుకొను విధము చెప్పుటలోను గుత్రిమము చేయుచున్నాఁడో వానికి దండనగా మూఁడేండ్లు శిక్షయును విశేషధనము అపరాధమును విధించుచుందురఁట. ఔషధములో సేవస్తువుగాని కలపి యుండినను, దానినిజేయుటలో నేమయిన లోపముండినను నావైద్యునకుఁ బైయపరాధముతోఁ గూడ 60 దెబ్బలను విధింతురఁట. అయినను నీవిషయములోఁ బూర్వదురభ్యాసములు పిమ్మటివారయిన వచ్చినవారి సహవాసమునఁ బోఁగొట్టఁబడి శాస్త్రసమ్మతము సుఖోపాయములునైన మార్గములు బయలువెడలినవి.





## ఐదవప్రకరణము.

ఇదివఱకుఁ జెప్పియున్నట్లు అయిరేసు వంశమువారు షోగూనుఅధికారమును పారంపర్యముగా వహించుచు నేకాధిపత్యము చేయుచుండ జపానుదేశనాగరికత యాదేశపూర్వాచారానుష్ఠానములను స్థాపనలను వృద్ధిచేసి యాదేశరాజ్యతంత్రస్వతంత్రులును దేశాభిమానులు దమదేశములోని కన్యదేశము వారు వచ్చి వాసముచేయకుండ నాటంక పఱచుటయే దేశస్వాధీనమునకు మేలునకును దగినదని నమ్మియుండిరి. ఇంతకుముందే పోర్చుగీజువారును స్పానియావారును నక్కడ వ్యాపారము పేరుపెట్టుకొని వచ్చిప్రవేశించి క్రీస్తుమతప్రాబల్యముచేయఁ జూచిరనియు దానింగాంచి అయిరేసు మొదలయిన జపానులోని సమర్థు లనుమానపడి క్రీస్తుమతస్థాపకులను దన్మతము నవలంబించిన జపానుదేశస్థులను బహుబాధలుపఱచి తఱిమియుండిరనియు చెప్పియుంటిమిగదా! ఆకాలము మొదలు జపానుదేశములో నితరదేశమువారు ప్రవేశింపకుండ నాటంకపఱచుటయే ప్రభుత్వమువారి యభిప్రాయమును నిశ్చయము నైయుండెను. ఆ 1853 వ సంవత్సరములో అమెరికానుండి కమటోర్ పెర్రీయను నావికసేనానాయకుఁడు ఆదేశ సామంతరాజునకు నాయకుఁడుగానుండి రాజ్యముచేయుచు వచ్చి ప్రెసిడెంటు దగ్గఱనుండి జపానుచక్రవర్తికి నొక నియమము కుదిర్చితెచ్చి అమెరికాకును జపానుకును స్నేహవర్తకసంబంధములుకోరి యడోయను రేవునకువచ్చి చేరువఱకును పైనఁ జెప్పిన నిశ్చయము జరపఁబడుచువచ్చెను.

ఇట్లుగా ననుష్ఠింపఁబడుచువచ్చినది జపానుకు మేలుచేసినదా కీడుచేసినదా యను నాలోచన కవకాశము గలిగియున్నది. అన్యదేశములవారిని తమతో సంబంధము గలిగియుండకుండ వారి యిష్టప్రకారము దేశమునందు వర్తకము మాత్రము చేసికొనవచ్చునని తానిచ్చిన యెడల వారిని జూచి జపానువారును బహువిధములయిన క్రొత్తమార్గములు నేర్చుకొని యభివృద్ధినొందవచ్చు నని కొందఱికిఁ దోఁచవచ్చును. అయినను నిప్పుడు చైనా, పర్షియా మొదలగు తూర్పుదేశములలో నైరోపావారు చేరి వ్యాపారముమాత్రమే మాకు ముఖ్యమయినదని పేరుచెప్పివచ్చి యక్కడనున్న జీవనాధారము లన్నియుఁ గ్రమక్రమముగాఁ దమస్వాధీనము చేసికొని ప్రభుత్వములోఁ గూడ నెక్కుంతభాగము సంపాదించి నానాట నంతయు వశముచేసికొనుట మనము చూచుచున్నాము. పర్షియాదేశమును బహుకాలమునుండి స్వాయత్తప్రభుత్వముపొందిన మహమ్మదీయరాజులు పాలించుచుండ రుషియావారు వర్తకమునకని వచ్చి పర్షి

యా రాజునకుఁ గావలసినంతధనము నప్పిచ్చి ధారాళముగా రైలుదారులు వేసి వానిని
రుషియావారే నడిపించునట్లేర్పఱచి చిట్టచివరకుఁ దామిచ్చిన బకాయిలకు గావలసిన
వడ్డిక్రింద రేవులసుంకములు స్వాధీనము గావించికొనిరి. ఇప్పటి పర్షియారాజులు ఆ
న్యరాజాంగము వారెవరితోడను నిష్టమువచ్చినట్లు తామొడంబడిక చేసికొన వీలుగల
గనివారై వారు. అప్రకారముగనే యాదికాలములో ఈజిప్టుదేశములో దాని రాజగు
ఇస్మాల్ పాషాకు నలసినంతద్రవ్య మప్పిచ్చి యామతిలేనివాఁడు పుచ్చుకొనిన ధనము
తయు వృథావ్యయము చేసినపిమ్మట, మొదటనిచ్చినదానికంటె హెచ్చుగవడ్డి పెరుఁ
గ రాజ్యమువలన వచ్చురాఁబడి చాలకంతగా పెరిఁగిపోయినదను నెపముతో నైరోపా
వారు ఇస్మాలుపాషాను సింహాసనమునుండి తప్పించి తమకార్యస్థులను నిలిపి ఈజి
ప్టురాజ్యాంగమును నడుపుటలో బ్రిటిష్‌వారు ముందునిలిచి యిపుడా దేశాధికారము నే
నిర్వహించుచున్నారు. పేరునకు మాత్రము ఇస్మాల్ వంశములోని యొకడు మేఘము
లలోఁ గప్పఁబడిన సూర్యునివలె నధికారమున నగపడుచున్నాఁడేగాని సర్వాధికార
మును బ్రిటిషువారే వహించిరి.

ఇంతియకాక బహుసంవత్సరములనుండి స్వాధీనానుభవముగలిగి, తనకుఁ జిహ్న
మయిన నాగరికతను అవలంబించి విస్తీర్ణతయందును జనసంఖ్యయందును సమానము లే
ని యన్యదేశములవారిని మ్లేచ్ఛులని నిందించి వారితో నేసంబంధమును బొందని యుం
డు చీనాదేశములోఁ గూడ మీఁదఁ జెప్పిన విధముననే అయిరోపావారు ప్రవేశించి
ఛిన్నాభిన్నములు చేయుచు వచ్చుచున్నారు. వర్తకమున కనియే అయిరోపావారికి
మొదట నేచోటఁగాని కాలుపెట్టుట యలవాటైయున్నది. పిమ్మట వారికిఁ గావల
సినంతధనము బదులిత్తురు. తరువాత మృగములవంటి పాదరీలను చారులను బంపుదు
రు. అడ్డులేకుండ నిచ్చిన యప్పులకు వడ్డీయడిగి, దేశములోఁ బ్రవేశించిపాదరీలను స్వదే
శములోని జనులు బాధించుచున్నారని వదంతి కలిగింతురు నడుమ నడుమ స్వమతా
చారముల ననుసరించి యుండు జనులామతమును నిందించుటయే పనిగాఁ బూని
తిరుగు క్రీస్తుపాదిరీలదగ్గఱ నధికభయమును గోపమును జూపి వారిలోఁ గొందఱు పా
దిరీలను మతావేశముగల కొందఱు మూఢులయిన దేశజనులు చంపుచుందురు. యిట్లు
చంపినయపరాధమునకై రాజ్యాంగమువారినిఁ గోట్లకొలఁది ధనమడుగఁగా, నాధన
మిచ్చినయెడల నిదివఱకుఁ దాము వారిదగ్గఱపుచ్చుకొన్న ఋణమునకు వడ్డీయిచ్చుట
యే కష్టముగా నాదేశాధిపతులకుఁ దోఁచును. వృద్ధియివ్వలేదని దేశముమీఁదవచ్చు
వచ్చుబడులను వీరుస్వాధీనము చేసికొందురు. ఇతరులయొక్క భూ[illegible] క్రమక్రమముగ



నెక్కుడగుచుండఁ బ్రభుత్వము వారికిని నుద్యోగస్థులకును, ప్రజలకును ద్రోహము కలిగి
కలిగి సమీపమునఁ గనఁబడు పాదిరీలను బాధించియుఁ జంపియు నలుక తీర్చుకొందు
రు. ఈచొప్పుననే చైనాలో సంభవించి దాపున బ్రిటిషువారు, రుషియా, జపాను
జర్మన్, ఆమెరికాదేశములవారును దమ తమసేనలను గొని చీనాదేశము నాక్రమించి
చీనావారిని సూక్ష్మముగా నిగ్రహించి చీనాచక్రవర్తి తాముకోరినట్లెల్ల చేయునట్లు
గావించిరి. అయినను జీనాదేశమునకుఁ గాలముమంచిదగుటచేఁ బైఁజెప్పిన దేశపు
రాజు లొకరిపయి నొకరి కోర్వలేమి పుట్టి చీనాదేశమును దామందఱును బంచుకొన
మనస్సులు పుట్టుటయేగాని యొకరిపై నొకరికి జయింపలేమను భయముపుట్టి యొక్క
రును గొనకుండ విడిచిపెట్టిరి. ఇట్లున్నను నిదివఱకుఁ జీనాదేశములో రేవులలో మా
త్రము వ్యాపారముచేయ స్వతంత్రము గలిగి యున్నవారు తమసరకులకును నీళ్ళ
మీఁద నేమియును బన్ను చెల్లింపకుండఁగనే కొనిపోవుటకుం జీనాచక్రవర్తిని భయ
పెట్టి వాని సమ్మతిని గొనిరి. ఇట్లుగా ననుమతిపొందినందున నితరములయిన సరకులు
చీనాదేశములో నిరాఘాటముగా వ్యవహారములో నుండఁగాఁ జీనారాజ్యసంబంధము
గల యధికారులు నుద్యోగస్థులు సంబంధము కలిగించుకొని వర్తకమునకు హానికలి
గించుచున్నారని చీనాచక్రవర్తి యొద్దఁజెప్పి దాని నష్టముక్రింద మితములేని ద్రవ్య
మును వారడుగ నంతధనమిచ్చుటకుఁ జీనాచక్రవర్తి సమర్థుఁడు కాకపోయినపుడు
ఈజిప్టులోను పర్షియాలోను సంభవించినట్లే చీనాయేకాధిపత్యమునకువచ్చురాఁబడు
లను గూడ నైరోపావారు లోఁబఱచుకొని చక్రవర్తినిమంత్రిని నొకమూలఁ బడనైచి
యేకాధిపత్యనిర్వాహకము తామేచేయుచు వత్తురు. ఈప్రకారముగా నేచీనాలో సం
భవింప నున్నదని పలువురూహించుచున్నారు.

వీనియన్నిఁటికంటె మనయిండియాలో నే మొట్టమొదట బోర్తుగీజువారు ప్రవే
శించినదియును, పిమ్మట బ్రిటిషువారు వర్తకమును వంకఁబెట్టుకొని వచ్చిచొచ్చుట
యును, జాలకాలము దేశప్రభువులకు వీర లడఁకువతోనుండి వ్యాపారముచేసి హె
రాళముగా ధనము గడించినదియును, దరువాత దేశనరపాలు రొకరితో నొకరు యు
ద్ధముచేయ నాపోరులలో వీరుకూడి మూఢులుగాను గలిసికట్టుతనము లేనివారుగాను
నున్న మనరాజుల నొక్కరొక్కరిని గపటముతోడను బలముచేతను గ్రిందుపఱచి చివర
కు వారలప్రతాపమునకు మనవారు నిలువలేనివారయి యింగ్లీషువారి విశ్వాసప్రజలవ
లెఁ జేరఁగా నిప్పటికాలమున బ్రిటిషువారిండియాలో నేకాధిపత్యము స్థాపించి పరి
పాలించుచుండ[illegible]మును హిందువులైన మనవారు బాగుగా నెఱుఁగుదురు కదా?

ప్ర

కాఁబట్టి జపాన్ వారు తమదేశములో నితరదేశస్థులను జేర్చుట దేశస్వాధీనమునకే మోసమగునని వారిని రానీకుండఁ జేయుట యనాలోచనమని మనము తొందరపడి చెప్పరాదు. జపాన్ వారిప్రకారము తలఁచుకొనియుండ నింగ్లీషువారు వారి నూరక విడిచిపెట్టలేదు. డచ్చివారు జప్పానుగూర్చి అయిరోపాదేశమువారికిఁ దెలియఁజెప్పినందున పోర్చుగీజువారు స్పానియావారు, డచ్చివారు, వీరేకాకుండ, రుషియా, బ్రిటిష్ అమెరికాదేశములవారును జపానులోఁ దమకు నివాసములకుఁ దగినస్థలములుండవలయునని యత్నించిరి. అమెరికావారికి జపానువారితో సంబంధమును గలిగియుండుట ముఖ్యమయియున్నది. అమెరికాకును జపానుకును నడుమనుండు సముద్రములో తిమింగిలములను బట్టుకొనుపనిలో విశేషధనవ్యయము చేసి వృద్ధియొనరించుటను చీనాదేశములో అమెరికావారికి వర్తకమునకు స్థలము సంపాదించి యుండుటను, సముద్రములో మాటిమాటికి రాకపోకలు చేయుట యవశ్యమయినందున జపాను ద్వీపములలో నెక్కడనయిన అమెరికాదేశపుఁ బోగయోడలకు బొగ్గులెత్తుస్థలమొకటి స్థాపించవలసినది యవసరమయియుండెను. అన్యదేశములవారిని రానీయమని జపానువారు చేసికొన్న నిశ్చయమును మార్చి జనులయైకమత్యములో నిష్కళంకమనంబులతోఁ బ్రవేశింపకుండినయెడల అమెరికావారి కోరిక నెఱవేఱుట కష్టసాధ్యమయినది. అయినను అమెరికావారికిఁ బైనఁ జెప్పినవిధమున నొకచోటు జపానుద్వీపములలో నేర్పాటుచేసికొననియెడల వ్యాపారమునకు నష్టమువచ్చును గనుక అమెరికావారేవిధముగానైన జపానువారిని దమకోరికకుఁ దగినట్లొప్పుకొనువారినిగాఁ జేయ వారియిష్టానుసారము నడువవలసినదనియే నిశ్చయించుకొనిరి. అట్లు నిశ్చయించి యిదివఱకు మేము చెప్పినట్లు కమటోరుపెర్రీని ఒకనావికాసేనతో జపాను సముద్రప్రాంతమునకుఁ బంపినారు. జపానువారితోఁ గూడినంతవఱకు సామోపాయప్రయోగము వలననే తమయుద్దేశమును నెఱవేర్చుట శ్రేష్ఠమని కమటోర్ పెర్రీ యభిప్రాయపడినప్పటికిని నవశ్యమయినచో దండోపాయప్రయోగములో మరలఁ బిలుచుటలేదనియెడు నూహతో దానికిఁ దగిన ప్రకారము సేనతోడనే వచ్చెను.

అట్లు వచ్చిన కమటోర్ పెర్రీ నావికాసేనను గాంచి జపానువారు తగినట్లైసిద్ధపడిరి. తమతో స్నేహమును గోరివచ్చిన అమెరికావారిని వారియిష్టప్రకారము వారితో స్నేహము చేయుటమంచిదా లేక మునుపటివలెనే దగ్గఱ రాకుండఁ గొట్టుటయే మంచిదియా యని సందేహము కలిగినది. పరిచయముకలయితరుల సహవాసమును గుఱించి జపానువారికి సంశయమే కలిగినది కాని ధైర్యము కలుగలేదు.



సంశయముతో జపానువారి యిష్టము నెఱవేర్పకుంటిమా వారుబలవంతముగ కార్యసిద్ధినిబొంద నిశ్చయించిన యెడల వారినెదిరించి పోరిజయించి తమదేశస్వాతంత్ర్యమును గాపాడుకొనుటకు జపానుప్రభుత్వమువారికి శక్తియున్నదా యని మనస్సులలోఁ గలవరపాటును భయమును బుట్టినవి. జపానువారికో ఆకాలములో నుపయోగముగా నున్న యుద్ధసాధనములు ప్రాఁతవడినవి. ఐరోపావారు శాస్త్రప్రకారము చేసి యుపయోగించుచున్న సాధనములకుఁ దగినట్లుగా సమర్థములైనవి కావు. జపాన్ దేశీయుల యుద్ధగుణములును సుమారు 200 సంవత్సరములనుండి సాధకములో లేక మూలఁబడియున్నవి. ఇంతియకాక షోకూనువంశమువారికి విరోధులనేకులుండిరి. చక్రవర్తియధికారమును జైపట్టి రాజకార్యనిర్వాహకముల నన్నిఁటిని నడిపించుచు వచ్చుషోకూనును వెడలించి యాతఁడెట్లయిన నిబ్బందులలోఁ బడునేని మంచిదని పెక్కుమంది తలంచుచుండిరి. ఈసంధిలో షోకూను తానేమిచేయుట మంచిదో యని చింతించి యక్కడక్కడనున్న మాగాణుల యధికారులను బిలిచి వారితో నాలోచించి తగినట్లు చేయుటయే వివేకమయినపనియని నిశ్చయించెను. నిశ్చయించిన ప్రకారమే అమెరికావారు షోకూనునకుఁ బంపిన సందేశము నాయామాగాణములలో నుండు నధికారులయొద్దకుఁ బంపఁబడెను. అనేకు లనేకవిధములైన యాలోచనలు చెప్పియును దమకేదియును నిర్ణయము కుదురనందున జపానుతో నమెరికాకు యుద్ధముపొసఁగినా మనము జపానుపక్షమున యుద్ధముచేసి కాపాడవలయు నని సన్నాహపడుచుండిరి. రాజగృహమునకుఁ గోట బాగుగాఁ గట్టఁబడియెను. దేవాలయములలోను మఠములలోను వ్రేలాడుచున్న గంటలును లోకములో వాఁడుకలోనున్న యితరసామానులును గరఁగించి పిరంగులు పోసికొనఁబడియెను. అయిరోపావారుపయోగించు నాయుధములను దాముగూడ నుపయోగింపవలయునని జపానుదేశములోని వయసులోనున్న వారలందఱును యత్నించిరి. అనేకస్థలములలోనుండు యుద్ధవీరులు షోకూనునకు నివాసస్థానమయిన యడోకువచ్చి యెప్పుడు తమ్మందఱిని బరులను జయించుటకు నియోగింతురా యని యెదురుచూచుచుండిరి.

ఇట్లుండ 1853 సం॥ ఆగష్టునెలలో షోకూను చనిపోయెను. వాని కుమారుఁడు క్రమప్రకారము పట్టము కట్టుకొనియును జరపవలసిన విషయములలో నేమియు లోపము చేయలేదు. యడోసముద్రములో నున్న అమెరికా సైన్యములు తిరిగిపోయియుండఁగా నొకరుషియాసేనతో నోడ నాకసాకి రేవులోనికివచ్చి కనఁబడెను. ఆసైన్యములోనివారును వర్తకమునకని జపానువారిస్నేహమును గోరివచ్చితిమని చె

ప్పిరి. అట్లే యింగ్లీషువారి యోడలును వచ్చినవి. ఏసమయములో నీసేనలయొక్క నాయకులు షోకూనును జూచి మాటలాడవలెనని వాతఁబంపువారో యని సందేహము గలిగినది. ఇట్లుండ అమెరికాసైన్యము మునుపటికంటె నెక్కుడుగా వచ్చియెడో సముద్రములో నిల్వఁగా నిదివఱకెన్నఁడును దాముగాంచి యుండని యోధసమూహం బుంగనుఁగొని జప్పానువారు భీతినొందిరి. భీతికలిగినను ఆ 1854 సం॥ మార్చి నెల 31 వ తేదిని జపాన్‌రాజాంగమువారును అమెరికావారును బహువిధములుగా మాటలాడుకొని చివరకు వారొకయొడంబడికఁ గావించుకొనిరి. దానిని వెంటనే అమెరికాదేశమునకు రాజాంగస్థానమయిన వాషింగుటన్‌కు అక్కడి యధికారుల సమ్మతి పొందుటకుఁ బంపఁబడెను. ఆయొడంబడిక ప్రకారము అమెరికాదేశపుటోడలు రెండుమూఁడు జపాన్‌ద్వీపముల రేవులలో బొగ్గులు దీసికొనుటకు వచ్చియుండుటకును, ఓడలు బద్దలయినపుడాపదలోఁ బడి యక్కడదిగినవారిని సంరక్షించుటకును రెండుదేశములవారును వ్యాపారమును గూర్చియును గొన్ని నిబంధనలు చేసికొనుటకును జపానువారు సమ్మతించిరి.

ఇట్లు జపానువా రమెరికావారికి సందిచ్చినవెంటనే యాప్రకారమే యింగ్లీషువారు, రుషియావారు డచ్చివారు నడిగిరి. దానికి జపానువారొడంబడిరి. ఈవిధముగా నితరదేశస్థులతో షోకూనుప్రభుత్వముచేయువారు నడపఁగనే, పరదేశము వారిని దేశములోనికిఁ జేరనీయరాదని ప్రజలును షోకూనువంశమునకు విరోధులయినవారును మునుపటికంటె ననేకవిధముల నాతురత యగపఱపనారంభించిరి. షోకూనునకు పరదేశీయులతో వర్తకమునకయి యొడంబడిక చేయనధికారము లేదనియును, అతఁడెప్పటికిని దేశమునకుఁ బ్రభువు కాఁడనియును, చక్రవర్తియొద్ద ముఖ్యమైన పనులుచేయు కార్యస్థుఁడే కాని చక్రవర్తికి రెండవయంతస్థుగల యధికారము చేయ బాధ్యతకలవాఁడు కాఁడనియుఁ గావున నాతండొనరించిన యొడంబడికను జక్రవర్తి సమ్మతించువఱకును జపానుదేశస్థులు దానికి లోఁబడియుండ నవసరము లేదనియును జెప్పుకొనసాగిరి. కాని జపానువారి మనస్సులలో షోకూనునకుఁ గల నిజమయిన యధికారము గుఱించి యెట్టియభిప్రాయముండినప్పటికిని నితరదేశములవారితో సంబంధము కలుగువఱకును షోకూనే సకలమును వహించిన వాఁడని తలంచువారు. గ్రామములు కొల్లపెట్ట వచ్చినవారు స్వంతవస్తువులయినను ఎఱువుతెచ్చుకొన్నవగలయినను సందేహములేకుండఁ బుచ్చుకొనునట్లే జపానులో బలాత్కారముగాఁ బ్రవేశించి వ్యాపారముచేయఁ దీర్మానముచేసికొన్న అయిరోపావారికి షోకూనుయొక్క యధికార[illegible]దైన నేమి?



షోకూను అధికారము ఆకాలములో దుర్బలముగా నున్నట్లుండక పూర్వమెదురులేకుండ నుండినరీతి నున్నయెడల వారికధికారమున్నది లేదనుమాటపుట్టదు గదా. పైనచెప్పఁబడిన యొడంబడిక ప్రకారము హారిస్ అనువానిని అమెరికావారు పంపఁగా నాతఁడు షీమోడాపట్టణములో ఆ 1856 సం॥ న వాసముచేయ మొదలుపెట్టెను. అతఁడు గొప్పతనమును యుక్తియుఁ గలవాఁడగుటచే జపాను రాజాంగమువారు వానియందు నమ్మకముంచి యితరదేశములను గూర్చిన సకలాలోచనలను వానితోఁ జేయుచు వచ్చిరి. అతఁడొకప్పుడు రోగముచే బాధింపఁబడుచుండ షోకూను వైద్యులను బిలిచి హారిస్ రోగము కుదురక చనిపోయినయెడల మీకే నాశమువచ్చునని యానతిచ్చి పంపించెను. హారిస్‌యొక్క ప్రయత్నముచేత జపానువారితో నొక క్రొత్తయొడంబడిక అమెరికావ్యాపారమునకును అమెరికావారువచ్చి నివసించుటకును గొన్ని రేవులను [illegible]పర చేయుటకును, జేయఁబడినది. దీనినిబట్టియే యన్యదేశస్థులను పలువిధములుగా నెపములు పన్నివచ్చి కాఁపురముచేయఁగడఁగిరి. జపానులో దిగుమతియగు నితరసామానులకును బన్నులు విధింపఁబడెను. ఈపన్నులవలన జపానువారికి నష్టమే కాని లాభము రాలేదు. ఈసుంకమువల్ల వచ్చురాఁబడి, అది ప్రోగుచేయుటకు నియమింపఁబడిన సేవకుల జీతములకుఁ గూడఁ జాలకుండ నుండెను. జపానుసముద్రప్రాంతములలో నివసించిన యితరులకును జపానువారికిని న్యాయములగు తగవులు (కేసులు) వచ్చినయెడల నందులోఁ బ్రతివాదు లన్యదేశస్థులగుదురేని నపుడాయన్యదేశమువారే తీర్పుచేయవలయుననియు జపానువారగుదురేని జపాను మేజస్ట్రీటు తీర్పుచేయవలయుననియు నొడంబడికకలదు. అట్లేర్పడియుండుటకు జపాను చట్టములును మేజస్ట్రీటులును అయిరోపావారియొక్క నమ్మకమునకుఁ దగినవారు కారని అయిరోపావారు సాధించుటయే కారణముగాఁ బిమ్మట జపానువారు అయిరోపాదేశపుటలవాటుల ననుసరించి నాగరిక యత్నములు చేసి మేజస్ట్రీటులును చట్టములును అయిరోపా మేజస్ట్రీటులకును చట్టములకును సమానముగా నుండునట్లు చేసికొనుటవలన జపానులో నివసించు అయిరోపావారికి వేఱుగా న్యాయములు తీర్పుచేయుట యేర్పఱుప నవశ్యకతలేదని జపానువారు వాదింప నావిషయమయి యింకను మనస్తాపములు విడుచుటయే లేదు.

---

## ఆఱవ ప్రకరణము.

ఐరోపాదేశమువారు లోకములో నెంతటిమారుమూలలలోను గూడ నిక్కాల
మున బ్రవేశించి తమయధికారమును స్థాపించుచు వచ్చుచున్నారు. అట్లు స్థాపిం
చుటకయి యాదేశస్థుల నేవిధముగా నైనఁ దమకంటెఁ గ్రిందివారినిగాఁ జేయుటలో
నాదేశవాసులు న్యాయముచే నెంతటినాగరికత కలవారయినను ఐరోపావారికి
సమానులు కాఁజాలరని ధారాళముగాఁ జెప్పుచుఁ దమజాతివా రేమి నేరము చేసినను
దానిని విచారించి న్యాయము చెప్పు నుద్యోగస్థుఁడు ఐరోపాదేశమువాఁడే యుండ
వలయునని యాదేశవాసు లెవ్వరును దమసమ్మకమునకుఁ దగినవారు కారనియును
సిద్ధాంతము చేయుచు వచ్చుచున్నారు. ఆరీతినే మనదేశములో నన్ని చట్టములున్ను
బ్రిటిషుదొరతనమువారివలననే చేయఁబడిన వైనను మేజస్ట్రీటులు హిందువులునా మ
న్న పక్షమున నాచట్టములను బట్టి తమకు న్యాయాన్యాయములను తీర్పుచేయు యోగ్య
తలేనివారని మనల నవమానము చేయుచు బాగా దానిని రాజాంగమువారును సమ్మతిం
చుచున్నారు. సాధారణముగా, అల్పుఁడైన యూరోపుదేశవాసియైనను, వాఁడుచే
సిన నేరము స్వల్పమయినది యైనను వాని నేరమును విచారించి తీర్పుచెప్పుటకు ఐ
రోపాదేశపు మేజస్ట్రీటే యుండవలెనఁట. హిందువుల కవమానకరమయిన యీన్యా
యమును బోఁగొట్టుటకు 20 సంవత్సరములకు మున్ను మనకు గవర్నరుజనరలుగా
నుండిన లార్డు రిప్పన్‌గారు క్రొత్తచట్టమును నిర్మింప యత్నము చేయఁగా వానిమీఁ
ద నింగ్లీషువారు సమ్మతములేక కుట్రలుచేసి నిందలుమోపి కడకు దానిని నిర్మింపకుండ
నాపుచేయించినారు. ఇండియావలె జపాను స్వతంత్రములేని దేశము కాదుకావున
నాదేశమున నార్జనమునకయి వచ్చిన యితరదేశములవారు తమయిష్టప్రకారము స్థా
పనలు గావించుకొన్న జపానువారి స్థాపనలు నాగరికము తక్కువయినవని చెప్పుట
న్యాయముకాకపోయినను జపానువారికంటె నన్యదేశములవారు బలవంతులగుటచే వా
రు నిర్ణయించినట్లుగాఁజేయుట సాధ్యమగుచువచ్చెను. ఇపుడు జపానులో నాడు
కలోనున్న చట్టములును వాని ననుసరించి న్యాయవిచారణచేయు నధికారులును సా
ధారణులుకారు. కావున నితరులు పైఁజెప్పినవిధముగ జపానువారికి లోఁబడకుం
డఁ బ్రత్యేకగా న్యాయాధికారులను మఱియింకను నేర్పఱచికొనుట జపానువారియొక్క
స్నేహమును గోరుచున్నవారికి లక్షణము కాదు.

ఈతీరున జపానులోఁ బ్రవేశించి నివాసముచేయుటయును రాజ్యాంగమువారు
దానికిఁ దగినట్లు సంచరించుచుండుటయును జనులు చూచి చంచలము నొంది కలహ



ములు చేయనారంభించిరి. చిన్నచిన్న మాగాణుల నేలుచున్న చిన్నరాజులకులోఁబడి
వారిసేవకులుగానుండిన పనివాండ్రు, యోధులు మొదలయినవారు రాజ్యాంగమువారి
మీఁదఁ గలహముచేయ నిశ్చయించి తమయజమానులను విడిచిపెట్టి తమకు నాయకుఁ
డులేకుండనే స్వేచ్ఛగా నక్రమములు చేయఁదొడఁగిరి. వీరియుద్దేశము అన్యదేశము
వారిని, షోగూను ప్రభుత్వముతో సంబంధించినవారినిఁ గనఁబడినచోట నెల్ల జంపుట
యే యైయున్నది. దీనిం గాంచి పరదేశములనుండి వచ్చినవారు భయంపడి షోగూను
ప్రభుత్వముచేయువారి యనుమతిమీఁదనే తాము జపానుకు వచ్చియున్నందునఁ ద
మ్ములఁ దమపత్నీకమును నపాయమునుండి కాపాడుట రాజ్యాంగమువారి భారమే
యని విన్నవించుకొనిరి. 1860 సం॥ మార్చినెల ది 23 తేదీని, అప్పటికిఁ జిన్నతన
ముగా నున్న షోగూనుకుఁ బ్రతినిధిగా రాజ్యతంత్రమునడుపుచున్న మొదటిమంత్రి
షోగూనుగారి కోటలోనికిఁ బోవుదారిలోఁ జంపఁబడియెను. ఆతనిచావు [illegible]
మున వచ్చు షోగూనుగారి యధికారదౌర్బల్యమును సూచించినది. ఈవిధముగా నక్క
డ వధలు జరగుచుండుటం జూచి రాజ్యాంగమువారు పరదేశస్థులను హెచ్చరించిరి.
అట్లు హెచ్చరికచేసినవారిలోఁ గొందఱినిఁ గూడఁ జంపిరి. ఈదుష్టులను మొదలం
ట నశింపఁజేయుటకుఁ బ్రభుత్వమువారికి సామర్థ్యము లేక యాసమయమున నున్న
దేశస్థితిని గూర్చి జపానువారికి నితరదేశములవారికినిఁ గ్రొత్తగా నిర్మింప నిశ్చయింపఁబడి
యున్న యొడంబడికను దత్కాలమునఁ జేయుట మంచిది కాదని యైదుసంవత్సరము
లూరకుండి యానడుమ దేశస్థితి కుదురుపడిన యెడలఁ జేయవచ్చునని రాజ్యాంగమువా
రు చెప్పిరి. క్రొత్తయొడంబడికను బట్టి జపాన్ రేవులు కొన్నింటిలో నితరులు కొంద
ఱు వచ్చి నివసించునట్లు సమ్మతింపవలయు ననుదానిని ద్రోసివేయవలయు ననుకోరిక
తో జపానులోనుండి యితరదేశములకు దూతలనుబంపినారు.

అదివఱకట్లు జపానుదేశదూతలను బరదేశములకుఁ బంపుటలేదు. అన్యులు త
మదేశమువచ్చినచో వారికిఁ జోటిచ్చుటయే యాపదయగునని భయపడుచుండువా
రు, తామే యన్యదేశములకుఁ బోయి వానితో సంబంధము గలిగించుకొనుటకుఁ బ్రయ
త్నింతురా? అయినను కాలము ననుసరించి మనుష్యునకయినను మనుష్యసంఘమున
నకయినను గ్రొత్తగా మార్పులుండవలయును. జపానువారికిని నేకాలములోను
ని యాలోచనలుపుట్టి క్రొత్తపద్ధతులవలంబించుట యవశ్యమయినందునఁ బూర్వాచా
రములను నలవాటులను ననుసరించి నూతనమార్గములను విడుచుట దేశక్షేమమునకుఁ
దగదని నిశ్చయించు దేశాభిమానుల యుక్తుల ననుసరించి 1862 సం॥ జనవరినెలలో

యోకోహామానుండి యీదూతలు అమెరికాకు వచ్చి యక్కడనుండి యింగ్లాండునకు ను నొకంబడికలతో సంబంధించిన యితరదేశములకును వెళ్ళిరి. వెళ్ళినచోటనెల్ల వారికి మర్యాదలు జరగుటయే కాక కార్యసాఫల్యము కూడ నైనది. క్రొత్తరేవులు గల పట్టనములలో నన్యులకు నివసింప స్థలమిచ్చుటను గూర్చి తరువాత నిశ్చయింపవచ్చు ననియును నింతకు మున్నునివాసముచేయుచున్న పరదేశములవారికి వారివ్యాపారములకుగా నేవిధమయిన యాటంకమును సంభవింపకుండ జపానుప్రభుత్వమువారు కాపాడవలయు ననియును నిర్ణయింపఁ బడినది.

జపానుదూతలు పరభూముల కీవిధముగాఁ బోయి వచ్చుటచే నప్పటి యుద్దేశము నెఱవేరినదే గాక వేఱుగా ముఖ్యమయిన లాభమును గలిగినది. జపానీయులు నాగరికములేని సామాన్యజనులని యలక్ష్యముచేయుచు వచ్చుచున్న యన్యదేశములవారు వారట్టివారు కారనియును ధైర్యమును నాలోచనయు మంచినీతియు బుద్ధియుఁ గలవారనియు, దూతలయివచ్చిన జపానువారు అయిరోపా రాజ్యతంత్రానుభవము కలవారుగా నుండకపోయినను వారికంటె సాధారణులు కారనియును దెలిసికొనిరి. జపానువారును అయిరోపాలోఁ దాము చూచి తెలిసికొనిన వానివలన భ్రమపొందుచుండిరి. అయిరోపారాజ్యతంత్రమువారు కూర్చియున్న భయంకరమయిన సైన్యములను గూర్చి వారితో జపానువారెట్లు యుద్ధముచేయవచ్చునని శంకనుబొందిరి. చీనావారివలెనే జపానువారును నితరదేశస్థులను మ్లేచ్ఛులను స్వభావము కలవారే. కాని యట్లు ప్రతిదేశమువారును మ్లేచ్ఛులుకారనియు జపానువారి గౌరవమునకు[illegible]దగినవారనియుఁ దమదేశస్థులయొద్ద నేవిధమయిన భేదములేకుండు నట్లే వారితోడను స్నేహభావముతోనుండుటకుఁ దగినవారనియును గనుఁగొనిరి.

ఇట్లుండినను జపానులోనుండు నితరదేశవాసులను హింసచేయుటమాత్రము నిలుపుకాలేదు. ఇతరదేశస్థులవధ జరగినప్పుడెల్ల జపానుప్రభుత్వమువారు లక్ష, పదిలక్షలు ద్రవ్యమితరులకు నష్టము బలవంతముగా నీయవలసి వచ్చుచుండెను. ఇట్లు జరగు హింసలలో 1862 సం॥ సెప్టెంబరు నెలలో నొకవిశేషమయిన హింస జరగినది. దానితో గొప్ప యనర్థము సంప్రాప్తమయినది. షోగూను అధికారులకును జక్రవర్తి నాశ్రయించుకొని యున్నవారికిని నాకాలమునఁ గల యసూయలను సంబంధించి మనస్తాపములంకురించెను. వాని నొకవిధముగా నడంచి దేశస్థితిని బాగుపఱచుట ముఖ్యమని రెండుతెగలవారును తలంపుఁగొనియుండిరి. చక్రవర్తికక్షిలోఁ జేరిన షీమాజూ యీయుత్సాహంతో షోగూనునకు స్థానమయిన యడోకు వెళ్ళి యక్కడి యధి-



ధికారులతో మాటలాడి దేశములో నెల్లప్పుడును మైత్రినిలిచియుండుట కేమి చేయవలయునని యడుగఁగా షోగూను తగినట్లు సమాధానము చెప్పకుండను షీమాజూను సరిగాఁ జూడకయు మఱపించి కావలసిన పనులేమేని వచ్చినపుడు సభవారితో నాలోచింపవచ్చునులే యని యలక్ష్యముగాఁ బలికెను.

షీమాజూ దానితోఁ గోపగించి 1862 సం॥ సెప్టెంబరు నెలలోఁ దనస్థానమునకుఁ దిరిగి వచ్చుచుండ మార్గములో నొకయనర్థము ప్రాప్తించినది. షీమాజూతో నాతనిపరివారములోఁ గొందఱు నడచియుఁ గొందఱు గుఱ్ఱము లెక్కియు నడువ వారి వెనుక నొకసంఘమై యుద్యోగస్థులును న్యాయసభాకార్యస్థానముల యుద్యోగస్థులును పల్లకులమీఁద వచ్చుచుండిరి. సామానుబండ్లును గుఱ్ఱములును పెద్దపెద్ద బారులు తీఱివచ్చుచుండెను. ఎనిమిదివందల సిపాయీలు షీమాజూకు రక్షకులుగావచ్చిరి. ఈవిధమయిన వాహనములు మొదలయినవి జపానుదేశములోఁ బ్రయాణము చేయుచుండఁగా నితరప్రయాణికులు మార్గమున నీరీతిగా నడువవలయునని కొన్ని నియామకము లాదేశమునఁ గలవు. ఎవరికి సేనాసంబంధము లేదో, వారు, పైనచెప్పిన విధమున సవారీలు వెళ్ళుటఁ జూచునపుడు గుఱ్ఱములమీఁదినుండి డిగి రాజుపల్లకి పోవుచుండఁగా దానింజూచి తలవంచి మర్యాదచేయు నాచారము కలదు. ఆమర్యాదను సతిమొక రలక్ష్యముచేసి గమనింపకుండుటఁ జూచునంతటిస్థితిలో షీమాజూతోనున్న రక్షకభటులులేరు. ముఖ్యముగా వారు మనఃపూర్వకముగా భయపెట్టుచు వచ్చిన యితరదేశస్థులు పైనఁ జెప్పినట్లు మర్యాదచేయుటలోఁ దప్పిపోయిన యెడల మిగులనాగ్రహమువచ్చునుగాని సాధారణముగాఁ బోఁజాలదు. ఈషీమాజూ సవారి యడో నగరమును విడిచిన మఱునాఁడు యోకోహామానుండి దగ్గఱనున్న యొక దేవాలయముఁజూచుటకుగాను అయిరోపావారు ముగ్గురు పురుషులు నొకస్త్రీయును లసిపోవుచుండిరి. కానాకావాయను గ్రామసమీపమున నీయయిరోపావారు నలుగురును షీమాజూ సవారికి నెదురుపడిరి. పయినఁజెప్పినట్లు షీమాజూకు మర్యాదచేయువిషయము వీరికిఁ దెలియకపోవచ్చును, లేక తెలిసియుండియును లక్ష్యముచేయకుండిరేమో తెలియలేదు. సవారీప్రక్కను గొంతదూరము పోయిన పిమ్మటఁ బ్రక్కను వచ్చు సిపాయీలీఅయిరోపావారిం జూచిరి. ఈసిపాయీలు కత్తులు బల్లెములు ధరియించి భయంకరముగా నగపడుటకుఁ దోడు ముఖములయందుఁ గోపగుణమును గనఁబడఁగా నైరోపావారు లక్ష్యముచేయకుండ వాఁడుకచొప్పున దారిప్రక్క నొరిగియుండకుండ నుండుటయే కాక ఆసిపాయిలలోఁ గలిసి నడువసాగిరి.

షీమాజూ పల్లకిప్రక్కనేవచ్చి వీరు గుఱ్ఱములను దిగలేదు. మర్యాదయించుకంతయును గనఁబఱుపలేదు. దీనిం గాంచి జపానువారు వెక్కసపడి వారినలువురిలో నొకరిని గత్తితో నఱకివేయఁగా నాతఁడు మృతినొందెను. మిగిలినవారు భయంపడి తప్పించుకొని పాఱిపోయిరి.

ఈసంగతిని విని యోకోహామాలోనున్న యితరదేశస్థులు మిక్కిలి దుఃఖమును బొందిరి. వెంటనే యక్కడనుండు కొందఱిని సిద్ధముచేసి షీమాజూ యొక్క సవారిని ముట్టడించిపట్టించి చంపినవానితోఁ గూడ నాతని శిక్షలో వేయవలయు నని యోజించిరి. కాని యట్లు తొందరపడి యీయితరదేశస్థులు పగతీర్చుకొను యత్నము చేసినయెడల జపానునకును బ్రిటిషుదేశమునకును యుద్ధము పొసఁగు నని భయపడి కొందఱు బుద్ధిమంతులనిర్బంధముమీఁద నాయోజనప్రకారము నడవకుండ నుండులాగునఁ గొంతయేర్పాటు చేయఁబడినది. చేయఁబడినను జరగిన వధకుఁ బ్రతిగా షోగూను ప్రభుత్వమువారు, లక్షపౌనులను, నష్టముక్రింద నివ్వవలయునని బ్రిటిషువారు ఖండితముగాఁ జెప్పిరి. విధించిన యపరాధము భరింపరానియంతగా నున్నందున దానినిచ్చుటకుఁ గాని, లేక అయిరోపామనుష్యుని జంపినవానింబట్టి వారికప్పగించుటకుఁ గాని జపానుదేశాధికారులు సులభముగా నంగీకరింపలేదు. ఇతరులును విడిచిపెట్టి యూరకుండువారుగా నుండలేదు. తత్క్షణమే యితరదేశములనుండి యోడలువచ్చి రేవులలో నిలిచి భయంకరముగా నగపడి నేరమునకు శిక్షవిధింపనడిగిరి. అందులకు వారుసమాధానపడనందున నొకరేవులోనున్న కాగోషీమాన్ అనుపట్టనమును ఫిరంగులమగాల్చి బద్దలుగొట్టి పొడిచేసిరి. అప్పుడానగరము మిక్కిలి యున్నతదశలో నుండియున్నట్లును 1లక్ష 80 వేలజనసంఖ్య కలదియైనట్లును జెప్పుకొందురు. ఇట్టిపురము పాడయిపోయిన తరువాతి జపానువారు తెలివితెచ్చుకొని యడిగినట్లుగా నష్టద్రవ్యము నిచ్చుకొనిరి. చంపినవాఁడుమాత్రము కనఁబడనేలేదు. వానింగూర్చి యేమియును నిటీవలఁ జెప్పుకొనువారును లేరు.

ఈ చర్యలకు ఫలముగా నన్యులకున్న యుద్ధసామర్థ్యమును నాయుధవిశేషములును దమయుపయోగములు గాని పూర్వకాల సాధనముల వలన వారినెదిరించుటకుఁ జాలినవి కావని జపానువారి మనసులలోఁ గ్రొత్తవిచారమును గలిగించెను. అయిరోపావారితోఁ బోరుచేసి తమస్వాతంత్ర్యమును నిలుపుకొనవలసియున్నయెడల జపానువారైరోపావారి నైపుణ్యసాహసములను నేర్చుకొని వారివలెనే యోడలను శస్త్రాద్యాయుధములను సంపాదించి ప్రయోగింపఁగూడినవారైనపుడుగదా సాధ్యపడును. ఇట్టి తలం



పు గలిగి యుండియే యాలస్యము చేయక మాగాణములకధిపతులలో నొకరగు క్రొంటు తేరాషిమా యనువారితోఁ గొందఱు జపాను చిన్నవాండ్రు లండను నగరమునకుఁ బంపఁబడి యక్కడవారు యుద్ధనావలను ఫిరంగులను గొనుకట్టు కట్టుదిట్టములు చేయఁబడెను. ఇట్లు లండను చేరిన జపానువారు పడమరదేశముల జను లనుభవించిన స్వాతంత్ర్యములును, వారి యెసములేని మహోన్నతదశకుపాయము లయిన స్థాపనలును, రాజ్యాంగమునందలి జనులు చూపుచువచ్చిన పైపరామరికయు, జనసంఘము యొక్క యనేకవిధములయినవారిలోఁ బెద్దకులమువారు, తక్కువవర్ణమువారు, ధనవంతులు, దరిద్రులు, వర్తకులు, సేవ్యముచేయువారు, వీరిలోఁ బరస్పరసంబంధములోఁ గనఁబడు మైత్రిని, దేశాభిమానము మొదలయిన సద్గుణములను, జాగ్రతగా గమనించి జపానునకు దిరిగి వచ్చినపిమ్మట నక్కడ సంభవించిన మిన్నయగు విషయములంగూర్చిన తమానుభవముంగనఁబఱచి దేశక్షేమమునుగుఱించి యోజించుటకుఁ గారకులైరి.

ఈనడుమ నితరదేశములవారికిని జపానువారికిని గలిగిన విరోధభావము తగ్గలేదు. యడో నగరమున షోగూనుప్రభుత్వమువారికిని కియోటో నగరములోఁ జక్రవర్తితో సంబంధించిన కార్యతంత్రనిర్వాహకులకును విరోధము రానురాను ముదిరి యెట్లయిన యడోలోని యధికారులను పరులతోఁ బోరాడునట్లు చేయవలయు ననుదురూహ కలవారై కియోటో నివాసులు చేసిన యత్నములకు సోషురాష్ట్రాధిపతి తాను సిద్ధము చేయించి యుంచిన యోడలను నడిపి యితరులయోడల నెదిరింపఁ సహాయముచేసెను. అమెరికా యోడలును, ఫ్రాంసుదేశపు టోడలును జిట్టచివరకు డచ్చివారియోడలును గలసి యొక యిరుకైన జలసంధిలో నుండఁగా సోషుగారి ఫిరంగులున్న యోడలు కనిపెట్టి కాల్చఁగా అయిరోపానావికాసేన సోషూయొక్క యోడలను బద్దలుగొట్టి ధూళిగావించెను.

షోగూను విరోధులు చేసిన యత్నము నెఱవేఱినది. ఎట్లయినఁ బైనఁ జెప్పిన యుద్ధాభిప్రాయములు అన్యదేశములవారు పరాకుగానుండి విడిచిపెట్టువారు కానందున వెంటనే పూర్వప్రకారమే వంతుతీర్చుకొనవలె ననునుద్దేశముతో బలమైన నష్టద్రవ్యము నడిగినారు. షోగూను పాలకులు మాకేమియుఁ దెలియదనిరి. అందుపైనడుగకుండఁగనే, వారిలో, నేవిధనష్టమును గూడఁ బొందని యితరజాతివారుకూడ నన్యదేశములవారితోఁ గలసి యోకోహామాపట్టనము నుండి షీమోనోసేకీపట్టనపు రేవుచేరి యెదిరించిరి. దీనిం జూచి [illegible] భయపడి వారి శరణము వేఁడుకొనియెను. ఇట్టియనర్థములను నిలుపుచేయవలయు ననుతలంపుతో జపాను మంత్రులును నితరులును గూడి యాలోచిం

చి 1864 సం॥ అక్టోబరు ది 22 తేది నొకయేర్పాటు చేయఁగా, దాని ప్రకారము జపానువారితరులైన నాల్గువిధములవారికిని వారుపొందిన నష్టమునకుగాను, సంభవించిన వ్యయమునకును, 30 లక్షులడాలర్లు (డాలరు అనఁగా మూఁడు రూపాయల యెత్తుగల వెండినాణెము) యిచ్చునట్లును తడవకు 5 లక్షలు చొప్పున 6 తడవలకు దీనిం దీర్చుకొనునట్లును సమ్మతించిరి. ఈమొత్తమును నాలుగుజాతులవారును వారివారికిఁగలిగిన నష్టమున ననుసరించి పాల్లుపంచికొనిరి.

ఈవిధమున నితరరాజ్యాంగమువారు కేవలము తమసైన్యబలమువలననే జపానుప్రభుత్వమువారిని బలవంతము చేసి యింతనష్టద్రవ్యమును గోరుట పుచ్చుకొనుటయు నక్రమమేయని యనవలయును. జపాన్ రాజులు, పైఁజెప్పిన మాగాణియధికారి చేసినకలహమునకై తాము మిగుల విచారించితిమనియు, వానినడచుట కవకాశ మిచ్చినయెడల యత్నములు చేయఁబడుననియుఁ జెప్పిరి, చెప్పినను నితరరాజులు తాము విధించిన యపరాధద్రవ్యమును దగ్గించుట బొత్తిగా ధనాశచేతనే కూడదనిరి. ఇతరజాతియయిన నాలుగువిధములవారిలో వాస్తవముగా నింగ్లీషువారి కేవిధమైన నష్టమును గలుగకపోయినను నలుగురితోపాటు నష్టద్రవ్యము జపానువారిచ్చినదానిలోఁ బాలుపంచికొనిరి. అమెరికావారును జపానువారి యోడలవలన సంభవించిన నష్టమునకుగాఁ గొంతపుచ్చుకొనిరి. పుచ్చుకొనియును మఱియొకరివలె వారు రెండవతేపఁగూడ జపానువారినుండి ధనము బలాత్కారముగఁ బుచ్చుకొనిరి. ఇట్లు నిజముగ నష్టముపొందినవారును పొందనివారును జపాను సైన్యబలము తక్కువగలదియగుట చేతనే బలవంతముగ ద్రవ్యము పుచ్చుకొనినది, లోకములో నాగరికముగల, యిక్కాలములో నొకదేశమువారితో నొకదేశమువారు సహవాసము చేయుటలో ననుసరింపవలసిన న్యాయములకుఁ బొందికగాఁ జెప్పుటసాధ్యము కాదు. మఱియును, కలహము చేయుచున్న సోషూ యధికారిని జపానుప్రభుత్వమువారే యడంచి దండించునట్లు చెప్పినదానిని పరనృపాలురు లక్ష్యముచేయకుండఁగనే వానిమీఁదికిఁ బెద్ద దండు నడిపించి వృథానష్టముపొందిరి.

ఈవిధముగా అయిరోపావారు క్రిందిదేశపుప్రభుత్వమువారితో సంబంధములు విడిచిపెట్టుటలో "బలమే న్యాయ" మను మ్లేచ్ఛవాక్యము ననుసరించి తమ గుణాదులను ముందుఁబెట్టుటయును ఏషియా దేశమువారి లాభనష్టములను అసడ్డచేయుటయునుగా నడచుచున్నారు. సాధారణముగా నొకని నొకఁడు బాధచేయఁబోవునపుడు ప్రభువులేర్పఱిచియున్న న్యాయాధికారులు బాధించినవాఁడు బలవంతుఁడైనను వానిని శాస్త్రప్రకారము దండించెదరు. బలవంతుఁడు, దుర్బలుఁడు, గొప్పవాఁడు, కొ



ద్దివాఁడు, ధనవంతుఁడు, దరిద్రుఁడు మున్నగు నేవారికిని గూడ నొక్కటేవిధముగు చట్టమీకాలములో నేర్పడి హెచ్చుతగ్గులు లేకుండ న్యాయపాలనము గావింపఁబడుచువచ్చుచున్నది. అయినను నొకదేశమువారితో నొకదేశమువారికి మనస్తాపములవలనఁ బోరాటములు పొసఁగినపుడు పైఁజెప్పిన చట్టముల నిబంధనలుగాని న్యాయాధికారిగాని లేకుండ బలవంతులైన అయిరోపాజాతివారు చెప్పినదే సరియనియును, బలహీనులయిన యేషియాజాతివారు చెప్పినది తప్పనియుఁ బులికిని బశువునకును గల న్యాయముగా నేర్పడియున్నది. ఈన్యాయమును బట్టియే యేషియాలో నున్న సమస్తదేశములును అయిరోపావారి యడావిడి మొదలగు వానికి భయపడి లోఁబడిపోయినవి. అయిరోపావారియొక్క యధికారమునకు వశముగాని దేశము ఏషియాలో నొక్కటియును లేదు.



## [illegible]ండవ ప్రకరణము.

ఇట్లన్యప్రభు[illegible]వారివలన సంభవించిన కలహములుండఁగా యెడోలోషోగూనునకును కియోటోలో చక్రవర్తికిని మనస్తాపములు వృద్ధియగుచువచ్చెను. కియోటోలో నున్న చక్రవర్తి పూర్వాచారములనుబట్టి దేశపాలకుఁడుగాను యెడోలోషోగూను వానియొక్క కార్యనిర్వాహకుఁడుగాను నుండవలసినవారు. చక్రవర్తిని వానియధికారమును గాపాడుట షోగూను యొక్క విధియై యుండినను షోగూనుగారి యిష్టప్రకారమే యేకాధిపత్యమును నడపుట యెప్పుడును సాధ్యమైయుఁడలేదు. మేము చెప్పుచున్న సంగతులు జరిగిన కాలమున నేకాధిపత్యము వహించిన వారిప్పుడు చక్రవర్తిగా నున్న వారితండ్రిగారు. వారు 1847 సంవత్సరమున 17 యేండ్లప్రాయమున నీయున్నతపదవినొంది 1867 సంవత్సరమున 37 వత్సరముల వయస్సులో మృతినొందిరి. వారి కాలములో అయ్యామోనీ యనువారు షోగూనుగా నుండిరి. వారికి 1858 సం॥న పట్టముగట్టంబడెను. అప్పటి కాయనకు పదియేఁడుల యీడగుటచే నొకసంరక్షకుఁడు నియమింపఁబడెను. అట్లుండ కియోటోలోఁ జక్రవర్తిననుసరించి, యౌదార్యలేమియు నతృప్తియుఁ గలిగిన జనులు పెక్కుమంది కలరు. ఇట్టివారు షోగూనుతోడను గొందఱుండిరి. షోగూనునకు ప్రాణస్నేహితుఁడును నిచ్చలు నతనిపక్షముగనే మాటలాడునతఁడునైన ఏయిసు మాగాణమునకధికారి చక్రవర్తియొక్క నగరునకుఁ గావలిగా నేర్పడి గౌరవముగాఁ జూడఁబడుచుండెను. అట్లే యితర మాగాణముల యధికారులును వారివారి యుద్యోగపరివారముతోడను, సేవకులతోడను సేనలతోడను వచ్చి యమరియుండిరి.

ఇవ్విధమున నమరియున్న మాగాణముల యధిపతులు కొన్నివిషయములలో నైకమత్యములేక వేఱువేఱుభావములతో నుండియును జక్రవర్తియొక్క యధికారమును గాపాడి యెడోలో షోగూనుప్రభుత్వమును గ్రిందుపఱచి వేయవలయునను నూహతో నైకమత్యముం గూర్చుకొని యుండిరి. అన్యదేశస్థుల నెట్లు మనదేశమునుండి తొలఁగింపవచ్చునో యనుదానిం గుఱించి వీరిలోవీరు మాటలాడుకొనిరి. జపానుతో నొడంబడికలు చేసికొని రేవులలోఁ దమతమ ధ్వజములను నిలిపికొనిన యితరులను దఱిమి వేయుట యసాధ్యమని నమ్ముటకుఁ దగిన యాధారము [illegible]టికిని చక్రవర్తియు నాతనితోనున్న కొందఱును మన యీప్రయత్నము నెఱ[illegible]



ప్రయత్నములు చేయుచువచ్చిరి. పూర్వము జపానులో [illegible]చక్రవర్తిని షోగూను స్వయముగా దర్శించి దేశమును గుఱించిన యాలోచనలు చేయుట యేర్పడి యున్న యలవాటు నడుమ 280 సంవత్సరములు నిలిచిపోఁగా 1868 సం॥న షోగూను అయ్యామోచీ కియోటోకు వెళ్ళి పట్టణములలో వీథులవెంబడిని గల బీద[illegible] విశేషధనము జల్లుటయేకాక చక్రవర్తికి పూర్వమయిన కానుకలను సమర్పించి వారితో దేశమిప్పుడున్న స్థితియంతయుఁ జెప్పెను. ఇట్లు కియోటోలోఁ గొంతకాలముండి యాలోచనలు చేసినందులకు ఫలముగాఁ జిట్టచివరకుఁ జక్రవర్తి జపానునుండి యితరులను దొలఁగించి వేయునట్లుగా నొక ప్రకటన వ్రాసి దానినిబట్టి నడపించునట్లు షోగూనునకు సెలవొసంగెను. కాని షోగూనునకును వారి జీదారులకును మనస్సులలో నిట్లుచేయుట కిష్టము లేనందున నాప్రచురపత్రిక యితరదేశస్థులకుఁ దెలియఁ జేయఁబడెనే కాని దానిననుసరించి యేమియును నడపింపఁబడలేదు.

ఇట్లుండ సోషూమాగాణనాయకుఁడు చక్రవర్తిని వశముచేసికొని వారిని తన దేశమునకుఁ దీసికొనిపోయి విడుచునట్లు తంత్రము పన్నెను. ఇట్లు పన్నుటలో వానియభిప్రాయము పరులయెడల స్నేహభావముగా నున్న షోగూనుయొక్క వలలో నుండి చక్రవర్తిని దప్పించివేయవలయుననియే. దీనిని షోగూనుపక్షమువారు ముందుగనే తెలిసికొని దానికి వీలు కలుగకుండఁ జేయఁగా నది మొదలు పరదేశీయులయొక్క సహవాసము నసహ్యముగాఁ జూచుతలంపు కొట్టుపడిపోయినది గావున నాపక్షమువారు తగ్గిపోయిరనియే చెప్పవచ్చును. చక్రవర్తియును వారిమంత్రులును నొడంబడికయొక్క బలమువలనఁ దమరాజ్యములోఁ గాలూని యున్నయితరులను తొలఁగించుట జపాను వారిశక్తికి లోఁబడియుండలేదనియు, రాజాంగాధికారమెంతనైకమత్యముతోను నొక్కమధ్యస్థానమునుండి చెల్లుబడియగుచువచ్చినను వారిని దొలఁగించుట సాధ్యముకాదనియును స్పష్టముగా నెఱింగిరి.

ఇది మొదలు జపానుచరిత్రము నవీనాచారముల నవలంబించి బహువిధములైన కష్టనిష్ఠురములకు లోనయి తుదకాదికాలమునాఁటి యేర్పాటులను వలెఁ జక్రవర్తియొకఁడే యేకాధిపత్యమును వహించి పాలించుచువచ్చువాఁ డయ్యెను.

సోషూనాయకుఁడు మాత్రము తనయధికారము తగ్గింపఁ గూడదని కొంతసేనఁ గూర్చుకొని కలహము చేయరాఁగా వానిని దత్క్షణమే యణఁచి చేసిరి. కలహించినను సోషూ[illegible]లు పక్షముగా నడువఁగా వారికిని వారినణఁచిన వారికిని స్నేహభావమే కలిగినది. ఈసోషూ యుద్ధములోనే కయిటో కేకిమోషీ యను

మహాసామర్థ్యశాలి షోగూనాయకుఁడుగా నియమింపఁబడెను. చక్రవర్తియొక్క పూర్వపదవిని మార్చుటలో నీకయిటో మిక్కిలి ప్రబలుఁడై యుండెను. ఇట్లుండ నన్యప్రభుత్వమువారితోఁ జేయఁబడి యున్న యొడంబడిక యిదివఱకుఁ జక్రవర్తియొక్క యనుమతి పొందకుండెను. అట్లనుమతి పొందినయెడల నన్యదేశీయులతో సంబంధమును జపానువాసులు మిక్కిలి యసహ్యించుకొనరనిన యెన్నికతోఁ జక్రవర్తికి షోగూను విన్నవించుకొనియెను. ఒడంబడికలకుఁ జక్రవర్తి సమ్మతింపలేదనినయభిప్రాయము ప్రబలమయి యున్నందున దేశనిర్వాహకములో నెన్నండునులేని తొందరలు ప్రాప్తించుచున్ననియుఁ గావునఁ జక్రవర్తి తమయనుమతి నివ్వవలయు ననియును, నట్లివ్వకపోయినపక్షమున అయోకో రేవులో నౌకాసైన్యమును బోగుచేసికొనియున్న యితరదేశములవారు టోకియో నగరముమీఁదికి వచ్చి స్వయముగానే యనుమతిని బొందెదరనియును షోగూను పయివిన్నపములో నుదాహరించియుండెను. ఈవిజ్ఞాపనము ననుసరించి చక్రవర్తి తన యనుమతిని వేగముగాఁ బ్రకటము చేసెను. ఈసమయములో అయ్యమోషీ షోగూను మరణము నొందఁగా ఇతోచ్చుబాషీ షోగూనుగా నియమింపఁబడెను. వీని కాయధికారమును స్వీకరింప మనస్సు లేకపోయినను నాకాలమున జపానులోఁదోఁచుచున్న కుట్రలను నాటంకములను బాగుగా నెఱిఁగి యుండినను, జక్రవర్తియే నిర్బంధపెట్టి యనేకరాష్ట్రములనాయకులును మిమ్ము ననుసరించి యుందురని బోధించి చెప్పినందున సమ్మతించెను. ఈ యితోచ్చుబాషీ జపానులో నధికకాలమధికారముచేసిన షోగూనువంశములోఁ గడపటివాఁడు. వీనితో షోగూను అనునధికారస్థానము బొత్తిగాఁ దగ్గింపఁబడినది.

అయ్యమోషి చనిపోయిన కొన్ని నెలలకు 1867 సం॥ ఫిబ్రవరి నెల ది 3 తేదిని జక్రవర్తియు నమ్మవారి జాడ్యముచే మృతినొందెను. అన్యదేశములయొక్క సంబంధములో మితములేని యసహ్యమును గలిగియుండియును, వానితోఁ జేయఁబడియున్న యొడంబడికలకుఁ దాము సమ్మతించి యున్నందున జపాను చక్రవర్తియొక్క జన్మమునకుఁ గారణమయిన దేవాంశము వానిని విడిచిపోయి యమ్మవారి కాహారమయినాఁడని జనులు చెప్పుకొనిరి. వానికుమారుఁడు మూర్చుహీటో యనునతఁ డిప్పుడు 15 సంవత్సరముల వయస్సునఁ జక్రవర్తియయి యింకను పరిపాలనము చేయుచు వచ్చుచున్నారు. ఆవంశములో నాయన నూటయిరువదియొకటవపురుషుఁడు.

క్రొత్తగా రాజ్యభారము వహించుటకుఁ జక్రవర్తికి బాల్య[illegible]వలన మామూలుప్రకారము షోగూను పదవిలోనున్నవారే సకలాధికారమును వాస్తవముగా న



డపించుచున్నారనియును బరదేశములవారి స్నేహమును సమ్మతింపక వారికిఁ గీడుచేయుచు వచ్చు టోకియో నివాసులయొక్క యత్నము నిలిచిపోవుననియును నమ్మియున్నవా శేమరియున్నారు. ఎట్లయిన నన్యులసహవాసమును వేఱుచేయవలయునని మాత్రమే కాదు. జపానుదేశముయొక్క రాజ్యాంగభేదములన్నిటి నొక్కటిగాఁ జేర్చి సమీపమునం దప్పుడప్పుడు సంభవించు కుట్రలనెన్నఁడును సంభవింపకుండఁ జేయవలయునని దేశాభిమాను లాతురతతో నెదురుచూచుచున్నారు. ఇదివఱకుఁ బ్రభుత్వము రెండుస్థలములలో నుండఁగా దానిం బోఁగొట్టి యొక్కచోటనే స్థాపింపవలయుననునది రాజతంత్రము నడుపుచున్నవారి యుద్దేశమైనట్లు తెలియవచ్చెను. దీనికి దృష్టాంతముగా టోసా మాగాణి నాయకుఁడు 1867 సం॥ అక్టోబరు నెలలో షోగూనున కొక వ్రాఁతమూలమును బంపెను. అందేమియున్నదనఁగా:—"జపానుదేశముయొక్క కష్టములకెల్ల కారణము రాజ్యభారము రెండుభాగములయి యేకాధిపత్యముయొక్క దృష్టియు వినికియు నొక్కవైపునకుఁ బడకుండ రెండుదెసలకుఁబోయి చెదరుటయే. దగ్గఱగా సంభవించెడు కొన్ని విషయములు మనయొక్క పూర్వపుటేర్పాటులను మూలముట్టుగ మార్చివేసినవి. కావున నాయేర్పాటులనిప్పుడును మనము విడువకుండ నవలంబించుచున్నచో దేశక్షేమమునకుఁ జాలభంగము వచ్చును. రాజాంగాధికారము మనపూర్వాచారము ననుసరించి చక్రవర్తివశముచేసి జపానును గూడ లోకములోనున్న యితరదేశములతో సమానమయినదానింగాఁ జేయుట మిక్కిలి యావశ్యము." అని

ఇట్లు విరివిగా మిక్కిలిధైర్యముతోను బుద్ధికుశలతతోను టోసామాగాణినాయకుఁడు వెలిపఱచిన యాలోచనలను మనస్సులో స్థిరముచేసిన షోగూను తన క్రింది చిన్నచిన్న రాజులను దొలఁగించి వేయవలయునని తలంచుకొని యున్నందున దాని ననుసరించి వారి యభిప్రాయమేమో యని చెప్పి ప్రకటనపత్రికయొక్కటి ప్రచురించెను. ఎట్లనఁగా:—"అన్యులతో సంబంధము మనకొకనాఁటికంటె నొకనాఁడు బలపడుచున్నదే ముందునుండెనేని దేశముయొక్క చట్టదిట్టములను నిర్వహింప సాధ్యముకాదని నాకుఁదోఁచినందున నేకాధిపత్యమొక్కటిగాఁ జేయుటకు వీలుకలుగదు. కావున నేనును నాపూర్వులును నడపుచువచ్చిన యధికారప్రాబల్యమును జక్రవర్తికే యొప్పగించివేయవలయునని యోజనచేయుచున్నాను. యేకాధిపత్యముయొక్క సత్త్వమును రక్షించి ముందుకుఁ దెచ్చుటకు దీనికంటె నాకుచితమయిన యుపాయము తోఁచుటలేదు." అని. ఇట్లు 1867 సం॥ నవంబరు నెలలోఁ బ్రచురముచేసిన తీర్మానమునకుఁ దగినట్లు షోగూనుచేసి తనయధికారము చక్రవర్తి [illegible]

ప్పగించెను. దానికి చక్రవర్తియు నంగీకరింపఁగా 1603 సంవత్సరము మొదలు 264 లు పాలించుచు వచ్చిన షోగూనువంశమువారిగౌరవము తగ్గిపోయెను.

ఒకానొకప్పుడు చక్రవర్తియును వారి కాలోచనలు చెప్పుచుండువారును బాధ్యతను వహింప భయపడినవారయి క్రొత్తయేర్పాటుల ననుసరింప సరిపడక పూర్వప్రకారమే నడపుచు వచ్చులాగునఁ దీర్మానింపవచ్చునని షోగూనుపక్షమువారుకోరినారో యేమో? కోరియున్నను చాలసంవత్సరములనుండి షోగూను అధికారమును బొత్తిగాఁ బోఁగొట్టవలయునని యత్నములుచేయుచు వచ్చిన కొందఱునాయకులు నూతనరాజ్యాంగప్రాభవమును దామే వహించి నడపవలయునని యూహకలిగి యున్నారు. వారియాలోచనలమీఁదఁ జక్రవర్తి యిఁక దేశవ్యవహారము లెట్లుజరగవలయునని మాగాణుల నాయకుల నాలోచనలడిగిరి. అదినిశ్చయింపఁబడుటకు ముందే పనిమానుకొనిన షోగూను తనపూర్వాధికారభారమును ముఖ్యముగా నన్యదేశస్థులతో సంబంధించిన కార్యములును బూర్వమువలెనే నడపుచు వచ్చుటకుఁ జక్రవర్తివలన యాజ్ఞగొనెను. అట్లు స్వల్పకాలములోనే షోగూనుకు మరల నధికారమిచ్చుట కిష్టములేనివారై మాగాణుల నాయకులు దానిందొలఁగింపఁ గుట్రలుచేయఁ జూచ్చిరి. చక్రవర్తి బాల్యదశలోనుండుటచే వారిని వశపఱచుట దొరతనమువారి వ్యవహారములను నడపుట చాలలాభకారియని తలంచి షోగూనుకు ఏమియు నధికారమును లేకుండఁజేసి యెంతయధికారమును దమవశముచేయించుకొని యదిమొదలు పడినపాటులకు ఫలము సమకూడులాగునఁజేయ నిశ్చయించిరి.

ఆ 1868 సం॥ జనవరి ది 3 తేదిని జక్రవర్తి సెలవైనదనిచెప్పి పైనఁ జెప్పిన మాగాణులనాయకులు చక్రవర్తియొక్క వాసస్థానమును గాచుకొనియున్న సేనను దొలంగించి వారిస్థానమునఁ దమకులోఁబడిన సేనలను నియమించిరి. ఇంతియకాక, వారు చక్రవర్తి షోగూను స్థానమునే తీసివేసినారని యొక యుత్తరువును బుట్టించి, ప్రభుత్వముయొక్క వేర్వేఱువిధములయిన కార్యములను సమర్థతతోఁ జేయఁగలుగు కొందఱిని నియమించిరి. ఇఁక రాజ్యభారమంతయుఁ జక్రవర్తిగారి స్థానాధికారిగారొక్కరే నడపించుచు వత్తురనియు నొకప్రకటనను గావించిరి. ఇట్లు నూతనముగా నమర్పఁబడిన రాచఱికము యొక్క మొదటి యత్నమున బహువిధములయిన మాగాణులనాయకులమయిత్రియును నాదరువును గల్పించికొనఁ బడియెను. ఆ నేకులయిన మాగాణులనాయకుల సొత్తు జప్తుచేయుటకిచ్చిన యుత్తరువు తప్పించి వారివారిసొత్తు లెప్పటియట్ల యనుభవింప నాజ్ఞయొసంగిరి. దూరదేశములకుఁ దఱిమివేయఁ బడి గౌరవములును మాన్యములును నిల్పుచేయఁబడిన గొప్పవంశస్థులు మరలఁ దమతమ వాసస్థానములకు రప్పింపఁబడి వారివారిస్థానముల నిల్పఁబడిరి. షోగూనుయొక్క సేనలు 1868 సం॥ న నేకాధిపత్యస్థానమునుండి తొలఁగింపఁ బడియుండ, నిపుడు వారు మరలఁ బిలువఁబడి చక్రవర్తి నివాసస్థానమును నితరసేనలువలెనే కాచియుండు నధికారమును బొందెను. ఇట్లింతకుముందు గౌరవహీనమయినరీతిని బరదేశములలోనున్న పెద్దకులమువారిని సమర్పుచేసి వారివారికిఁ దగిన యధికారములందు నిల్పినందులకు ఫలముగాఁ గ్రొత్తప్రభుత్వనియామకములు బలపడకపోవుటయే కాక వారు ప్రభుత్వమునకు సమర్థులయి యట్టికష్టకాలములో రాజ్యమును సరిగా నడపింప శక్తిలేనివారయిరి.



ఈవిధముగా నొక్కప్రక్కను జరగుచుండ రెండవప్రక్కను బ్రభుత్వములోనుండి తొలఁగిన షోగూనును వానిని జేరినవారును గలహముచేయ నారంభించిరి. ఇతరదేశవాసులను గలసికొని షోగూను తమకు సంభవించిన విరోధమును గుఱించియును జక్రవర్తిని వశపఱచుకొన్న తమవిరోధులయొక్క చర్యలను గుఱించియును బహువిధములఁ జెప్పి తాను రాజ్యభారమును వహింప సమ్మతించి యుండినట్లును నితరులయొక్క సమస్తలాభనష్టములకును దానుపూచీదారుఁడై ముందునిల్చుటకుఁ దగినవాఁడనియును, తెలియపఱచెను. ఇవ్విధమున రాజ్యస్థితులు రెండుపక్షములై యుండుటఁ గాంచి యితరులు తమపక్షమువారును, దమయధికారములకు లోఁబడిన వారును నై రెండు కక్షులలోను గూడ సంబంధము కలిగించుకొనకుండ నిల్చియుండవలయుననియును నేపక్షవారికిని యుద్ధసాధనములతో సహాయము చేయఁ గూడదనియును, ఖండితముగా నుత్తరువుచేసిరి. ఇట్లిరుదెఱంగులవారును జేయిచేయి కలుపుసమయము వచ్చినపుడు మహాబుద్ధిమంతులయిన మాగాణుల యధికారులు కొందఱు స్థానభ్రష్టుఁడైన షోగూనును స్వయముగాఁ బోయి చూచి మాటలాడి వానిని సమాధానపఱచుట సాధ్యమగునని చింతించి యట్టే వారిని జూచి రాజకార్యములలో వాని కున్నతమయిన యుద్యోగమిచ్చునట్లును, కియోటో కాయన వచ్చునేని జక్రవర్తి వానిని బిలిచి యుపచారము చేయువారనియును జెప్పిరి. అందులకు షోగూను సమ్మతింపఁగా వానియొక్కని కియోటోకుఁ బంపుటకు సంశయించి కొందఱు వానితోఁ 10,000 సేనను బంపుటకుఁ బ్రేరేపించిరి. అట్లు పెద్దసైన్యముతోఁ బూర్వపు షోగూను వచ్చుట తగదని కియోటోవాసులు తలంచి దానినాపుచేయ నిశ్చయించిరి. చక్రవర్తి షోగూనును రమ్మని పిలిచినపుడు సేనలను దీసికొని వెళ్ళుట తగదుగనుక నొంటిగా స్నే

హాభావమున వెళ్ళుటయే మంచిదని చెప్పియును సైన్యమును దీసికొని వచ్చుపక్షమున దాని నెదిరింపఁ దామును సిద్ధముగా నుండిరి. వీరు సిద్ధపడినట్లే యెదిరించుటయు నవశ్యకమయినది. పోరు జరగినది. చక్రవర్తి పక్షమువారు గెల్చుకొనిరి. దీనిచేఁ బూర్వపుషోగూను కియోటో నగరములోఁ బ్రవేశింప వీలులేక యెడోకుఁ బోయెను.

ఇట్లు సంభవించిన యిక్కాలమున దేశములోఁ బ్రబలముగానున్న దేశాభిమానబలము ముందు కనఁబడనేలేదు. ఇతరదేశస్థులతోఁ జేసిన యొడంబడికల కేవిధమయిన యాటంకమును రాదనియును విరోధముచే నెవ్వరేని చెఱుపుచేయవచ్చిరేని వారిని ఖండితముగా దండింతుమనియును క్రొత్తరాజ్యాంగమువారు భయపెట్టి ప్రచురము చేసిరి. ఇంతియకాక జప్పానురాజ్యతంత్ర సంబంధమైన వ్యవహారములను నితరవ్యవహారములను జక్రవర్తియే నడపుచువచ్చుననియును వారితోఁ జేయఁబడిన యొడంబడికలను బట్టి నడపవలసివచ్చిన సకలకార్యములును జూచుట కవశ్యమైన యుద్యోగస్థుల నేర్పాటు చేయఁబడుననియు నట్లు జరగుచువచ్చు భేదములను వారువారు రాజ్యాంగమువారికిఁ దెలియఁ జేయుచుండవలయుననియును గోరి తెలియపఱచిరి. ఇట్లు తాము క్రొత్తగా వహించిన యేకదేశాధికారముయొక్క నిజస్థితిని నిరూపించుటకుఁ బరదేశస్థులు 1886 సం॥ మార్చి ది 28 తేదిని క్రొత్తప్రభుత్వమువారిని వచ్చి దర్శించుటకుఁ దెలియపఱచిరి.

ఈరీతిగాఁ జక్రవర్తి యితరులు తమ్ము దర్శించుటకై రావలయునని కోరినది యదివఱకు జప్పాను చరిత్రములో నెప్పుడును జరగియుండని క్రొత్తవిషయమగుటచే నితరులకు మితములేని యాశ్చర్యము కలిగినది. సూర్యవంశమునఁబుట్టి దైవాంశకలిగిన జప్పాను చక్రవర్తులు తక్కువవారైన యన్యదేశస్థులు తమసన్నిధానమునకు రాఁగా వారుతమతో సమానులని తలఁచుట యిదివఱకు నెన్నడును లేదు. అయినను బందొమ్మిదవశతాబ్దములోని జప్పానువారు మధ్యకాలములో నున్న జపానువారివంటివారు కారు. అన్యదేశస్థులతో సహవాసము, అనఁగా నితరదేశములనుండివచ్చి తమరేవులలో నివసించువారితోఁగలసి మెలసి యుండుట, జప్పానుదేశపు బుద్ధిమంతులు కొందఱు పరదేశములకుఁ బోయి యక్కడజరగు పరిపాలనము నాగరికము మెదలైనవి చూచి తలంపునందుంచుకొనుట, జపానువారు క్రొత్తపద్ధతుల ననుసరించునట్లుచేసి పూర్వానుష్ఠానము లప్పటికిఁ బ్రయోజనకరములుగానివని తలంచునట్లు గావించెను. అందువలనఁ జక్రవర్తియొక్క యిష్టమువచ్చినట్లు పరస్థానములవారు వారిని స్వయముగాఁ జూచుటలో నేవిధ



మైన విరోధమును గనఁబడుటలేదు. మార్చి ది 22 తేదీని పైనియామకము చొప్పున ఫ్రాంసు హాలండు దేశస్థులు చక్రవర్తినిగాంచి తగినట్లు బహుమానింపఁబడి యేమిచిక్కులు నులేకుండ మరలఁ దమస్థానముల కేగిరి. కాని బ్రిటిషువారి కార్యనిర్వాహకుఁడైన సర్, హెన్రీపార్క్సు మాత్రము తనస్థానమునుండి రాజగృహమునకుఁ బోవునపు డిద్దఱు పోకిరీవాండ్రు వీరావేశముచే వానితోఁగూడ వచ్చు తొమ్మండ్రను దాఁకి గాయపఱచిరి. అయినపుడు కొంటెవాండ్రలో నొకఁడక్కడనే చంపఁబడియెను. రెండవవానిం బట్టుకొనిరి. సర్ హెన్రీపార్క్సు గారికేమియు నపాయము రాలేదుగాని పరివారముతో రాజగృహమునుండి తమస్థానమున కేగిరి. ఇట్టిసంగతి రాజ్యాంగమువారు విని మనఃక్లేశమును బొంది పార్క్సు గారి యొద్దికేగి యీవిషయములో నాదుర్మార్గులు కావించినదానికై మాచక్రవర్తిగారు మిగులవిచారించుచున్నారని యనునయముగాఁ జెప్పి మఱునాఁడు తగినయేర్పాటులుచేయించి సర్ హెన్రిపార్క్సు గారిని చక్రవర్తిదర్శనమునకు రప్పించి వారికి బహువిధగౌరవములను జరపించిరి. ఇట్లు తగని చెఱుపులు సంభవించుచుండుటఁ గాంచి యన్యదేశీయులతో షోగూను కాలములోఁ జేయఁబడిన యొడంబడికలు చక్రవర్తివలన సమ్మతింపఁబడినందున వారివారికిఁ గల్గుగు నష్టములకుఁ జక్రవర్తియే యుత్తరవాదియై యుండెను. కనుక వారికి జపానుదేశోద్యోగస్థులలో నెవ్వరుగాని కీడుచేసినయెడల వారు వారియుద్యోగమునుండి తప్పింపఁబడి వారికి హారాకిరియను నాత్మహత్యచేసికొను స్వతంత్రమును దొలఁగించి సామాన్యులనేరము చేసినపు డుఱితీయునట్లే వారికులమునకు గౌరవహాని కలుగులాగునఁ బదిమంది చూచుచుండ నుఱితీయఁబడునని ప్రచురించి పైపార్క్సుగారి పరివారమునకపాయము దేఁబూనినయిరువురిలోఁ బట్టువడినవానిని పైనఁ జెప్పినట్లె శిక్షించినారు.

ఈసమయములో జపాను ఏకాధిపత్యమును జక్రవర్తియే యంతయును నడుపవలసినదా లేక షోగూనుకును దానిలో నెంతయైన భాగమున్నదా యని జనులుసందేహించుచున్నందునఁ దొలఁగింపఁబడినషోగూను వారితోఁ జేరినవారును గొంతకాలము కలహము చేసి యాపఁబడకుండ షోగూను అధికారములోనున్న కొన్ని యుద్ధనావలు చక్రవర్తివలన నియమింపఁబడిన యుద్ధనావల యధికారులకు లోఁబడక యెదిరించి యుద్ధముగావించినవి. 1869 సం॥ జూలై నెలలో యుద్ధముపాసఁగి షోగూను సేనానాయకులు చెఱపెట్టఁబడినను వారు యుద్ధములో నగపఱచిన శౌర్యమునకై మన్నింపఁబడిరి.



## ఎనిమిదవప్రకరణము.

ఇట్టి సందర్భములో కియోటోలో నేకాధిపత్యస్థానమువఁ జక్రవర్తియును మంత్రులును నూరకయూర్చుండలేదు. కాలానుగుణముగ రాజ్యమెట్లు పాలింపవలయునను నాలోచనచేసి యొకవిధముగా దానిని బాగుపడుస్థితిలోనికిఁ దెచ్చిరి. ఏకాధిపత్యమనునది యనేకవిధములుగా నున్నది. అందొకటి యేకాధిపత్యము నిర్వహించుట, యొకటి జపానుమతమైన షింటోమతపాలనమునడపుట, యొకటి దేశములోని వర్తమానములను మఱియొకటి యితరవర్తమానములను గనుగొనుట, తక్కినవి యుద్ధము, రాజ్యము, నీతిపాలనము, చట్టనిరూపణములను బరీక్షించి జరపుట, యను నెనిమిదివిధములు. ఇట్లు విభజింపబడియున్న విభాగము లప్పుడప్పుడు మార్చఁబడుచున్నను జాలకాలము నుండియు నవియే స్థిరముగా నంగీకరింపఁదగిన వనియే రాజ్యతంత్రమునడపువారు తలంచుచు వచ్చుచుండిరి. క్రమక్రమముగా జపానుయొక్క దొరతనపుస్థితి బాగుపడి స్థిరపడుచు వచ్చులాగునఁ జక్రవర్తి సకలాధికారమును నిప్పటి క్రొత్తసందర్భములను జూచుచు, వహించి యున్నందున వాని యలవాటులును వ్యవహారములును గాలానుకూలముగా నుండవలయునని మంత్రులు నిశ్చయించి చక్రవర్తియొక్క నడతలనుగూడ మార్పుచేయఁ యత్నించిరి.

ఇండియాలోను దక్కిన క్రిందిదేశములలోను రాజులను దేవతాంశముగా భావించి భయభక్తులుగలిగి వారు సామాన్యమనుష్యులవంటివారు కారనియును, వారినడత, తొడుగుకొనువస్త్రములు, సహవాసములును, వేఱుగా నుండవలయుననియును, నమ్ముటకలదు కాఁబట్టి రాజులు తమప్రజలయిన సామాన్యజనులుచూడఁదగినంత తఱచుగా వెలుపటికి రాఁగూడదని రాజగృహముల్లోనేయుండి తమకాలోచనచెప్పు మంత్రులతోనేగాక యల్పసౌఖ్యములకు సహాయభూతులయిన యల్పులతోడను సహవాసము చేయుట యలవాటు. వారలోకవ్యవహారము బాగుగ నెఱిఁగినవారేకారు. తమప్రజలక్షేమమునకుఁ గావలసినవివి యక్కఱలేనివివి యనియెఱుఁగరు. తమయంతఃపురస్త్రీలును హాస్యగాండ్రును, నిచ్చకములాడువారును, దగ్గఱిచుట్టములైయుండి, జూదమాడుట, మోసము చేయుట, తార్చుట మొదలయినవానియందు నిపుణులును, నైన ప్రతివారును జెప్పినదెల్లవిని తమసింహాసనమునకు దేశక్షేమమునకు విరోధముగానే నడచి నాశనము నొందుచున్నారు. ఎప్పుడు నిట్లే నడచుచున్నదని మేము చెప్పము, హిందూరాజులు దక్కరుపూర్వకాలమున యుద్ధములలోఁ బరాక్రమము చూపినట్లును పాలనమున బహు



నిపుణులయి యుండినట్లును మనము చరిత్రములలోఁ జదివి యున్నాము గదా! ఏకాలమున దేశములో సమాధానము గలిగి కలహములు లేకుండ నుండునో యాకాలపురాజులే దేశక్షేమమునఁ దలంచలేకుండ మూఢులవలెఁ దమయంతఃపురములలోఁ బడియుండుదురనుటకు సంశయింపవలదు. ఇప్పటి మన జమీందారులస్థితి కొంచెము యోజించిచో మామాటయందలి వాస్తవము బోధపడఁగలదు.

జపాను చక్రవర్తియును పైనఁజెప్పిన స్థితిలోనేయున్నట్లు చెప్పుకొనుచున్నారు. రాజ్యవిషయమంతయు షోగూను ఉద్యోగవంశమువారు పుచ్చుకొనఁగాఁ బేరునకుమాత్రమొకఁడు చక్రవర్తియని జనులవలన నమస్కరింపఁబడుచు వచ్చుచున్నందున దేశములోఁ బెద్దపనులలోఁ జొరంబడి జనులకుగష్టములుఁ రాకుండ దుష్టశిక్షణము శిష్టపాలనము చేయుటలోఁదమసామర్థ్యమును బుద్ధియు గుణములును వెల్లడిచేయు నవకాశము చక్రవర్తికిఁగలుగుటలేదు. ఈవిధవంశమునఁబుట్టినవాఁడె యయిన మూత్సుహిటో చక్రవర్తియును దనపూర్వులవలెనే యుండెను- ఉన్నను జపానుదేశస్థితి యితరులసహవాసము వలనఁ బూర్తిగా మార్పఁబడి వచ్చుచున్న కాలములో జపాను అంతయుఁదనయొక్కని యధికారములోనుంచుకొని స్వయముగాఁ బాలించుచున్న చక్రవర్తిసామర్థ్యమునను ప్రపంచానుభవములోను, రాజ్యభారమును వహించుటలోను దేశాభిమానములోను, దమపూర్వులకంటె పూర్వాచారములును సహవాసములును మానుట యవశ్యమేయని బుద్ధిమంతులు తలంచిరి. ఇట్లే 1868 సం॥ సాచుమాలోని ఓకుబోటో షిమిచ్చి యను మహాసామర్థ్యశాలి చక్రవర్తికొక విన్నపము పంపి దానిలో నికఁ జక్రవర్తియగునతఁడు పూర్వాచారముల ననుసరింపక స్వయముగా నెదుటనిలిచి పరిపాలింపవలయుననియును, నాతలంపుతో నేకచ్ఛత్రాధికారస్థానము మఱియొక్క క్రొత్తచోట స్థాపింపవలయుననియును దానికి ఓసాకా తగినచోటనియును దెలియపఱచెను- ఈసలహా దగ్గఱనున్న పెద్దల కాశ్చర్యమును గల్గించినను జక్రవర్తి దానివలనిలాభమును గనుఁగొనఁగోరి సమ్మతించెను- చక్రవర్తి బాల్యదశయందుండుటచే ననుభవము కలవాఁడు కాకపోయినను గాలమునకుఁ దగినట్లు క్రొత్తవానింగాంచి భయంపడువాఁడు కాఁడు- కాఁబట్టి కియోటోలోనున్న యేకాధిపత్యస్థానము టోషిమిచ్చి చెప్పినట్లు ఓసాకాకు మార్పలేదు గాని మూఁడునందలయేండ్లు షోగూను వంశమువారధికారము చేసిన యడోనగరమునకు మార్చి దానికే కియోటోయని పేరుపెట్టెను.

ఆ 1869 సంవత్సరమునఁ జక్రవర్తి ప్రాఁతకియోటోకు వెళ్లి తనతండ్రి సమాధిస్థానమునఁ జేయవలసిన యుత్తరక్రియలు చేసి యక్కడనున్నపుడు జపానుదేశపుఁ బెద్దకుల

ములలో శ్రేష్ఠమయిన ప్రఖ్యాతిగల ఇచ్చిజోయకులమునందలి యొకచిన్నదానిని వివాహముగావించుకొనెను- కియోటో జనులు నడుమ చాలకాలము విడిచియున్న చక్రవర్తిని విడువలేక యతనినక్కడనే యుండుమని కోరినందున బెండ్లికూతునక్కడ నుంచి తానుయడోనగరమునకు మరలవెళ్ళెను.

ఇట్లు జపానులోఁ గ్రొత్తనాగరికము పశ్చిమదేశస్థులసహవాసమువలనఁ బ్రబలమగుచున్న కాలములోను గూడ పైఖండమువారి మతమయిన క్రీస్తుమతముపై జపానువా రభిమానము గలవారు కాలేదు. పదునేడవశతాబ్దము జపానులో క్రీస్తుమతము ప్రబలము కాఁబోఁగా దానిని జపానుప్రభుత్వమువారు పలువిధములగు దుష్కార్యములచే మూలముట్టుగఁ దొలఁగించి యున్నారని చెప్పియేయుంటిమి. అట్లు నాశనముచేసినను అక్కడక్కడ నింకను దన్మతస్థులుండిరి. ఇపుడు 1868 సం॥న క్రీస్తుమతమవలంబించిన జపానుదేశస్థులెక్కడనైన నున్నచో వారిని మాకుఁ బట్టియిచ్చినవారికి బహుమానమియఁబడుననియును, క్రీస్తుమతము జపానుదేశములో నాదరింపఁబడదనియును నొకప్రచురము చేయఁబడియెను. ఈప్రకటనను గుఱించి యన్యదేశస్థులు బలమైన యాక్షేపణగావించిరి. అయినను మతసంబంధవ్యవహారములు జపానుప్రభుత్వమువారి స్వతంత్రమునకు లోఁబడియున్నందున అన్యదేశవాసులు వానిలోఁ జొరఁబడుట న్యాయముగాదని తమయభిప్రాయము చెప్పకపోయినను పిమ్మట నాల్గుసంవత్సరములకు 1872 సం॥న పరదేశములవారిపయి దాక్షిణ్యము కారణముగానే ప్రభుత్వమువారు దానిని గొట్టివేసిరి.

1869 సం॥ మేనెలలోఁ జక్రవర్తి తమమంత్రులను రాష్ట్రనాయకులను బిలిచి సభచేసి వారియెదుట నొక రాజ్యాంగశాసనముం జేసి దానిం బ్రమాణపూర్వకముగా నంగీకరించెను. దీనిలో నైదునిబంధనలుకలవు. 1 వది. ఆలోచనసభయనునది స్థాపింపఁబడి చట్టదిట్టములన్నియును నరదటియభిప్రాయమును బుచ్చుకొని నిశ్చయింపఁ బడుననియును, 2 వది. జపానులో గొప్పకులమువారు క్రిందికులములవారియభివృద్ధికిని ప్రభుత్వముయొక్క క్షేమమునకును దగిన శాస్త్రవిధులు బహుజాగ్రతతో నేర్చుకొనవలయు ననియును, 3 వది. సంఘముతోఁ జేరిన ప్రతిమనుజుఁడును మంచిపనులేవైనను జేయనిష్టముగలవాఁడైనపుడు వానికి సంబధించినవారు వానికి సహాయము చేయవలయుననియును, 4 వది. పూర్వకాలపువి, అవివేకమయినవియునైన సాంప్రదాయములను విడిచి స్వభావాధారముగానున్న వానిలో నీతియును, బక్షపాతము లేకుండుటయును ప్రమాణముగాఁ గొనవలయుననియును, 5 వది. ఏకాధిపత్యముయొక్క అస్థిభారమెప్పుడును కదలకుండ బలపడుచు నిలిచియుండుటను గుఱించి ప్రపంచములో నేభాగమునందయినను జ్ఞానమును గుణములును వెదకఁదగు ననియును నిట్టి మహోన్నతమయిన సంఘధర్మములు జపానుయొక్క నవీన నాగరికములో నంగీకరింపఁబడియెను. ఇట్లు శాసనము నిర్మింపఁబడిన 1869 సం॥లోనె పైనైదు విషయములలో మొదటిదానిననుసరించి కోకిషోయను పేరుగల పార్లిమెంటను సభయొకటి కూడెను. కూడఁ బోవునపుడు జను లేదో తమదేశక్షేమునకై తగిన లాభకార్యము జరగునని మిక్కిలి యుత్సాహపడిరి. ఆసభలో జపానులోని పెద్దవర్ణములవారి ప్రతినిధులునిండి యుండిరి. అయినను బ్రిటిషువారి పార్లమెంటుసభవారివలె రాజ్యనిర్వాహకము చేయ మొదలు పెట్టకుండఁ జక్రవర్తికిఁ గావలసిన యాలోచనలు చెప్పు విషయమైమాత్రమే యీసభకూడినది. ఈసభవారు బహువిషయములంగూర్చి యాలోచనలు చేసినను విశేషములగు క్రొత్తవానిని గ్రహించుట కిష్టపడినవారివలె నగపడుటలేదు. అయినను నీసభలోఁ బిమ్మట పడమటిదేశమునందువలెఁ బ్రతినిధిస్థాపన మూలమునఁ బ్రభుత్వము చేయు ప్రారంభము స్థిరపడుటకు మూలమైనది.



జపానుదేశములో బహుభాగములు చిన్నచిన్న రాజులపాలనములో నున్నట్లింతకు ముందుఁ జెప్పియున్నారము. వారుషోగూను అధికారమునకును జక్రవర్తి యధికారమునకును పేరునకుమాత్రము లోఁబడియున్నవారివలె నున్నను నిజముగావారు స్వాధీనాధికారులవలెనే తమసొత్తులను బాలించుచున్నారు. ఇట్లు చాలకాలమునుండి పైయధికారుల కుత్తరవాదులుగా నుండినందున వీరి యేల్బడివలన జనులకు సుఖ దుఃఖములుండినను వీరే యల్పసుఖములకు లోనై గణ్యతచెడి యున్నను నడిగినవారే లేరు. కావున వీరు కాలక్రమమున తమకానవాలగు నధికారధనమును దమకార్యస్థుల కొప్పగించివేసిరి. మొదటఁ జక్రవర్తియొక్క బలహీనమువలన షోగూను ప్రభుత్వమువారు తలపడినట్లును, షోగూను వారి బలహీనముచే వారిక్రిందనున్న కార్యస్థులు రాజాంగాధికారము పూర్తిగాఁ దమవశముచేసికొని నడపించుచు వచ్చినట్లును అక్కడక్కడ దేశములో స్థాపింపఁబడియున్న చిన్నరాజులు వంశపరంపరగా నేలుచువచ్చినయధికారమును బోఁగొట్టుకొని కార్యస్థులాడించిన బొమ్మలవలెనైరి. ఈస్థితిలో జపానుదేశపాలనము పలు మధ్యస్థలములలోనికిఁ జెదరి పాడయిపోయినది. దేశపాలనయొక్క మూలస్థానమైన చక్రవర్తియొక్క యేకదేశాధికారములో నిమిడి యుండవలయునని దేశాభిమానులు చేసిన యేర్పాటునకుఁ బైనచెప్పిన మాగాణుల యధికారులస్థితి సంబంధింపనిదిగా నుండెను. వారు చాలకాలమునుండి యనుభవించుచువచ్చిన స్వాధీనాధికారమును వారియొద్దనుండి లాగుకొని వారి విశేషమైన భూస్థితులను తగినవారికిచ్చి మాగాణు

ల యధిపతులు పోత్తును ప్రభుత్వములును బోఁగొట్టుకొను పక్షమున వారికిఁ దగిన లా
భములను గావించి వారిని దేశక్షేమమునకుఁ దగిన కార్యములలో నుపయోగపడఁ
గూడిన వారినిగాఁ జేయుట యెట్లని మిక్కిలి నాలోచనతోఁ జింతింపఁబడియెను. వారి
ని సైన్యబలప్రయోగమువలన నడంచవచ్చునేని నది యెంతమాత్రమును సరియైన యుపా
యముగాఁ దోఁచుటలేదు. కేవలము దేశాభిమానముచే మేలుకొని తమయాస్తి యంతయుఁ
జక్రవర్తివశము చేయుటకును నిండియాలోని జమీందారులవలెఁ గొంతసొమ్ము పుచ్చుకొ
ని తృప్తిపొంది యుండుటకును నిష్టపడువారని చెప్పుట మనుష్యస్వభావమునకు విరో
ధమైనవిషయము. ఈసందర్భమున జపానుకు మంచికాలము వచ్చెననుటకుఁ గారణము
లైనవానిలో నొకటేగా మాగాణుల యధికారుల లోఁ గొందఱు తమ జన్మభూమియొ
క్క ముందుకాలపు క్షేమమును నైశ్వర్యమును మనస్సునందుంచుకొని యదియంతయు
స్వలాభమువలె నెంచుకొని తమ తమ భూస్థితులను దక్కిన పదార్థములను జక్రవర్తి
కే యప్పగించి వేయఁదలఁచు చున్నట్లును జక్రవర్తి వానిసంగీకరింప వలయు ననియును
నొక విజ్ఞాపనము చేసికొనిరి. ఇట్లు వీరు పెద్దయాలోచనతోఁ జేసినదానిం జూచి మిగిలిన
మాగాణుల ప్రభువులు నట్లే కావించిరి. అట్లు మాగాణుల నాయకులందఱును విన్న
వించుకొనిన ప్రకారమే చక్రవర్తియును, వారు వారొప్పగించిన యాస్థులను ఏకా
ధిపత్యమునకు సంబంధించిన బొక్కసమునకుఁ జేర్చి వారినందఱిని 'కవాటోకు' గొప్ప
వారను నర్థమిచ్చు పేరుగల యొక్క శాఖవారినిగా నొనర్చెను.

ఇట్టి చిన్నరాజులందఱును బ్రిటిష్ దేశములో లార్డులు, డ్యూకులు, అనిపిలువఁ
బడు గొప్పవారివలెనే యైనందున మాగాణుల నిర్వాహకమునకై వేఱుగా నుద్యోగస్థుల
ను నియమించుట యవశ్యమైనది. అపుడు ఆఫుట్టుకచేతనే గొప్పవారని పించుకొను
వారిచ్చిన దరఖాస్తులను దీసివేసి స్థిరమును, యోగ్యతయుఁ గలుగువారినే వెదకుటకు
విధించిరి. గొప్పకుటుంబములోపల జన్మించినకారణమువలనే యెవ్వరికిని యోగ్యతయుం
డదు. అనేకులట్టి గొప్పస్థితిలోని వారి చిన్నబిడ్డలే పలుతెఱఁగులగు నయోగ్యతలను
బొందియున్న వారిని మనకన్నులయెదుటఁ జూచుచున్నారము. గొప్పకుటుంబములోని
వారికి గొప్పగుణములే యబ్బుననుమాట నిజమే యైనను సంఘోపకారకమైన గొప్ప
గొప్ప కార్యములను నిర్వహించుసామర్థ్యము చదువువలనను సహవాసమువలనను మాత్ర
మే కలుఁగవలసియున్నది. తక్కువజాతిలోని వారికైనను మంచిగుణములు గలిగియుండవ
చ్చును. అయినను గొప్పవంశమువారికెట్లు స్వభావముచేతనే కొన్నిమంచి గుణములు క
లిగియుండునో యట్లె తక్కువకులములలో వారికిని దక్కువగుణములే యుండుట ను



నము చూచుచున్నారము. కాఁబట్టి జనసామాన్యమునకంతకును క్షేమమును గలిగించు
పెద్దయుద్యోగములను బొందుటకు విద్యయును సద్గుణములును, సామర్థ్యము గలిగిన
సిపారసులని రాజాంగమువారంగీకరింపఁ గూడినను, ఇవి గొప్పకుటుంబములవారితో
సంబంధించియున్నను, నట్లుండుటయే శ్రేష్ఠమయిన యోగ్యతయని లోకములో నంగీక
రింపఁబడినది. ఆ యాచారమును ముందుంచుకొనియే రాజాధిరాజులయి యేకచ్ఛత్ర
ముగా లోకమంతయుఁ బాలించుచున్న చక్రవర్తులైనవారు, గవర్నరు జనరలులను
గవర్నరులను నియమింపఁబోవునపుడు, జనులను గూర్చికట్టుకొని పాలించు సామర్థ్య
మును అనుభవమును గల గొప్పవంశమువారినే నియమించుచున్నారు.

పయినఁ జెప్పినట్లు మాగాణుల యధికారులు స్వాధీనులైనందున సంభవించిన
కష్టము నివర్తియైనప్పటికిని వారికి వారికార్యస్థులకు సమాధానముగాఁ బ్రతిక్రియ చే
యుటలోఁ బ్రభుత్వము వారుకష్టమును బొందిరి. ఎట్లనఁగా:—వారియాస్తివలనఁ గ
లిగినరాఁబడి చక్రవర్తిగారి ధనాగారమునకుఁ జేరునట్లు తీర్మానింపఁబడినందున వా
రివారి యంతస్థులకుఁ దగినట్లు యోగక్షేమములు కలుగునట్లు చేయుట యవశ్యమైనది.
ప్రభుత్వమువారేమిచేయుచున్నారనఁగా, మాగాణములయధికారులకు వచ్చురాఁబడి
మొత్తములోఁ బదిలో నొకభాగమును పెన్షనుగాఁ జేసి యాపెన్షను పదిసంవత్సరము
లకు సుమారెంత మొత్తమగునో దానినెక్కుడు చేసి యాధనమును గవర్నమెంటు
పత్రములుగా మార్చి వానికి గవర్నమెంటువారివలన నేర్పఱపఁబడిన వడ్డి యావారు
వారికిచ్చుచున్నారు. ఇట్లిచ్చుచువచ్చిన కొంతటికిఁ దమరాష్ట్రములను నిర్వహించు
టకై సంభవించుచువచ్చిన సైన్యములు మున్నగువానికైన వ్యయములు వారేయిచ్చుకొ
నునట్లు చేయక రాజ్యాంగమువారే యిచ్చునట్లు చేసిరి. ఇట్లు చేయుటకుఁ బ్రభుత్వ
మువారికిఁ బ్రమాదమయి కొంతధనమప్పు తెచ్చి సమర్థింపవలసివచ్చినది.

జపానుదేశము యొక్క అభివృద్ధికిఁ దగిన విషయములలో నీమాగాణముల య
ధికారులకిట్లు చేయుట యొక్కటియైయున్నది. పిమ్మట నపుడపుడు సంభవించిన
బహువిధములయిన చిన్నవిషయము లిక్కడఁ జెప్పనవసరములేదు. అయినను నిట్లు
జరగుచుండఁగా జపానుప్రభుత్వము చక్రవర్తి యేకాదేశముక్రింద నడచుచు వచ్చు
ట నవీనకాలస్థితికిఁ దగినదికాదనియుఁ జక్రవర్తిగారు మంత్రాలోచన సభ యొకటి
స్థాపించి సమస్తమయిన చట్టములును నందఱి యభిప్రాయమనుసరించి తీర్మానింపఁ
బడునని యిచ్చినవాక్యము ననుసరించి నడపింపవలయుననియును గొందఱొక్కటిగాఁ
జేసి యత్నములు చేయఁజొచ్చిరి. ఇట్లు చక్రవర్తి యిచ్చిన వాగ్దానముప్రకారము

పాలించుట వారికసమ్మతము కాకపోయినను నేకాధిపత్యవ్యవహారములను కూడియాలోచించి యుచితరీతిని ధీర్మానింప జనులతరఫున ప్రతినిధులను నడపించుట కుపాయముగా 1878 సం॥ వ వచ్చుటచ్చుట సభలు చేయఁబడియెను. ఇవి మనమ్యూనిసిపాలిటీలును డిస్ట్రిక్టుబోర్డులును బోలినవే, ఆయాస్థలములలో నివసించు జనులకు మేలు చేయుటకై యేర్పడినవి. ఇట్టి స్థలస్థాపనములలోఁ గొంతకాలము జనులప్రతినిధులు తెలిసికొనుపక్షమునఁ బిమ్మట నేకచ్ఛత్రాధిపత్యమంత్రాలోచన సభలు నడుప యోగ్యతగలప్రతినిధులు దొరకుదురను నమ్మకము గలిగినది. ఇట్టినమ్మకమునుబట్టి 1889 సం॥ ఫిబ్రబరి ది 11 వ తేదిని జక్రవర్తి తమమంత్రులను, ఉద్యోగస్థులను రావించి వారి యెదుటఁ దమప్రజలను పాలించుటలో వారికిఁ గొన్ని స్వాతంత్ర్యములనిచ్చి తాము నవారు నేకీభవించి యేకాధిపత్యనిర్వాహకప్రయత్నములను ఐరోపాలోనున్న పార్లమెంటువలె నొక్కటిస్థాపించి దానికిఁదగినట్లు చేయుచు వచ్చునట్లు ప్రమాణముచేసిరి. యిట్లు స్థాపించినది యేఁడువిధములయిన భాగములు కలిగియున్నది.

ఏవియన:—

1. చక్రవర్తిని గురించి.
2. జనులస్వాతంత్ర్యమును, వారికిఁగావలసినవానిని గూర్చియు.
3. ఏకాధిపత్యప్రతినిధిసభను గురించి.
4. రాజ్యాంగముమంత్రులను, జక్రవర్తియొక్క మంత్రాలోచనసభను గూర్చియును
5. నీతిపరిపాలనమును గూర్చి.
6. పన్నులు వసూలు చేయుట గురించి.
7. తక్కినవిషయములం గూర్చినది.

అప్పుడే యీవిధముగా స్థాపింపఁబడిన సభ 1890 సం॥ న గూడఁ బడునని యును, అట్లు కూడిన తేది మొదలుకొని పైనఁజెప్పిన సభనడపఁబడుననియును జక్రవర్తిగారు సెలవిచ్చిరి.

ఇట్లు జపానుదేశపు భావికాల యోగక్షేమములకాధారముగాఁ దలఁపఁబడిన క్రొత్తయత్నములు జరగుచుండ నాదేశములో నేవిధమయిన యత్నము చేయఁబడినను, నొక్కగొప్పవాని ప్రాణము పోకుండఁ జేయలేకున్నారనిన వదంతికలిగినది. అపుడు మహాదేశాభిమానియైన వైకౌంటు మోరీ అరిమోరీ యను నాతని వానివిరోధియొక్కని ప్రేరేపణవలన నొక్కపాపాత్ముఁడు చంపెను. తమదేశము అప్పటినాగరికవిషయములలో ముందుకు వచ్చుటఁ జూచి ప్రీతియును దృష్టియును బొందిన దేశాభిమాని మోరీ తప్ప



మతియొక్కఁడు లేఁడు. కీర్తియును గొప్పతనమును బొందిన యేకార్యము జపానులో జరపఁబడినను దానికిఁ దలుకట్టుగా నిల్చుటకుఁ దగిన సామర్థ్యమున్న వాఁడై యెల్లపుడును దమదేశక్షేమమునే కోరిన వీరిట్లు చంపఁబడుట లోకములో మేలైనపనిని అవేలుటలో సహజముగాఁ గలుగు నాటంకములను సూచించు దుఃఖకరమైన విషయమనియే నిశ్చయింపవలయును.

తూర్పుదేశస్థులకు రాజ్యముచేయు నుపాయములలో సామర్థ్యమెన్నఁడును లేదనియును, వారేకాలములోను సమస్తాధికారములను వహించి మనసువచ్చినట్లు దేశమును బాలించురాజునకు వశవర్తులై తమస్వాతంత్ర్యములను దెలిసికొనలేనివారివలెఁ బ్రతుకుచున్నారనియును, ప్రతినిధిస్థాపనముగాని రాజ్యాంగప్రతినిధిగాని వారిచరిత్రములలో లేనేలేదనియును, నిట్టిస్థాపనములందును, ప్రభుత్వమునందును, పడమటిదేశజాతివారే, యందునను ముఖ్యముగా బ్రిటిష్ జాతివారే మొదటనుండఁగా వారిని జూచి యితరదేశములవారు వానిని గ్రమక్రమముగా నవలంబించి యనుష్ఠించుచువచ్చుచున్నారనియును నింగ్లీషువారి తలంపుగా నున్నది. ఏషియాదేశములయొక్క చరిత్రములను శోధించునపుడు పైనఁ జెప్పిన యింగ్లీషువారి యభిప్రాయమే నిజమయినట్లు గనఁబడుచున్నది. ఇండియా, చీనా, పెర్షియా, టర్కీ, ఈజిప్టు ఇవి మిక్కిలి పురాతనదేశములైనట్లును పెక్కువందలకొలఁది సంవత్సరములక్రిందటనే విశేషముగా నాగరికదశను బొందినట్లును, రాజులు తాము తలఁచినదేయొక చట్టముగాఁ జేసి జనులను పాలించుచు వచ్చినట్లును, దెలియవచ్చుటయె కాని జనప్రతినిధులకు రాజ్యాంగాధికారమిచ్చి వారియభిప్రాయములకుఁ దగినట్లు రాజ్యభారము నడపించినట్లు తెలియవచ్చుటలేదు. మనదేశమయిన భరతఖండములో మనపెద్దలు వృద్ధిచేయుచువచ్చిన నాగరికస్థాపనములును, వారిశాస్త్రము, విద్య, అడకువ, మొదలయినవియును, నిప్పుడు తెలిసికొని యాశ్చర్యపడువారలేకపోయినను, మనచరిత్రములలో నేకాలములోఁగాని అశోకుఁడు, భోజుఁడు, విక్రమాదిత్యుఁడు, నందుఁడు, విజయనగరచక్రవర్తులు, ద్రవిడదేశపురాజులు, వీరెవ్వరయినను, దమరాజకీయసభలలో జనప్రతినిధులనమర్చి బ్రిటిష్‌పార్లమెంటువలె సభను స్థాపించి రాజ్యముచేసినట్లు తెలియవచ్చుటలేదు. ఇట్లే చీనా, పెర్షియా, ఈజిప్టులలోను గూడ ధనము, విద్య, సైన్యబలము, వర్తకము, చేతిపనులు, నాగరికము మొదలయినవానివిషయములో మిక్కిలి కీర్తిని బొందియున్నవారయినను రాజైనయొక్కని యిష్టానుసారముగా దేశవిషయికమయిన కార్యములు నిర్వహింపఁబడుచు వచ్చుచున్నవి. రాజు దేవునియంశకలవాఁడనియును, వానియాజ్ఞలను మీఱకుండఁ గ్రిందివారయి వినయముతో నడచుచుండుట తమవిధియనియును జనులునమ్మియున్నారు.

ఇట్లు తూర్పుదిక్కునంగలదేశములన్నియు నొక్కరాజునకే లోఁబడియుండఁగా జపానుమాత్రము స్వల్పకాలములో ఆయిరోపావారివలె రాజ్యము చేయుటయును,



సైన్యము, వర్తకము, చేతిపనులు నింకను జనసమూహాభివృద్ధికిఁ గావలసిన వివిధమార్గములలో వారివలెనే యనుష్ఠించుచు వచ్చుటయును గలుగుట యేవిశేషకారణమువలన నని విచారించుట ముఖ్యమయినదియే యనవచ్చును. దైవసృష్టిలో నేపదార్థముగాని కారణములేనిదే యుండదని సర్వశాస్త్రానుభవమువలన సిద్ధాంతముచేయఁబడినట్లే మనుష్యసమూహముయొక్క వృద్ధిలోఁ గూడ నేమార్పయినను దగినంతకారణము లేకుండఁ గలుగదు. పెక్కునూర్ల సంవత్సరములనుండి జపానుదేశము లోకములోని యితరదేశములతో నేవిధసంబంధమును బొందకుండఁగనే పూర్వుల యనుష్ఠానములనే ప్రమాణముగా ననుసరించుచు వచ్చుచున్నదేశమే గాని యన్యులసహవాసముచేఁ గ్రొత్త పద్ధతుల నంగీకరించి గట్టివారగుటకు వీలయిన యుపాయముల నేర్చికొనినది కాదు. ఆదేశములోను రాజు దైవాంశాసంభూతుఁడని తలఁపఁబడి యాతఁడు చెప్పినదే శాస్త్రముగా జనులు నమ్మియున్నారు. వందలకొలఁది గల చిన్నరాజులక్కడక్కడ నివసించి జనులను బీడించి దుష్కార్యములు చేయుస్వభావముగలవారయి యున్నారు. ఇండియాలో వలెనే జాతిభేదము లేదుగాని స్థితిగతులభేదముచే ధనవంతుఁడు బీదవానిని గష్టపెట్టుచు దేశమైకమత్యమును బొందకయుండును విధమును లేకుండఁగనే యున్నది. మహమ్మదీయమతమువలె జనులకు స్వాభిమానమును గాని దేశాభిమానమును గాని బోధించుచు వచ్చినట్లును జపానులో గనఁబడదు.

అయినను నొక్కగొప్పవిషయములో మాత్రము జపాన్‌దేశము మిక్కిలి యదృష్టవంతమయినది. ఆదేశమునకుఁ జరిత్ర యేర్పడిన కాలము మొదలుకొని చాలసంవత్సరములవఱకు నొక్కవంశములోనివారే రాజ్యము చేయుచువచ్చిరి. ఇంతకాలమును జపానుమీఁదికి పరులు దండెత్తివచ్చినది లేదు. ఆదేశవ్యవహారములలో నితరులప్రమేయము గలిగించుకొన్నదియును లేదు. జపానువారు చక్రవర్తినింతకుముందు మేము చెప్పియున్నట్లు దైవమని తలఁచి వానినే మొట్టమొదటిదైవముగా వినయమును భక్తియును జూపుచు వచ్చుచున్నారు. చక్రవర్తి దైవమే కనుక వారిశరీరము పూజార్హమయినదనియును వారిమనస్సునకు కోపందికలుగఁ జేసినయెడలఁ బాపము సంభవించుననియును వారియిష్టప్రకారము నడచుటయే జనులవిధియనియును నిట్లు జపానుదేశమువారందఱును దమచక్రవర్తియైన యొకపదార్థమునందే దమభక్తి, విశ్వాసము, ప్రేమ, ఆశ, మొదలయినవి యుంచియున్నారు. ఈయొక్కకారణము చేతనే జపానువారొక్కవిధముగా నేకీభావముతో నున్నారు. తమచక్రవర్తి కేవాఁడు శత్రువగునో వాఁడు దేశమునకెల్ల శత్రువే; చక్రవర్తిని సంతోషపెట్టుటయే వారిమతమును దేశాభిమానమునునయియున్నది. ఇట్టిస్థితి కిటీవలికాలమున విరోధము సంభవించిన

పుడు వెంటనే జపానుదేశస్థులు కన్నులు తెఱచిచూచి తమదేశస్థితినిబట్టి సంభవించిన యాపదలకుఁ గారణములను శోధించి యందఱునొక్కటిగాఁ జేరి తమచక్రవర్తిని రక్షించుటకయి యావేశమునుగొనిరి. అదృష్టవశమున జపానుదేశమున కీయభివృద్ధిక లిగినకాలములోఁ జక్రవర్తిగా నున్నవారును రాజ్యతంత్రములు నడిపించువారయి ప్రజలక్షేమము తమక్షేమముకంటె నెక్కుడుగా భావించి కాలమునకుఁ దగిన మార్పులను జేయుటయందు వెనుకదీయనివారయి యుండిరి.

1868 సం॥న క్రొత్తయత్నములు ప్రారంభమయిన సమయమున నొకరిద్దఱు చిన్నరాజుల జాతివారును దేశాభివృద్ధియం దభిమానముగలవారై చక్రవర్తియధికారమును షోగూనువంశమువా రాక్రమించుకొనఁగాఁ జక్రవర్తికేయధికారమును బలుకుబడియును లేకుండఁబోయినది మనస్సుననుంచుకొని దేశక్షేమమునకు రెండుభాగములు గానున్న రాజ్యాధికారము మిగుల విరోధముగా నుండును గాఁబట్టి యెట్లయిన మధ్యనువచ్చిన షోగూను వంశమువారిని దొలఁగించి పూర్వరీతినే చక్రవర్తియే సర్వాధికారమును వహింపవలయునని యత్నించి షోగూనుకు విరోధముగా బయలుదేఱి దానినడఁచివేసిరి. ఈతరుణములో నిట్లు బలవంతులైన కొందఱు చిన్నరాజులు దేశాభిమానముగలవారై ముందుకు వచ్చుటయును జపానుయొక్క ప్రస్తుతస్థితి కొక్కకారణముగాఁ జెప్పవచ్చును.

ఇదియునుంగాక యింకొక కారణమునుగలదు. 1868సం॥ నకుఁ గొంతముందు పెక్కుమంది ఆయిరోపాజాతివారు వర్తకమునకని మిషపెట్టి జపానుదేశములోఁ బ్రవేశించి షోగూను దయను సంపాదించి దేశమునకు విరోధమయిన కార్యములను జేయుచువచ్చినట్లు చెప్పియున్నాము. వీరిగౌరవము రానురాను వృద్ధియయినది, జపానురాజాంగ స్వాతంత్ర్యమును బోఁగొట్టుకొని పోవునట్లు కొన్ని చిహ్నలు కనఁబడఁగా జపానుదేశాభిమానులు మిక్కిలి లజ్జయును గోపమునుబొంది తమదేశమును షోగూనెక్కువైపునఁ జక్రవర్తి యొకవైపునను బ్రభుత్వభేదములచేఁ జెడఁగొట్టినపక్షమున భూమిపైన ధనముపైన నాసపుట్టి దేశములోఁ బ్రవేశించియుండిన యితర దేశములవారు తమ దురుద్దేశములను నెఱవేర్చుటకు సాధ్యమగుననియు నిది నిశ్చయమనియును భయపడిరి. షోగూను పదవినే తీసివేసి చక్రవర్తినొక్కనినే తమ దేశప్రభుత్వమున కధికారినిగా నంగీకరించి వారును వారిమంత్రులును నేకీభవించి నడపుయత్నములవలన జపాను లోలోపలికలహములును భేదభావములును బోఁగొట్టి దేశక్షేమముచేయవలయునని తలంపఁబడినది. 1868 సం॥ న నావిధముననే యీపెద్దయభిమానముగలవారుచేసి ముగించినారు.



ఇండియాలో నిట్లు పరదేశస్థులు ప్రవేశించి దేశమును భిన్నాభిన్నములు గావించి తమయధికారమును స్థాపింపయత్నించిన కాలములో, మనచిన్నరాజులును బ్రభువులును జపానువారివలె నందఱునుగూడి దేశస్వాధీనమును గాపాడఁ బ్రయత్నము చేసినవారుకారు. ఇండియాలో దేశాభిమానులు కనఁబడినదే లేదు. మహావిస్తీర్ణముగల దేశమగుటచేతను జనులు వేర్వేఱుమతములు భాషలుగలవారగుటచేతను జాతివ్యత్యాసములవలనను విభాగింపఁబడి యున్నందునను జపానువారిమోస్తరుగా మనవారుచేయుట యసాధ్యమయినది. 18 వ శతాబ్దారంభమున నాంగ్లేయులును ఫ్రెంచివారును జోరఁబడి పోటీచేసి యిండియాను గట్టిపుచ్చుకొనఁ జూచునపుడు మనదేశజనులేస్థితిలో నున్నారో యాస్థితిలో జపానుదేశస్థులుగూడ నున్నట్లయిన జపానుగూడఁ బరదేశములవారి కాహారమయియుండును. అట్లుగాక జపానువారొక్కటిగాఁ గూడి ముందుకు రాఁదగిన క్రొత్తయేర్పాటుల నవలంబింపఁ దగిన స్థితిలో నుండిరి. ఎట్లనఁగా:— చాలకాలమునుండి జపాన్‌తో సంబంధించిన భాగాణముల నేలుచున్నచ్చిన చిన్నరాజులు తమ దుష్ప్రవర్తనలవలనను బుద్ధిహీనతచేతను దుర్బలులై యెట్లు చక్రవర్తి షోగూను చేతిలోఁ జిక్కెనో యట్లే తమ్ము నమ్మిపట్టియున్న యుద్యోగస్థులచేతులలోఁ జిక్కిపోయిరి. వీరియందు గౌరవము చెడి వీరివలన దేశక్షేమమింతయును గలుగదని జనులు నమ్మియుండిరి. కాఁబట్టి వీరిని లక్ష్యపెట్టక జనులలో నాయకత్వమును వహించినవారు తమయిష్టమువచ్చినట్లు చేయుటకు సాధ్యమయినది. ఈ చిన్నరాజులు మనదేశములోని జమీందారులవలెనే యప్పులలో మునుఁగఁగా నప్పిచ్చినవారు తమకేయందఱును బలుకుబడిగలవారినిగాఁ జేసికొని యాయాదేశమును దమస్వాధీనములోనికేరప్పించుకొనుచుండిరి, దేశములోఁ గ్రొత్తయేర్పాటులు బయలుదేఱఁదీయవలయునని యెన్నిక పుట్టినపుడు దానిని నిర్వహింప నీచిన్నరాజులదేశములను స్వాధీనముచేసికొన్నవారు సమర్థులైరేగాని చిన్నరాజు లేమియు నడపఁజాలరైరి. ఏపనిచేయుటకును వారికి శక్తిలేకయుండిరి. మనదేశములోఁ బూర్వమువలె జపానులోను వర్తకము చేతిపని కారుఖానాలు మొదలయిన పనులుచేయు జాతివారు గొప్పవారు లేకపోయినను జిన్నరాజులు చిదికి గణ్యతచెడిపోయిన వారగుటచే వారిధనము వీరిపెట్టెలలోఁ బెరిఁగినందున సంఘక్షేమమున కుపయోగించినది. ఈలోకములో ధనముగలవారే గొప్పవారగుటచేఁ దేలికగాఁ జూడఁబడుచున్న వర్తకులు మొదలయినవారు ధనముచే గౌరవమును బొందిరి. ధనమునందును అంతస్తునందును గొప్పవారుకాఁగానే విద్యయందును బుద్ధియందును గొప్పవారయిరి. ఇంతియ కాక

వారియొద్దనున్న సామాన్యజనులు కూడఁ బూర్వపుఁ దెలివితక్కువపోయి బుద్ధిశాలుర యిరి. ఆసమయమున జపానులో జనులలోఁ జాలామంది తమదేశవర్తమానములను గణించి తెలిసికొనుటయును దేశముయొక్క లాభనష్టములను గనిపెట్టి వానిం బేరుగుచ్చి చెప్పుటయును సామర్థ్యముకలవారయిరి. తమదేశస్థితి రానురాను తగ్గుచువచ్చుచున్నదని తెలిసికొని యట్లు వచ్చుటఁ బోఁగొట్టి మంచిస్థితిలోనికి వచ్చువిధము తెలిసికొనలేనివారయిన జనుల మనస్సులలో సందేహమును గలుగుచు వచ్చినది. ఈస్థితిలో నైరోపావారు వచ్చిరి. రాఁగానే యెండినకట్టెపై నిప్పుపెట్టినట్లు జనులయొక్క దేశాభిమానము వలనఁ గలిగి చెడిపోయిన పెద్దయాస బైటఁబడి యగ్నివలెఁ బ్రబల దేశమంతయును బ్రబలమైన త్రొక్కుపాటు కలిగి యైరోపావారిని జంపుటయును షోగూనుం ద్రోయించుటయును షోగూను పక్షమువారి నాదరించిన వారిని దొలఁగించుటయును చక్రవర్తిని విశేషగౌరవము చేయుటయునుగాఁ బరిణమించెను. జపాను ఇండియాకంటె విస్తీర్ణములోఁ దక్కువదై జనసంఖ్యయందును మితముగా నున్నదైనను స్వతంత్రరాజ్యాధికారము గలిగియున్నను అభిమానులు కోరినఫలము యుక్తకాలములో దొరకెను. జపానువారికిఁ గలిగియున్న యనుకూలములు మనకేర్పడియుండినఁ గదా వారిస్థితివంటిస్థితి మనకును వచ్చుటకుఁ జింతింపఁదగును! జపానువారు ఇప్పుడింగ్లాండు, రుషియా, జర్మనీ మొదలయిన యితరరాజ్యములవలన గౌరవింపఁబడుచున్నట్టి పయిదేశములవారితో సమానమగు నూహలు ధైర్యము సాహసముగలవారని తలంపఁబడి గొప్పపేరును బొందుటకు ముప్పదియైదుసంవత్సరములలో సాధ్యము యినటుల మఱియెవ్వరికిఁ గాని సాధ్యమైయున్నట్టు మనకేచరిత్రములలోఁ గాని యుండునని తోఁచదు.



## పదియవప్రకరణము.

జపానులోఁ జక్రవర్తియొక్కపదవి మహోన్నతమయినది. జపానువారిమతపద్ధతులలో రాజవిశ్వాసము ముఖ్యమయినదిగా భావింపఁబడుటయే గాక ప్రతిపాఠశాలలోను విద్యార్థులకు నియమింపఁబడినవానిలోఁ జక్రవర్తి చక్రవర్తినులపటములకు నమస్కరించుట యొక్కటిగాఁ నేర్పాటుచేయఁబడియున్నది. అదిమొదలు జపానువారు చక్రవర్తిని దైవమువలె భావించుచు భక్తియువిశ్వాసము గలిగి నమస్కరించుచున్నారు. దేశములోఁ బ్రచురమయియున్నచట్టములలోఁ జాలభాగము చక్రవర్తియాజ్ఞలను మిగుల గౌరవముగాఁ జూడఁజెప్పియుండెను. చక్రవర్తియును వానికోటలోని యుద్యోగస్థులును దక్కినజనులతోఁ గలసియుండకుండ నుండుటయే దీనికి ముఖ్యకారణమని తలఁపఁబడుచున్నది. రెండుసంవత్సరములకు మున్ను భూములపన్ను తెమ్చుచేయవలయునని సభలో నొకమసోదా తీసికొనిరాఁగా చాలామంది నైమసోదానంగీకరింపకుండ భేదముగామాట్లాడి చక్రవర్తి యామసోదా నంగీకరింపఁబోయెదరని యెదురుచూచుచున్నట్లు సమాచారము తెలిసిన వెంటనే యధికారులందఱును గూడి దానినొక్కచట్టముగాఁ జేసెదరని చెప్పినచోఁ జక్రవర్తియందు జనులం గలిగియున్న యభిమానముంగూర్చి వేఱుగాఁ జెప్పవలయునా? చట్టనిర్మాణసభయును దక్కిన మఱి యనేకములగు నేర్పాటులును నితరదేశములలోవలెనే జపానులోనుఁ గూడ 1888 సం॥న నేర్పాటుచేయఁబడిన పిమ్మటయును జక్రవర్తి యభిప్రాయమే దొరతనమును నిర్వహించు నన్నిసభలయొక్క తీర్మానమునకును పైదని తలఁచుట న్యాయవిరోధమని తోఁపఁగూడినదయినను నధికారముచేయుచున్న చక్రవర్తి గుణవంతుఁడై యుండినచో దానివలన నేమిహానికలుగును? ఇప్పుడు చక్రవర్తియెడల జనులకుఁ గల ప్రేమయే దేశవృద్ధికాధారముగా నున్నదని చెప్పఁబడుచున్నది. చక్రవర్తికి విరోధముగా నెప్పుడు నెవ్వరును బలుకుటయే లేదు. జనులువారియందు భక్తియును విశ్వాసమును గలిగియున్నారు. నాలుకతడఁబడుట శరీరము గజగజవడఁకుట మొదలయినవి లేకుండ వారింగలసికొని మాటలాడఁ గలిగినవారు ముగ్గురు లేక నలుగురుమాత్రమే జపానువారిలోఁ గలరు. ప్రతిసంవత్సరము నవంబరునెల మూఁడవ తేదీని జక్రవర్తిచేయు తోఁటకచ్చేరీసభలోఁ జేరు మనుష్యులు చక్రవర్తి సింహాసనము పెట్టఁబడియున్న చోటిమట్టి తీసికొనిపోయి యింటఁ బెట్టుకొని జనులకేరోగమువచ్చినను మంచిమందుగా నిచ్చుచున్నారఁట. అంతియే కాక యీతోఁటకచ్చేరిలోఁ జక్రవర్తి యిచ్చినఫలహారములు పుచ్చుకొనిపోయి తమతమ యిండ్లలోఁ

పూజచేసికొనుచోటఁ బెట్టి ప్రసాదమువలె భుజించుచున్నారఁట. చక్రవర్తి మాటి మాటికి బైటికి షికారు రాకపోయినను అప్పుడప్పుడు బైట రావలసివచ్చి నపుడు చక్రవర్తి యొక్క తోడిషికారు చేయ నేర్పడిన యుద్యోగస్థులిద్దఱిలో నొకఁడుమాత్రమే యెదురుగాఁ బండిలో లేక సవారిలో గూర్చుండ వచ్చునని యున్నను వారు చక్రవర్తిని కన్నెత్తిచూడకుండఁ దలవాంచికొని యుందురఁట.

చక్రవర్తియందున్న భక్తివిశ్వాసములె చక్రవర్తిని గారియందును గలిగి జనులు మసలుచుందురు. అయినను నామె మునుముందుఁ బోవు చక్రవర్తికిఁ దల్లి కావున [illegible]ము కలదని యెక్కుడు కొనియాడెదరు. చిత్రలేఖనము సంగీతము మొదలగునవి నేర్పు విద్యాశాలలోనికిఁ దఱుచుగా వచ్చుచుఁ బోవుచుండుట కలదు. జపాన్ దేశపు చక్రవర్తి కుమారుఁడు కొన్ని సంవత్సరముల నుండి జబ్బుగా నుండి యిప్పుడు వృద్ధశరీరుఁ డైనందున జనుల కందఱకును సంతోషముగాఁ గొంత పారితోషిక మీయఁబడియెను. ఈ చిన్న రాజకుమారుఁడు కలిగిన మాసములోనే దేశాచార ప్రకారము కోటలోని యుద్యోగస్థుఁ డొకఁడీ చిన్నపిల్లవాని తాతగారి యొద్దకుఁ జూపింపఁ దీసికొని పోవుచు ముందిబిడ్డఁడు పరిపాలనము చేయునుగావున తనశ్వాసము వలన చెడలినగాలి యాతనికిఁ దగులఁగూడదని తనబట్టతో ముక్కునోరు మూసికొనియెనఁట.

దేశమునందున్న సేనకంతకును జక్రవర్తియే పైయధికారిగా నుండును. కాని తమక్రిందఁ గొందఱు సేనానాయకుల నేర్పఱచి వేఱు వేఱుగా నియామకము చేసి స్వతంత్రముగా నందఱిని తనిఖీచేయుచుఁ జక్రవర్తియుండును.

దొరతనమువారి యధికారబలమును జక్రవర్తిగారి యధికారబలమును నిట్టిదని యందఱికిఁ దెలిసియున్నప్పటికిని దొరతనమువారు చాలసంవత్సరములనుండి శ్రమపడి చేయుచునెఱవేర్చుచున్న యేర్పాటులు తమయొక్క రిమాటమీఁదనే పూర్తిగా కూర్పఁ జెందునంతటి పలుకుఁబడి గలిగి స్వతంత్రత్వము నూహలును గల రాజ్యతంత్రిజ్ఞులలోఁ బెద్దవారియొద్ద మరచి గౌరవముగల చక్రవర్తి యొక్క యభిమానమే కాని నిపుణులయిన తక్కువవారిమాటయందు గౌరవము లేదు. ఈ నడుమ రాజ్యతంత్రములలో నిపుణులగువారిలో నొకఁడగు మిస్టర్ హొషీ చనిపోఁగా ననేకపర్యాయములు జపానుదేశమునకు మంత్రిగానుండి యితరదేశములన్నిటిలోను గౌరవము పొందియున్న మార్క్విస్ ఐటో యను నాయన చనిపోయిన హొషీగారియింటికిఁ బరామర్శకుఁజని యాబట్టలతోనే రాజసమ్ముఖమునకు వచ్చినారఁట. అట్లు వచ్చుట చక్రవర్తియెడల నపచారము చేసినట్లు తలఁచి వాని నేలపాడిచి చంపఁ గూడదని బహుపత్రికలు జను



ల నిందించెనని చెప్పినచో రాజసముఖమునే జను లెట్లు తలంచు నదియును జక్రవర్తి క్షేమమునందు జనులకుండు నూహయును మనకుఁ దెలియవచ్చుననే యున్నదిగదా! ఇట్టితలంపులు గల తగినబోధనలు పాఠశాలలలో సెలవుదినములలో బాలురకుఁ జెప్పుటవలన వారు మంచినడతలను వినయమును నేర్చుకొందురని చెప్పఁబడుచున్నది. ఈ ప్రసంగములోఁ జిన్నపిల్లవాండ్రు విద్య నేర్చుకొని తేటి మంచినడతల నలవాటుచేసికొని రాజభక్తి యన్యోన్యస్నేహము మొదలయిన సద్గుణములఁ బొంది పెద్దవారయి దేశమునకుఁ దగిన మంచి మంచి యుపకారములను జేయుటయే కాక జనులను గూడ మంచిస్థితిలోనికిఁ దెచ్చెదరని వేఱె చెప్పనక్కఱలేదుగదా.

"వేయుసంవత్సరములు రాజు జీవింపవలయును" అను నర్థమిచ్చు బాన్‌జై (Banzai) యనుమాటను జనులు చక్రవర్తిదర్శనమునకుఁ బోవునపుడును బడిమంది యొక్కచోఁ గూటముగాఁ గూడుకపుడును పెద్దధ్వనితోఁ బలుకుచున్నారు. ఒక వేయుసంవత్సరములలో రాఁగూడిన పెక్కుమంచిదశలన్నియుఁ గడచిన పదునైదేండ్లలోఁ బొందిన యాజనులు పలికిన వేయుసంవత్సరములు రాజు జీవింపవలయు ననువాక్యమును సంతోషముతో సార్థకము నే చేయఁగలరు.

# పదునొకండవ ప్రకరణము.

జపాన్ దేశచక్రవర్తులు హిందువులు పూర్వకాలసూర్యవంశరాజులనువలె దైవాంశకలవారని జనులు నమ్మియున్నట్లింతకుముందే చెప్పియుంటిమి. ఈచక్రవర్తివంశము మొదటఁ గ్రీస్తుపుట్టుటకు మునుపు 660 సంవత్సరములకుఁ బూర్వమున అనఁగా 2563 సంవత్సరముల క్రిందట స్థాపింపఁబడి యట్లు స్థాపించినవారు మొదలిప్పుడు మహాయశస్సుతో జపాన్ దేశమును బాలించుచున్న చక్రవర్తివఱకు 123 రు చక్రవర్తులు వరుసగా నడుమ నేమియు భేదములేకుండఁ బాలించుచు వచ్చుచున్నారు. ఇట్లు సుమారు 2600 సంవత్సరములకాలము నొక్కవంశపరంపరలోనివారే నిరాటంకముగా నేదేశమునుగాని బాలించినట్లు తెలియదు. ఈవిషయములో జపాను ప్రపంచములోని యేదేశముకంటెను గూడ భాగ్యవంతమయినదనియే చెప్పఁదగియున్నది. దీనికిని ఇండియాకును నెంతభేదమున్నదనునది చరిత్రము చదివినవారికిఁ జెప్పనక్కఱలేదు.

ఈముఖ్యవిషయములో మనకును జపాను వారికిని సంభవించినభేదములవలననే మనచరిత్రమునకు వారిచరిత్రమునకును గలతారతమ్యమును గ్రహింపవచ్చును. ఇండియాలో నొక్కటే మధ్యస్థానములో నొక్కరాజవంశమువారే దేశమంతయును దనయాజ్ఞలోనుంచుకొని నడమనడుమఁ గలహములు భేదములు మొదలయినయాపత్తులవలన రాజ్యములు పోకుండఁ బాలింపకుండ మాటిమాటికి రాజులవంశములు మాఱి వేఱువేఱు వంశములవారు పాలించుచు వచ్చుచున్నందున రాజులకును బ్రజలకును నైకమత్యము కలుగకుండ రెండుపక్షములవారికిని దేశస్వాధీనమునందును క్షేమమునందును దలంపు పుట్టకుండనే పోయినది. జపానులోనో యనాదిగా నొక్కకులములోనే జన్మించిన ప్రభువులు జనులవలన దైవాంశము గలవారని తలంపఁబడుచు వచ్చుచున్నందునఁ బ్రభువును దేశమును నొక్కటియే యనుతలంపు జనుల మనంబులలో నాటుకొని రాజునకుఁ గాని దేశమునకుఁగాని సంభవించు నాపదలును నిందలును దాముగొల్చు దైవమునకే వచ్చినట్లుగా నే తలంచుచురాఁగా దేశాభిమానమను మహోన్నతమైనగుణము జపానువారి జన్మములోఁగూడనే పుట్టుచున్నది.

జపాను చక్రవర్తుల పూర్వకాలచరిత్రము హిందువుల పూర్వకాల చరిత్రమువలెనే స్పష్టముగా నుండక కట్టు కథలలోఁ బడియున్నది. వెనుకటి యొకప్రకరణములోఁ జెప్పియున్నట్లు చక్రవర్తిఁ జుట్టి యుండిన సామర్థ్యశాలురు వారి యధికారము నూడలాగుకొని తామే నడుపుచువచ్చినట్టు తెలియ వచ్చుచున్నది. వారే



వెనుక షోగూను అను నధికారమును బొందినవారు. మ్లేచ్ఛుల నడఁచివేయు యుద్ధవీరులనఁబడు నాషోగూను పట్టమును బొందినవారే 1868 సం॥ వఱకు నిజముగా జపానును బాలించుచు వచ్చిన నాయకులై యుండిరి. ఇట్లు రమారమి 800 యేండ్లు జపానును బాలించుచు వచ్చినందున వారి కాలములో జపానుకు సంభవించిన మేలుకీళ్లను సంగ్రహముగా మరలఁ జెప్పుట మంచిదని యెంచి యీప్రకరణములో నట్లే చెప్పుచున్నాము.

చక్రవర్తిని గణింపకుండ షోగూను అధికారులు తమయధికారమును చెల్లించుచు వచ్చినను దాని నిరాటంకముగాఁ జెల్లుబడిలోనికిఁ దెచ్చుభాగ్యము లేకపోయినది. వారికి విరోధముగా నప్పుడప్పుడు బలవంతులు బైలుదేఱఁగా దేశమునందు మాటిమాటికి నాయకులతో నాయకులకుఁ బోరుపొసఁగి సంఘమునకొకరిపైనొకరికిఁ గ్రోధములు కలిగినవి. బౌద్ధమతపరిపాలకులైన షోగూనుకు అమాత్యపీఠాధికారియొక్క యాదరువులేకుండ నోపునాగా యనునతఁడు కలహముచేసి షోగూను అధికారమును బట్టుకొని క్రీస్తుపాదిరీలు ప్రవేశించి ప్రబలముచేసిన క్రైస్తవమతము నాదరించెను. వానికిఁ దరువాత షోగూను ప్రభుత్వమునకువచ్చిన హిదెయోషి క్రీస్తువారి నాదరించిన యెడలఁ దనయధికారము బలపడునను నూహనుమాని వారిని బహువిధములహింసచేసి మూలచ్ఛేదముచేసెను. హిదెయోషీకిఁ దరువాత నధికారమునకు వచ్చిన టోకుగావా అయియేసున్న వాని సంతతివారె తరువాత షోగూను అనునధికారము నిలిచిపోవువఱకు 250 యేండ్లు చక్రవర్తికి బదులుగా దేశపాలకులయిరి.

అయయేసును వాని మనుమఁడును మిక్కిలిబుద్ధిశాలురగుట వలన దేశమందిక్కడనక్కడఁ బెక్కుతావులలో స్థాపింపఁబడి యున్న చిన్నచిన్నరాజుల బలమును దొలఁగించిగాని లేక తగినట్లు లొంగదీసికొనిగాని యుండకున్నఁ దమవంశమువారికి రాఁబోవుకాలములో హానికలుగు నని చింతింపఁ జొచ్చిరి. కియోటోలో నివసించియున్న చక్రవర్తిని దాము వశముచేసికొని వారు తమవంశమువారికి విరోధులయిన చిన్నరాజుల వశముకాకుండఁ గాపాడి యేకాధిపత్యనిర్వాహకమునంతయును దామే నాయకులయి చెల్లించుచురావలయుననియును నిశ్చయించిరి. ఆనిశ్చయమునకుఁ దగినట్లు జపానునకును మఱియితరములయిన యేదేశమునకును రాకపోకలుచేయఁగూడదని నిలుపుచేసి జపానులో నితరదేశములవారు నివసింపఁ దగదనియును జపానుదేశస్థుఁ డెవఁడైనను మఱియొక దేశము వెళ్ళినచో వానికి మరణదండన చేయఁబడుననియును విధించి క్రీస్తుమతమును బొత్తిగాలేకుండఁ జేసి బౌద్ధమతము నాదరించి షోగూనువంశ

వారి స్వాతంత్ర్యమున కెప్పటికిని హానికలుగకుండునట్లు యత్నము చేసిరి. అయియేసు టోకియో నగరమును దమకు ముఖ్యస్థానముగా నియమించుకొని రాజులయిన గొప్ప కుటుంబములలోనివారు తమ రాజధానిలో నొకసంవత్సరము విడిచి యొకసంవత్సరము గడపవలయుననియును, నట్లుండిన సంవత్సరములలో వారివారి మంచినడతలను బరీక్షించుటకుఁగా వారి భార్యాపుత్రాదులనిక్కడనే దీసికొనిరావలదనియును గట్టడిచేసి యున్నందున నీగొప్పకుటుంబములలోనివారు టోకియోలోఁ దమకు నివసించుటకుఁ దగిన గృహములు కట్టియును మఱియు ననేకవిధములఁ దమధనమక్కడ వ్యయపఱచుటచేతను టోకియోనగరము చక్రవర్తియొక్క వాసస్థానమయిన కియోటోను మీఱి యైశ్వర్యమునఁ దులదూఁగుచుండెను.

అయినను, షోకూను చక్రవర్తికి రెండవతరమువాఁడు., చక్రవర్తి పేరుననే షోకూను అధికారమును జెల్లింపవలయు ననుకల్పన నిలువలేదు. చక్రవర్తియే సకలాధికారమునకును చట్టదిట్టములకును గౌరవమునకుఁ బ్రభుత్వమునకు మూలభూతుఁడని యనాదిగానున్న వాడుకయును బోలేదు. దేశమునకు షోకూను పాలకుఁడైనను జక్రవర్తియొక్క దైవాంశమున కేహానియును రాలేదు. అతఁడే న్యాయమయిన చక్రవర్తి. ఆయనయధికారమున కెదురులేదు. చక్రవర్తిని బరివేష్టించియున్న రాజవంశములోని పురుషులు చక్రవర్తియంత బలముగలవారు కాకపోయినను జక్రవర్తివంశమునకు వీరివంశమునకును దగ్గఱసంబంధముగలవనియు వారిగౌరవమునకు సౌఖ్యమునకును జక్రవర్తియే యాధారమనియును చిన్నచిన్న రాజులందఱికంటె నీరాజబంధువులనే గొప్పవారినిగా జనులు నమ్మియుండిరి.

జపాను దేశము ప్రభుత్వబలమున నగ్రగణ్యమై గౌరవమును బొందుటకు దేశములోని స్వాధీనాధికారమును బొందిన బలాఢ్యులయిన రాజులు ముఖ్యమయిన యాటంకముగా నుండిరని క్రిందఁ జెప్పఁబోవు దానివలననే స్పష్టపడఁగలదు. ఈచిన్నరాజులలో 260 మంది ప్రసిద్ధులు. మొదట నపుడపుడు యుద్ధములు జరిగి క్రొత్తదేశము లీచిన్నరాజులు పంచుకొనఁగా నట్లు పాలు పంచుకొనిన వారు చక్రవర్తికిఁ గావలసి నపుడు సైన్యబలసహాయము చేయుట విధియని యేర్పడి యున్నదని యిది వఱకుఁ జెప్పియుంటిమి. ఇట్లు షోకూనొక్కఁడు మాత్రము ఏకాధిపత్యములో మూఁడింట నొక్కభాగమును దమ స్వంతసొత్తుగాఁ జేర్చి నిర్వహించుచున్నాఁడు. మిగిలిన భాగములు పుచ్చుకొనిన చిన్నరాజులు తమకు స్వాధీనులైన వారినిగా నితరులను పెద్ద పెద్ద జమీను లిచ్చి నిల్పికొనిరి. ఇవ్విధమున రకరకములుగా నమరియుండిన నాయకులు గొప్ప సేనలను బెట్టుకొని రక్షింపవలసిన వారయిరి. పైనఁజెప్పిన 260 నా



యకులలోఁ బ్రతివారును స్వాధీనాధికారము గలిగిన వారేకాకుండ వారియొద్దఁగల సామురాయలను క్షాత్రవంతముగలవారు తమ్మురక్షించు నాయకులకే లోఁబడినవారై వారినిమిత్తము వారేసమయమందును దమప్రాణములను విడుచుటకును యుద్ధములోఁ జచ్చుటకును వెనుకదీయని వారుగా నున్నందున నానాయకుల బలము సులువుగా నడ్డగింపఁ దగినదిగానుండలేదు. ఈసామురాయలను వీరులు జపాను చరిత్రములోఁ గావించిన గొప్పకార్యములను గుఱించి చెప్పియుంటిమి. ఇపుడు జపానుకు మంచిపేరు వచ్చునట్లు చేసిన ప్రసిద్ధులయిన తాంత్రికులీ వంశములోఁ జేరినవారే.

టోకుగావావంశమువారు 250 సంవత్సరములు షోకూనుప్రభుత్వము చేసినపుడు జపాను మంచినడత యమరికయును గలిగియుండెను. వారిధనమునకు మితములేకుండెను. వారిసైన్యమో యట్టిదిమఱియే చిన్నరాజుల యొద్దను గానఁబడలేదు. ఆ చిన్నరాజులలో మిక్కిలి బలమును ద్రవ్యమును గలవారు షోకూనువంశముతో సంబంధము చేసినవారైయుండిరి. అందుచేత షోకూనునధికారమా దేశమున నేసందుగొందులలోను గూడ నిరాటంకముగాఁ జెల్లుచువచ్చెను. జనులలో సామాన్యులుఁ దక్కువజాతివారును సుఖముగానే వాసముచేసిరి. చక్రవర్తియొకరు తమదేశములో నెల్లవారిచేతను మూలదైవమునలెఁ బూజింపఁబడి సకలమైనవారికిని మేలుఁగోరియున్నారని జనులందఱి మనస్సులలోఁ బరిపూర్ణజ్ఞానము కలిగియున్నప్పటికిని ననుభవములో షోకూనే వారి మొదటిదైవముగాఁ దలఁపఁబడుచువచ్చెను. ఇట్లు తలఁపఁబడిన షోకూనులకాలమొక్కసారిగా నెట్లుమూడినదో యిదివఱకే చెప్పియుంటిమి. ఇంతయైశ్వర్యముతో షోకూనులు రాజ్యము చేయుచువచ్చినను, వారు, నిజముగా, నట్లునడపు బాధ్యతను దురాగ్రహముచేతఁ గట్టిపుచ్చుకొన్నారను తలంపు జనులహృదయములలో నుండి వదలిపోలేదు.

అయియేసు మనుమని కాలములో జప్పానులో నన్నివైపులనుండియును విద్వాంసులు శాస్త్రజ్ఞులును షోకూనుప్రభుత్వదేశమునకు వచ్చి నివసించుచుండిరి. వారివలన జపాన్ చరిత్రమొకటి వ్రాయఁబడి దానిలోఁ జక్రవర్తియొక్కఁడే నిజమైనప్రభువనియు, షోకూను తనసైన్యబలమువలన నక్రమముగా నధికారమును గైకొనియుండెనను నితర చిన్నరాజులవంటివాఁడే కాని యెక్కువవాఁడు కాఁడనియు జెప్పఁబడియెను. ఈగ్రంథ మప్పుడచ్చుపడకపోయినను బుద్ధిమంతులు వ్రాఁతప్రతులుగా సంపాదించుకొని యాసక్తితోఁ జదువుచువచ్చిరనియే చెప్పవలయును. అల్లే పందొమ్మిదవ శతాబ్దారంభమున షోకూనుప్రభుత్వమునకు న్యాయమైన యేయాధారమును లేదని తెలియఁబఱచు

చు నింకొక గ్రంథము బైలు దేఱినది. ఈరెండుపుస్తకములను బలువురు బుద్ధిమంతులు చదివియుండుటచేఁ జక్రవర్తి యధికారమునకుఁ బోటీగా గౌరవముంబొందఁగోరిన షోకూనునధికారులపైనను మాగాణులయధికారులపైనను విరోధాభిప్రాయము సంఘములోఁ గలిగెను. ఇట్లువిద్వాంసులు జపానుదేశాధికారమునకు మూలాధారములను బరిశోధించిన కాలములో జపానుపూర్వమతమగు షీంటో మతము—(అనఁగా జపాను పుణ్యభూమిగా దేవతలవలన నిర్మాణింపఁబడినది. ఆదేవతులవంశములో నుద్భవించిన వారు చక్రవర్తియేయని బోధించుమతము)—కొంచెము కాలమణఁగియుండి మరలఁ దలయెత్త నారంభించెను.

ఇట్లు చరిత్రపరిశీలనము మతాభిమానమును రాజనీతితోఁ గలసి షోకూనున కాపవఁగావించెను. తమపైయనూయయును విరోధమును గనఁబఱచుచువచ్చిన చిన్నరాజులు షోకూను సైన్యబలమువలననైనా యడంచివేయవలెనని నిశ్చయించుకొని సమయమునకై కనిపెట్టుకొని యుండెను. అట్టికాలము 1854 సంవత్సరమున నన్యులు సముద్రపురేవులలోఁ గనఁబడి తమకా దేశములోఁ బ్రవేశింప స్వతంత్రమిమ్మని యడిగి యివ్వకపోయినచో షోకూనెదిరింపఁ దరముగానంత బలముంగొనివచ్చి మాతలంచిన కార్యమును నెఱవేర్చుకొందుమని భయపెట్టిరి. అన్యులబలమును తమబలముతో నివర్తించుశక్తి షోకూనుకు లేకపోయినందున వారడావిడిగాఁ బలికినదానికి సమ్మతించెను. అట్లు సమ్మతింపఁగనే దేశమంతయు గొల్లనిగోలయెత్తి జపాన్ పుణ్యభూమిలో మ్లేచ్ఛులగు నితరులు కాలువెట్టి దానిగౌరవము పోఁగొట్టఁ జూచుచున్నారని షోకూనుపై నందఱికినిష్టము కలిగినది. ఈమ్లేచ్ఛులను బైటికిఁ దఱిమి గొప్పదైశ్వర్యమును మరల రావించి చక్రవర్తినే యేకనాయకునిగా నిలుపవయునను నూహతో యుద్ధముచేయ నిశ్చయించుకొన్న కొందఱు బలవంతులొక్కకక్షియైబైలువెడలిరి. ప్రారంభించినయుద్ధము ముగియునప్పటి కాకక్షివారి యుద్దేశము నెఱవేఱుటయే కాక యాషోకూనుపదవియే చివరకుఁదీసివేయఁబడినది.

ఇట్లు తీసివేయఁబడినను జక్రవర్తి స్థితి యెప్పటివున్నట్టే యున్నపక్షమున జపానుకు సంభవించిన యాపదను దాఁటించుటకుఁ జక్రవర్తికిఁదగిన బలములు లేవని దేశాభిమానులాలోచించిరి. కాని షోకూనుకు విరోధముగా ధ్వజమెత్తినవారు తమస్వలాభమును జూచుకొనక దేశమునకులాభము కలుగుటకే చూచువారు కాఁబట్టి యాయాపదను తప్పించుటకు సులభమార్గమేదొరకినది. మాగాణులనాయకులన్యులకెద్ద పెద్దపోకడలకుఁ దగినట్లు జపానుదేశరాజ్య వ్యవహారమును స్థిరపఱచుట యవస్యమయినపని యని



యును ఆవిషయములోఁ దామెంత కష్టనష్టములు వచ్చినను సహించుటకు సిద్ధముగానున్నట్లును జక్రవర్తికి విన్నపము వ్రాసికొన్నదియు నింతకుఁ బూర్వము చెప్పియుంటిమి. ఈవిధమున మాగాణుల రాజులు దేశాభిమానముచేఁ గలిగిన బలమునే పునాదిగాఁగొని జపాను స్వాతంత్ర్యమును గౌరవమును నిలుపుటకు నడుమనడుమ వచ్చునాటంకములను దొలఁగించి నిలుపిరి. ఈయధికారులు దేశాభిమానులుగా మాత్రమే యుండక దేశమునకుఁగావలసిన ఫలములను బొందుటకు సందేహములేకుండ నూతనాచారములనుగూడ ననుసరించుటకును వెనుకదీయనివారై యుండిరి. హిందువులవలెఁ బూర్వాచారమే సదాచారమను వ్యర్థపునమ్మకమును బెట్టుకొని దేశముపాడగుట కొప్పుకొనరయిరి. దేశములో రాజబంధువులువంటి గొప్పవారును జాలాకాలమునుండి యనుభవించుచు వచ్చుచున్న సౌఖ్యములను బోఁగొట్టుకొనుటయేగాక తమస్వంతద్రవ్యమును సాచారములును జక్రవర్తివలనఁదమకువచ్చిన యంతస్తును గూడఁ గాలవ్యత్యాసముచే ధైర్యముతో మార్పుచేయుటకు స్థిరపడిరి. సముద్రముదాఁటి యితరదేశములకుఁబోయి యందుఁ దమదేశాభివృద్ధికిఁదగిన విద్[illegible]యును జ్ఞానమును అనుభవమును సంపాదించుటకు నతిసాహసముతో సిద్ధపడిరి. చాలాకాలమునుండి జపానురాజ్యాంగమువారు నడుపుచువచ్చిన చర్యలే యుత్తమమైనవని తెలివితక్కువచే నమ్మియుండక సందర్భభేదములను మనస్సుననుంచుకొని యన్య యత్నములుచేయనశ్రద్ధచేసినవారు కారు. అట్లై గొప్పవంశమువారు కొద్దివంశములోనివారు వీరి సంబంధాసంబంధముల లక్షణములను అలవాటునుబట్టి మారుపుచేసిరి. వర్తకము కారుఖానాలు మొదలైనవానిని అనాదియాచారముల నడుపుచువచ్చువారుకూడఁ గ్రొత్తమార్పు లవశ్యమని యట్లు తమజీవనోపాయములను మార్పుచేసికొనిరి. ఇవ్విధమున దేశములోఁ జక్రవర్తిమొదలు కూలివానివఱకును నందఱును దేశమువృద్ధినొందవలయునని యొక్కకట్టుగట్టి యితరలాభనష్టముల నించుకంతయు గణింపక యేకీభావమునొంది యుండిరి. అదిమొదలు జపానువారికి దేశాభిమానమే వేదమువలె వారినడతలకుఁ బ్రయత్నములకుఁ గార్యములకు శాస్త్రప్రమాణమై వచ్చుచున్నది. చరిత్రములలో దేశాభిమానావేశముగొన్న జనులు గణన తక్కువవారైనను బ్రక్కబలము చాలనివారైనను మతియేలోపము లున్నవారైనను వారు ప్రమాదకార్యములను జేసి ముగించుటకు సమర్థులని చెప్పుట కెన్నియైన దృష్టాంతములఁ జూపెదము.

ఈ జపాన్‌దేశాభిమానుల యభిప్రాయములో మనహిందూదేశము పడుచున్న తాపమును స్థితియు లేకపోలేదు. హిందువులవలెఁ దానును దమదేశస్థులును జాతివ్య

త్యాసములచే భేదపడి దేశక్షేమము చూడకుంటిమా యిండియావలెనే జపాను హీనస్థితికి వచ్చునని భయపడి యుండిరి. ఇండియాను అయిరోపాదేశమువారు పలువురు వశపఱచుకొనుటఁజూచి చిట్టచివరకు బ్రిటిష్‌వారు దానినిబాలించుచున్నట్లు జపానులోఁగూడ నదేయుద్దేశముతో వచ్చియున్న యితరులలో రుషియావారు తుదకొంటెపాటున జపానుప్రభుత్వము నపహరింపఁగలవారని భయపడిరి. అట్లొకవేళ రుష్యావారికి జపాను వశపడినపక్షమున రుషియావారు మితిలేని భుజబలపరాక్రమము తంత్రోపాయములు గలవారుగనుక జపానువారు పిమ్మట నెంతదేశాభిమానముంజూపి మరలసంపాదించుకొనఁబోయినను సిద్ధించుట సులభముకాదని చింతించి, మోసమురాకమునుపే మఱియే యోజనలును జేయక దేశస్వాతంత్ర్యమును భద్రపఱచికొనవలయునను నూహను ధైర్యముతో నిశ్చయముచేసిరి.

ప్రతిమనుష్యుని యాయుర్దాయమును కాలపరిమాణమునకు సరిపడియుండినను దేశజనసంఘముయొక్క యాయుర్దాయమట్లుండవలేదు. చక్రవర్తులు, రాజులు, పండితులు, పామరులు, గొప్పవంశస్థులు, హీనజాతివారు, ఎవరైనను దేశక్షేమమునకును నది హీనస్థితికి రాకుండఁ గాపాడుటకును దమధనము ప్రాణములు పోఁగొట్టుకొన్ననేమి? దేశముస్వాధీనముతో క్షేమముగానున్నచో నొకప్పుడుపోయినవానిని మఱియొకప్పుడు సంపాదించుకొనవచ్చునుగదా! ప్రాణమును రక్షించుకొనునిమిత్తముగా నొకయవయవమును గొట్టివేయుటయును గుటుంబరక్షణకై యాకుటుంబములో నొక్కని తొలఁగించుటయును, నొకగ్రామమును గాపాడుట కొక్కకుటుంబమును జెఱచుటయును న్యాయమనియును సమయవచ్చినపుడట్లు చేయక తప్పదనియును జెప్పఁబడుచున్నట్లే కోట్లకొలఁదిజనుల ప్రాణములు, ధనము, గొప్పదశ, అభివృద్ధిమొదలైన వానినభిలషించు సమూహము దానిఁబాలించు చక్రవర్తిని గాపాడి ముందురాఁబోవు నాపదలను దొలంగించు మహాప్రయత్నములో నెంతమందియైనను నెన్నికుటుంబములైనను భేదింపఁబడుట గౌరవమేగాని లోపముకాదు– అట్టితలంపులేనిజనులు క్షీణదశకువచ్చెదరు. కొన్నిసమయములలోఁ జలింపని మహాశూరులవలన నడపఁబడు పులులవలె దేశమును గాపాడఁదలంచువారును దమ గొప్పయత్నము సిద్ధింపకుండ నపజయమునొంది దేశభ్రష్టులై చెదరిపోయినారు. అట్లే దక్షిణఆఫ్రికా బోయరులకు సంభవించినది చూచియున్నాముగాని యట్టిశూరులు స్వాధీనమును బోఁగొట్టుకొని పరులపరిపాలనలో బలవంతముగాఁ గట్టుపడిపోవుటకంటె నెంతకీడుమూఁడినను దానిననుభవించుటయే మే



లని నిశ్చయించి తమకంటెఁబదిరెట్లెక్కుడుబలవంతులైన బ్రిటిషువారితో నెదిరించి నిలిచినది లోకములోవిని యాశ్చర్యపడనివారెవ్వరున్నారు? అయినను బోయర్లకు సంభవించినట్లు జపానువారికిరాకుండ వారు తగిన సమయములోఁ గన్నువిప్పిచూచి తమకుఁ దోఁచినయపాయములను దొలంగించుకొనుటకు బుద్ధిగలిగి ముందుజాగ్రతగలిగి జపాను ప్రపంచములోని స్వతంత్రదేశములలో నొక్కదానినిగా నిలిపిన యాదేశమువారి గొప్పతనముఁ గనఁబఱచుచున్నది గాని చీనా యిండియా మొదలయిన ఏషియాదేశముల ముందుకాలక్షేమమునకు, సూర్యోదయమునకుముందుఁ గనఁబడు నెఱ్ఱని యాకాశమువలెనే యైనదని చెప్పవచ్చును.



## పండ్రెండవ ప్రకరణము.

—:0:—

ప్రపంచములోని ప్రతిదేశమును దాని ప్రజలును వృద్ధిపొంది పలువిధ సౌఖ్యములను బొందుటకును నొక్కొక నాయకుఁడు కారణమయియుండునని మనమెఱుఁగనివారము కాము. వెనుకటి ప్రకరణములో నిపుడు దేశము బాగుపడియుండుటకుఁ జెప్పిన కారణములలో నాయకులంగూర్చి కొంచెము ముచ్చటించియుంటిమి. ఆనాయకులలో మార్క్విస్ హీరోఫూమీ అయిటో యనునాతఁడే మొదటివాఁడని చెప్పుటకు వారిబహువిధములయిన సత్కార్యములు సద్గుణములును జెప్పి పిమ్మట చిన్నచిన్న నాయకులను గుఱించియుఁ గొంచెముకొంచెముగా వ్రాసెదము. పశ్చిమదేశప్రభువులుఁ చాలమంది ముఖ్యముగా మార్క్విస్ హిరోఫూమీ అయిటో నొక్కనినే జపానుదేశనాయకునిగా నెఱుఁగుదురు. కొంతకాలమునకుముందువఱకును చీనావలె జపానుగూడ నొకదేశమేయనియును జపానువారు చీనావారిలోఁ గొన్ని వేఱుపాట్లు గలవారేగాని మిక్కిలి నాగరికతను గలవారు కారనియును దలంచియున్న పడమటిదేశములవారు మిగుల నాశ్చర్యపడునట్లు 1895-96 సంవత్సరములలో జపానునకును చీనాకును యుద్ధము పొసఁగి దానిలో జపానువారు కనఁబఱచిన పౌరుషము సైన్యబలము మొదలయినవానివలన దానికంతకును గారణభూతుఁడుగా నున్న అయిటోప్రభువు సామాన్యుఁడు కాఁడని లోకములో ఖ్యాతిగాంచెను. అదిమొదలెప్పుడును వానింగూర్చి పత్రికలలో బహువిధములఁ బొగడినదియును వారికిఁ దగినట్లు రాజ్యతంత్రము నడుపువారును బ్రజలును జూపుచున్న మర్యాదలును జేయుచున్న యుపచారములును జాలమంది వినియేయున్నారు. వీరివలెనే జపానులో మఱియును ఇనాయీ, ఓకుమా, యామకాటా, మట్సూకాటా, మొదలగు నతిబుద్ధిశాలురు పురాతననాగరికమే యాధారముగా జపానువృద్ధిపొందుటకుఁ దగినమార్గములను గనఁబఱచినవారై అయిటోప్రభువుపొందియున్న ఖ్యాతికి సంతోషించుటయేగాక వారిలో నొకరు 'అయిటోప్రభువలననే జపానుదేశమునకిప్పుడును రాఁబోవుకాలమునను గూడ క్షేమము నభివృద్ధియుఁ గలుగవలయు' నని పొగడి 'దేశములో దొరతనమువారికష్టము లేవివచ్చినను వానినివారింప అయిటోప్రభువే గాని మఱియొకరులే' రని స్థిరపఱచి చెప్పియున్నారనఁగా అయిటోప్రభుని శ్రేష్ఠత్వము వేఱుగాఁ జెప్పనవసరము లేదు గదా! అయిటోప్రభువు మంత్రిగానున్నను సరి మఱియొకరు మంత్రిగా నున్నను సరి జపానువారు అయిటోప్రభుని సలహా వెంబడినే సంచరించుచున్నారు. ఇంకొకరు మంత్రిగానుండి ప్రభుత్వముచేయుచున్నను అయిటో ప్రభుని పలుకుబడికి నాటంక మొక్కఁడును లేదు. ఇండియాలోను నితరదేశములలోను దేశక్షేమమును గూర్చి పాటుపడువారిని గొందఱు నేమియుఁ దగినకారణము లేకయే లోపము లెంచుచుండులాగున జపానులోని కొన్ని సామాన్యపత్రికలు అయిటోప్రభువు నొకప్పుడు దూఱుచుండినను దేశమునకేవిధమయినయపాయము రాఁబోవునపుడును జపానువారందఱును దమకయిటోప్రభువే యధిపతిగాఁ దలంచి యాయపాయమును బోఁద్రోచుకొనుచున్నారు. జపానుచక్రవర్తిగారయిటోప్రభునియెడల మిగుల గౌరవము గలవారే కాకుండ వారివలన దేశముపొందిన లాభములనుగూడ బాగుగ నెఱిఁగియున్నవారే. క్రిందటి ప్రకరణములో వ్రాసినప్రకారము జనులు దేవాంశాసంభూతుఁడని భావించి పూజించు చక్రవర్తియే యీయయిటోప్రభువును ఘనముచేసి యెప్పుడును జక్రవర్తివంశమువారే వహించుచువచ్చిన గౌరవపట్టము నొసంగిరని చెప్పినచో జనులు వారియందెప్పుడును గలిగియుండుమదింపు చెప్పక తెలియవచ్చుచున్నదిగదా!

ఫ్రాన్సుదేశము నున్నతస్థితికి దెచ్చిన నెపోలియన్ అను రణశూరుఁడేమి, జర్మనీదేశమును లోకులుకొనియాడునట్లుచేసిన ప్రవీణుఁడగు బిస్మార్కేమి తమదేశముల నున్నతపదవిలోనికిఁ దీసికొనివచ్చుటలో పెక్కులయిన యనుకూలము లంతకుమును పే యేర్పడియున్నను చాలకాలము పాటుపడి తమ యుద్దేశములను నెఱవేఱునట్లుచేసిరి. నవీనాధారములేమియు లేక పురాతనాచారములనే పట్టుకొని వ్రేలాడుచు తూర్పుమూలనున్న జపానుదేశమును సుమారు 30 సంవత్సరములలోపుననే తత్కాలనాగరికములన్నియు నవలంబించి పొందికపఱచిన అయిటోప్రభువునకు సమానులనుగాఁ బైనఁ జెప్పఁబడిన యిరువురు కీర్తిశాలురను జెప్పవలను గాదనియును పైదేశముల యేరాజ్యతంత్రనిపుణునింగూడ వీరితో సరిపోల్పఁ గూడదనియును గొందఱైరోపాపండితుల యభిప్రాయమయి యున్నది.

వీరు 1841 సం॥ జన్మించి సుమారు 22 సంవత్సరములవఱకును దమదేశములోనున్న సాధారణపాఠశాలలలోఁ జదివి 1863 సం॥న ఇనాయీప్రభువుతో నింగ్లండునకు విద్యనేర్చుకొనుటకై పోయి కొద్దికాలముండి తమదేశమునకు మరలినపుడు షిమోనేకీయను జపానుతో సంబంధించిన కోటను బరదేశరాజులు ముట్టడించి యుద్ధముచేయుచుండఁగా నాయన్యరాజమంత్రితోఁ గలసి మాటలాడవలసిన విషయములన్నియు నైటోప్రభువక్కాలమునఁ జిన్నవయసులోనున్నను జపానుప్రతినిధిగాఁ జక్రవర్తివలన నియమింపఁబడుటకుఁ గోరినారని చెప్పఁగా నింతచిన్నతనమున వీరిట్టి రాజ్యతంత్రాధికారమును గయికొనిరనిన దేకాలమునందైన నెవ్వరికిఁగాని యాశ్చర్యముపుట్టింపకమాన

ము. కలహాముతీఱి దేశముసమాధానముగానున్న వెంటనే యన్యదేశస్థుల గోష్ఠి యను రేవుసమీపమున నున్న హియాగో మాగాణమునకు గవర్నరుగా 1868 సంవత్సరమున 27 సంవత్సరముల వయసులో నైటో ప్రభువునియమింపఁబడిరనినచో వారిసామర్థ్య మునకు వివేకమునకును వేఱుదృష్టాంతముచూపవలసినదిలేదు. వారేగాక యితరరా జులమంత్రులతోఁ గలసి మాటలాడి కార్యసాఫల్యముచేయ సామర్థ్యముకలవారు జ పానులో మఱియొకరులేరని చక్రవర్తిగారు వారిని ముఖ్యముగా నియమించిరి. ఇప్ప దవిలో రెండుసంవత్సరములుండిన పిమ్మట 1870 సంII న, వీరిని దేశక్షేమమపేక్షించి చక్రవర్తికి సహాయమంత్రినిగా నియమించిరి. వెంటనే వీరు అమెరికాకు వెళ్ళి యొకసంవత్సరమక్కడనుండి రాజ్యపరిపాలనావిషయమయి నేర్చుకొనవలసినదంతయు నేర్చుకొని తిరిగివచ్చుటకుఁ గొన్నినాళ్ళుపట్టినందున నట్లు 1873 సంII న, తిరిగివచ్చి నపుడు మరమ్మతుయిలాకా మంత్రిగా సభలోనియమింపఁబడి పండ్రెండేండ్లు ఆపని లోనుండి మంచియనుభవముకలవారు గాఁగా 1885 సంII న, మొదటితడవఁదామే ము ఖ్యమంత్రిగానుండి మంత్రాలోచనసభ కూర్చిరి. వారుకూర్చినసభ మూఁడుసంవత్సర ములపిమ్మట మార్పుచెందినను దానికిబదులుగావచ్చిన మఱియొక మంత్రిసభలోనుకూడ వీ రులేకుండ వీలులేదని చక్రవర్తిగారే తలంచినందున వీరుకూడనుండి నిర్వహించిరి. ఇం తియేకాక వీరనేకవిషయములయిన యుద్యోగములుచేసి మరల 1892 సంవత్సరమున మొదటిమంత్రిగా సభలో నియమింపఁబడిరి. ఈసభ 1896 సంII వఱకును ప్రభుత్వ మునడపుచు వచ్చినకాలములోనే జపానుకును చీనాకును గలహముపొసఁగి యుద్ధముజ రిగినది. ఈయుద్ధసమయములో వీరు గనఁబఱచిన సామర్థ్యమునకు మెచ్చి వీరిని చ క్రవర్తి మార్క్వెస్ అను పట్టమునకర్హునిగావించెను. తిరుగ వీరే 1898 సంII నను 1900 సంవత్సరమునను మూఁడవ నాల్గవ తడవలను మంత్రిగా నియమింపఁబడి కొన్ని నెలలు దొరతనమును నడపుచువచ్చిరి. ఇట్లు వీరుజపానుదేశములో ననేకపర్యాయ ములు మొదటిమంత్రిగాను మఱికొన్నిసమయములలో ననేకములగు నితరయిలాకాప నులలో నియమింపఁబడుటయేగాక యితరదేశములకుఁ బోయి జపానుకుఁ గావలసి న కొన్నిసాధనములను సంపాదింపవలసివచ్చినపుడు కూడఁ జక్రవర్తివీరినే పంపుచు వచ్చుట యాచారముయియున్నది.

అట్లు పశ్చిమదేశములకు రాజ్యవ్యవహారములమీఁదఁ బంపఁబడిన సమయము లలో 1882 సంII న, నన్యదేశస్థాపనములును అనుభవములును శోధించి తెలిసికొని జ పానుదేశమున కేవిధమయిన యమరిక తగియుండునని నిశ్చయించి యా దేశపరిపాలనా



విషయములను నేర్చుకొనుటకుఁ బంపఁబడినసమయములోకంటె నధికమేమియు సం భవింపలేదు. అప్పుడు రుషియాచక్రవర్తియగు మూఁడవ అలెగ్జాండరుకుఁ గిరీట ధారణమహోత్సవము జరగఁగా నైటోప్రభువుగా రక్కడికి జపానుప్రతినిధిగా వెళ్ళి రి. జపానుకుఁ దిరిగి వచ్చి 1865 సంII కొరియావ్యవహారసంబంధమయి చీనాకు వెళ్ళిరి. కాలముచేసిన విక్టోరియా మహారాజ్ఞిగారికి 1887 సంII డైమండుజూబిలీ మహోత్సవ ము నడువఁగా నాసమయమునకు జపానుదేశప్రతినిధిగాఁ జక్రవర్తికుమారుని దీసికొని యింగ్లండునకు వెళ్ళిరి. అయిదు తడవలు అయిరోపాదేశములను జూచివచ్చెను.

ఈరీతిని మహాబుద్ధిమంతులయి యనేకదేశములుతిరిగిచూచి యచ్చటచ్చటఁ గాంచిన క్రొత్తవిషయములను నేర్చుకొని బుద్ధిచాతుర్యమును నాసక్తియుఁగలవారైన మ హాపురుషులేకదా తమజన్మస్థలముయొక్క ఘనకార్యములను వహించి గతిలేని మనుష్య సంఘమును బాలించుటకు సమర్థులగుదురు? ఇంతియకాక సముద్రముదాఁటినవా డు దైవకటాక్షమునకుఁ బాత్రుఁడుకాఁడని వెలివేయుబుద్ధిహీనులు వసించునిద్దేశము న మార్క్వెస్ అయిటోవంటిలోకోపకారులు గనఁబడుట యేకాలమునందు? బ్రిటిషు ప్రభుత్వము ఇండియాలో స్థిరపడినపిమ్మట నిండియావారన్యదేశములకుఁ బోయి స్వదేశ క్షేమమునువృద్ధిచేయుటకుఁదగిన మంచిసమయములు జపానుదేశమునకు లభించినట్టిండి యాకునులభించినవి. అయిననేమి? తనమేలుచూచుకొనని దేశాభిమానికిఁ గాని యా ట్టితరుణములుయత్నింపఁదగినవగును? సర్. టి. మాధవరావుగారు, సి రంగాచార్యులు గారు, సర్. టి. ముత్తుస్వామి అయ్యర్ గారు, మహాదేవగోవిందరానేడీగారు, స ర్. అమరావతిశేషయ్యశాస్త్రిగారు మొదలగు గొప్పవారు తగినసమయములలో నింగ్లాం డునకుఁబోవునట్లు రాజ్యాంగమువారివలననే యడుగఁబడియును జాతిచెడుననిభయ పడి తమదేశమునకు నెన్నడును జెడని మేలు చేయఁదగిన యాసమయములను బోఁగొట్టి రి. అయిటోగారివలె మనదేశమునఁగూడముందునిలిచి పాటుపడుగొప్పవారు కలుగు వఱకు నిండియాయొక్క క్షేమము స్థిరపడివృద్ధికాదు.

పైనఁజెప్పినట్లు మార్క్వెస్ అయిటో రాజ్యాంగ నిర్వాహకములోఁబొందినగొ ప్పయుద్యోగములవలనమాత్రమే వారియొక్క దేశాభిమానము బైటఁబడలేదు. ఏవిధ మునఁ దమదేశమునుగుఱించిపాటుపడవలయునో యారీతిగ విడువకుండఁ బాటుపడు చు వచ్చుచున్నవారయినందున జపానువారు మార్క్వెస్ అయిటోగారిని దేశాభిమాను లలో మహోన్నతపదవిలోనివారినిగా గణించుచున్నారు. జపానువారన్యదేశస్థుల యుద్దేశములను బాడుచేయుటకు వారి యుద్దేశములనే ప్రయోగింపవలయునని నై

ర్యముగలిగి యున్నపుడు మార్క్విసుఇటో వారికిఁదగిన సహాయుఁడుగా నిలిచి దేశాభివృద్ధికిఁదగిన మహాశ్రేష్ఠమయిన సహాయముచేసినారు. వీరి పలుకుబడివలననే జపానువారు పైదేశములవారి తలంపులను సమ్మతించిరి. అయినను జపాను అభిమానులు దేశక్షేమమే తమయన్నియత్నములకు మొత్తమున ఫలమనినదానిని మఱువలేదు. ఇట్లు జనులమనోభిప్రాయములను బన్నుబఱచి 1873 సంవత్సరమున జపానురాజాంగస్థాపనపద్ధతులను వ్రాసి మనస్సేప్రమాణముగాఁ జేయఁబడుచువచ్చిన పాలనపద్ధతులను జనప్రతినిధిపద్ధతులనుగా మిక్కిలి తేలికగా మార్చిరి. వేలకొలఁది సంవత్సరములనుండి రాజు తనహృదయమే సత్యముగఁ బాలించుచువచ్చిన జపానులో రాజుగారి యిష్టానిష్టములు, మనోభీష్టములు జనప్రతినిధులయొక్క యభిప్రాయానుసారముగాఁ ప్రభుత్వమును మార్చివేయుట మహాబుద్ధిమంతులవలనఁ గాఁగూడినదే కాని యితరులవలనఁగాదు. క్రొత్తయేర్పాటులను దప్పులేకుండవ్రాయుట కష్టముగాదు. ఎట్లు వానిని చెఱుపులేకుండ జనులఁదుష్టింపవచ్చునో యట్లు పొందుపఱచుట తెలివిగల రాజ్యకార్య నిర్వాహకులవలననే కావలయును. ఇండియాలోఁ జట్ట నిర్మాణసభలను జటాలునఁ బ్రతినిధిసభలనుగాఁద్రిప్పి మనమ్యునిసిపాలిటీలు మొదలయినసభలలోఁ బ్రధానులుగా నుండినవారినీ ప్రతినిధిసభలకుఁ బ్రధానులగాఁ జేసి రాజ్యవ్యవహారములలో నప్పుడెప్పుడు పుట్టుప్రశ్నలనుబట్టి యభిప్రాయమీయ స్వతంత్రమిచ్చినచో వారారంభముననే యెట్టితప్పులుచేయుదురో యనునది మనమూహించుకొనవచ్చునుగదా?. బుద్ధిలో మనవారివలె నున్న జపానువారు గొప్పచెఱుపుసంభవించుపనులు చేయకుండ మొత్తమున దేశక్షేమమునకుఁ దగినట్లుతమస్వాతంత్ర్యములను జెల్లించుచు వచ్చినది మార్క్విస్ అయిటో వంటి దేశాభిమానుల దీర్ఘాలోచనయును బట్టుదలయును సామర్థ్యమును గనఁబఱచుచున్నది.

దేశములో అయిరోపావారి సహవాసమువలన హిందువులపూర్వాచారములును ననుష్ఠానములును మాఱిపోయినవని పలువురు తలంచుచున్నట్లే జపానులోను గూడఁ దలఁచువారు పలువురుకలరు. అయిన మార్క్విస్ అయిటో వంటి బుద్ధిమంతులన్యులసహవాసమువలన మతము, ఆచారము, విద్య, వినయము, మొదలయినవానియం దేమిభేదములు కనఁబడినను వానిలోపలనుబయిటను బలపడి దేశముపయి నభిప్రాయము గలిగి స్థిరపడునని తలంపు గలిగియున్నారు. ఆరీతినే మొదట బౌద్ధమతము, కన్ఫ్యూషియానిజమను మతమును, విద్య మొదలయిన వితరదేశములనుండి జపానులోఁ బ్రవేశించినను గాలక్రమమున నవి జపానుసంబంధమయి నవాని స్వరూపమునే పొందినవి. క్రీస్తుమతబోధకు లన్నిచోటులలో వలెనే యక్కడను జేయుమతభేదయత్నములు ఫ



లింపనందున నక్కడనివసించువారియొద్ద మిక్కిలి భేదమునుగనఁబఱచుచు వచ్చిరి. మార్క్విస్ అయిటోయును నీమతాచార్యులు జపానువారి ననేకవిధముల నిందించుచు వచ్చినందున వారియందు మంచియభిప్రాయము లేనివారయియుండిరి. "ధర్మంచర, సత్యంవద" యని హిందువులు తెలిసికొనిన వేదవాక్యములను వలెనే మంచిపనులను జేయుటయును జెడ్డపనులనువిడుచుటయును జపానువారికి సమ్మతమనియునుమూఢభక్తినవలంబించిన క్రీస్తుమతము మొదలగునవి వారికనావశ్యకములనియును మార్క్విసు అయిటోవారు చెప్పుచుండు నలవాటు కలవారఁట.

అయిరోపాదేశములలోను, అమెరికాలోను, అయిటోప్రభువు వెళ్ళిన యితరరాజ్యము లన్నిటిలోను రాజులును జక్రవర్తులును మిక్కిలిశ్రేష్ఠతరముగా నుపచారములు చేసిరి. బ్రిటిష్మహారాజుగారయిన ఘనతవహించిన ఏడవయెడ్వర్డువారు తమనాసస్థానమునకీరాజ్యపాలనసమర్థుఁడగు అయిటోప్రభువును రావలసినదని కోరి రప్పించి గొప్పపట్టమునిచ్చి ఘనతచేసియున్నారు. జపానుదేశములో మార్క్విస్ అయిటో కంటె గొప్పవారులేరు. ఇక్కాలమున నట్టివారీప్రపంచములోనే లేరనిచెప్పవచ్చును.



మార్క్వెస్ అయిటోగారి మంచిగుణములును దేశాభిమానమును నెంతగొప్పస్థితి
లోనున్నను గేవలము నొక్కని ప్రయత్నమువలననే దేశాభివృద్ధిసిద్ధించుటకు సాధ్యము
కాదు కాఁబట్టి వీరితో మఱికొందఱు ఘనులు సహాయముగానుండి పాటుపడి తమ
జన్మభూమి కిప్పుడును ముందును క్షేమలాభాదులెల్లప్పుడు నిల్చియుండునట్లు చేయు
చున్నారు. అయిటోగారు దొరతనముతో సంబంధించిన వ్యవహారములలోఁ బ్రవే
శించి స్వయముగాఁ జూచుచుండ బేరన్‌షీపుసావా యను పెద్దయభిమాని రాజ్యవిష
యములలో సంబంధము కలుగఁజేసికొనక దేశములో ధనము పెరుఁగుటకు స్థిరమయి
న యాలోచనలు చేయుచువచ్చుచున్నారు. దొరతన మెంతశ్రేష్ఠముగా నున్నను నై
శ్వర్యము లేకపోయిన నభివృద్ధినొందక పడునుట విశదమేగదా! అట్టియైశ్వర్యవృద్ధి
లో నుండకుండుటం బట్టియే గదా మనయిండియా నాగరికరాజ్యాంగములు వృద్ధిలో
నుండినను ముందుకువచ్చుటకుఁ దగిన యనుకూలములులేక తత్తరించుచుంటిమి? ఐ
శ్వర్యమును వర్తకమును దేశసుభిక్షమునకు ముఖ్యమనునది మొదటినుండియుఁ దెలిసి
కొనినవారయి బేరన్‌షీపుసావా తాము వహించియున్న సహాయమంత్రిపదవిని విడిచి
పెట్టి వర్తకములోఁ బ్రవేశించిరి. జపానునకు ధనాభివృద్ధివిషయమయి సమీపము
లో రకరకములుగాఁ జేయఁబడుచువచ్చిన యనేకయత్నములలో వీరిసంబంధములేని
దొక్కటియు లేదు. వారికిప్పుడు 63 సంవత్సరముల వయసున్నను సుమారు 60 పె
ద్దకంపెనీలలో సభ్యులలో నొకరుగా నున్నదియే గాక తమజనుల సాహసమును గౌర
వమును బలపఱచుట కనుకూలమయిన సాహసకార్యములలోఁ బ్రతిదానియందును బ్రవే
శించియున్నారు. వారు తలంచుకొన్నయెడల మంత్రులలో నొకరుగాఁ జక్రవర్తివ
లన నియమింపఁబడుట సులభమే యయినను మంత్రాలోచనసభలోఁ జేరకుండ వేఱు
గా నుండుటవలన దేశమున కధికలాభము చేయుటకు వీలగునను నమ్మకముతో వ్యవ
హారము వృద్ధిచేయవలయునని యెప్పుడును బూనియున్న యీపూను వదలకుండ నుండి
రి. ఇదియునుగాక జపానురాజ్యాంగశాసనములను బట్టి మంత్రులు సామాన్యముగ
కంపెనీలలో సభ్యులుగానుండుట కాటంకముగలిగియుండుటచే నట్లువారాయుద్యో
గమును వహించుట తాముసంబంధముకలిగించుకొని నడిపించుచువచ్చు ననేకకంపెనీ
లకవాంతరములు వచ్చుటకు హేతువగుటచే దేశాభిమానులును దక్కినయెల్లవారును
నాశపడఁదగిన యాపెద్దపదవిని వద్దని విడిచియుండిరి. ఇవ్విధమున నైశ్వర్యాధార
మార్గములలోఁ బనిచేయుచు వచ్చుటయే కాక మఱియితరమగు నేవిధమునఁ దమదే



శమునకు క్షేమముచేయఁ గూడునో యట్లెల్లఁ జేయుటకు ముందునిలుచువాఁడుగాను
నుండెను. అనేకధర్మశాలలు కట్టించి వానికిఁ గావలసినసొమ్మును నిలవచేసియున్నా
రు. వీరివలన నేర్పాటుచేయఁబడిన విద్యాశాలలును బెక్కుగలవు. కంపెనీయ
ను పేరుతోఁ గలసి వ్యాపారముచేయుట జపానులో వీరేముందు వాడుకలోనికిఁ
దెచ్చిరి.

1868 సం॥ పు నవీనములగు నేర్పాటులకు ముందె చాలమంది జపానులోని పి
ల్లవాండ్రు ఐరోపా అమెరికాదేశములకుఁ బోయి యనేకవిద్యలునేర్చుకొని విష
యములను శోధించి ప్రతివిషయమును బాగుగానవగాహనచేసికొని తిరిగివచ్చి తమమా
తృభూమి యిప్పటి నాగరికస్థితిలోనిల్చియుండుటకు హేతుభూతులయిరని చెప్పి
యుంటిమి. అట్లితరదేశములు వెళ్ళివచ్చినవారిలో బేరన్‌షీపుసావాయును నొకరు.
వీరింగ్లాండునకును ఫ్రాంసునకును వెళ్ళి యక్కడివారిచే బహుగౌరవమును బొందిరి.
జపాను విడిచి యన్యదేశములకు బైలుదేరునపుడు తమతోసమానులయిన యితరజపానీ
యులవలెఁ బూర్వాచారములనే పూని తమదేశవేషములే వేసికొని వెళ్ళినట్లును రెండు
ప్రక్కలను రెండుకత్తులును మామూలుప్రకారము వ్రేలాడకట్టుకొనినట్లును ఫ్రాన్సుదే
శము వెళ్ళినపుడు తాము స్నేహభావముతో నక్కడికివచ్చియుంటిమి గదా యని
భావించి కత్తులుధరించుట తగదని ఫ్రెంచివారిలో ఘనులవలెనే తమదుస్తులను మార్చి
వేసికొనినట్లును జెప్పఁబడుచున్నది. సామాన్యముగా నూహించిన నిట్లు దుస్తులుమా
ర్చుట తగదనినను దేశకాలవిశేషములనుబట్టి జపానుదేశనాయకులు సమయోచితముగాఁ
దమపూర్వాచారములను మార్చుటలో వ్యర్థశంకలుపట్టుకొనువారు కారని తెలుపుచు
న్నది కాఁబట్టి యొకవిశేషముగాఁ జెప్పవలసివచ్చినది. తాముక్రొత్తదుస్తులను ధరిం
చినట్లు ఫ్రెంచిదేశములోఁ దమువంటి యొకబొమ్మను (ఫొటోగ్రాపును) తీయించికొనిరి.
దానిని జపానులోని వారికుటుంబమువారు చూచి తమకుటుంబమున కవమానము సంభవిం
చినదే యని దుఃఖించినారఁట. అనఁగా:—పరంపరగాఁ బెద్దస్థితిలోనున్న కుటుంబము
లోని బేరన్‌షీపుసావా ఐరోపాకుఁ బోయి యక్కడదుస్తులను మార్చినదియే గాక
కత్తులనుగూడ ధరించెనే యని విచారపడినట్లు తోఁచుచున్నది. జపానువారము కా
ని మనము వీరికుటుంబమువారి తలంపులు తెలిసికొనకుండ నదిపట్టియనాలోచన యని
కొనిన మనలో మనము ఖండితముగా ననుష్ఠించుచువచ్చు కొన్నియాచారములవిడిచిన
దమకొంపతిని జూచి మనవారు దూషించుట జపానువారుగాని మఱియొకరుగాని
గాంచిన వారికిదియు ననాలోచనయే యని తోఁచు నని తెలిసికొనవలెను. అయినను
బెద్దకాలము వాడుకలోనుండు నాచారముల నొక్కవిధముగా విడిచి క్రొత్తసూచా

రములను చేయుట యభివృద్ధికి సహాయకారియగుటవలన దేశాభిమానులు సామాన్యజ
నుల దూషణ భూషణములను లెక్కచేయక దేశక్షేమమునకుఁ దగినవానిననుష్ఠింప వె
నుకతీయరు. బేరన్ షీపుసావా నిజమయిన దేశాభిమానధీరుఁడు కాఁబట్టి పడమటి
వారి నాగరికములలో నేవి మేలు చేకూర్చుటకుఁ దగినవో వానిననుష్ఠింపవచ్చువారి
కందఱికిని ముందుఁదానై నిలిచియుండిరి. బేరన్ షీపుసావా ధనవంతులు, దరిద్రులు,
గొప్పవారు కొద్దివారు, ప్రతివారివలనఁ గౌరవింపఁబడినవారై జపానులో నెక్కడికే
గినను వానింగూర్చి యొక హీనవాక్యముగాని తగనికార్యములు చేయుచున్నాఁడని
గాని చెప్పుకొనువారిని గానము.

మార్క్వెస్ అయిటో, బేరన్ షీపుసావా, వీరితోఁ గొంచెముచ్చుతగ్గుగా సమా
నులుగా నిప్పుడు జపానులో 1 కౌంటు ఇనోయీ 2 కౌంటు ఓకుమా 3 కౌంటు మ
ట్సుకాటా 4 మార్క్వెస్ యామగాటా మొదలగు కొందఱిని జెప్పవచ్చును.

కౌంటు ఇనోయీగారు వయసుముదిరిన జప్పానుఘనులలో నొకరు. వయసు
లోఁ బెద్దవారయినను వారితలంపులును యత్నములును యౌవనములో నున్నవారి ధై
ర్యమునకు నాలోచనకును సమానముగానే యున్నవి. అనేకములగు పెద్దయుద్యో
గములను జేసి పేరుసంపాదించి యిప్పుడూరక యుండిరి. ఇప్పుడును జక్రవర్తికి న
మ్మకమయిన ముసలిమంత్రి కావలయునని కౌంటు ఇనోయీని బిలిపించినయెడల వారు
మరల నాయుద్యోగము వ్రహించుట కెంతమాత్రము నాటంకములేదు. వీరును
మార్క్వెస్ అయిటోయును, దక్కిననలుగురును మొదట యైరోపాకువెళ్ళి యక్కడ
వృద్ధిలో నున్న నాగరికమును నేర్చుకొని వచ్చిరి. మొదటవీరు రాజ్యాంగసహాయ
మంత్రిగాను, పిమ్మట వేఱొకమంత్రిగాను నుండిరి. జపాను ఇతరదేశములతో నొ
డంబడిక చేసికొనునపుడు వీరే మంత్రిగానుండిరి. జపానుదేశ ధనాధారస్థితులనుగు
ఱించి కౌంటు ఇనోయీగారికిఁ దెలిసినంత యితరులకుఁ దెలియదు. అన్యమంత్రిగా
నుండుటయేగాక రాజ్యపాలనమంత్రిగాను ప్రథమమంత్రిగాను నున్నవారగుటచే, కౌం
టుఇనోయీ, చనిపోయిన క్రిందిమంత్రులయిన జపానువారి క్రొత్తచరిత్రములలో సం
భవించిన యనేకసంగతులను గథలవలెఁ జెప్పి వినువారినుత్సాహపఱచువారు.

కౌంటు ఓకుమా, జపాను అభిమానులలోఁ బేరుచెందిన మఱియొకరు. అయిరో
పానాగరికమును దమదేశములో స్థాపించిన విషయములో మహాధైర్యముగలిగియున్న
వారు. అంతధైర్యము గలవారయియుండినందుననే వారిపై నాగ్రహముగల యొక
మూర్ఖుఁడు 1889 సం॥న వారిపైఁ దుపాకి పేల్చి చంపఁజూచినాఁడు. ఆగుం
డు కుడికాలునకుఁ దగిలి గాయముచేసినను ప్రాణహానిరాకుండఁ దప్పించుకొనిరి. కా



ని కాలుకొట్టివేయవలసివచ్చినది. వీరుకొంతకాలము రాజ్యమంత్రిగానుండిరి. వీరి
కంటె వాక్చతురుఁడు జపానులోలేఁడు. ఎప్పుడును దమదేశము వృద్ధిపొందువిష
యములలోనే యోజనగలవారు. వీరికింగ్లీషు తెలియకపోయినను దమదేశవిషయమై
అమెరికాపత్రికలలోనికి వ్యాసములను దఱుచుగా వ్రాయుచుండిరి. విద్యాభివృద్ధివి
షయములో నెపతెగని తలంపుగలవారు. ఆఁడుపిల్లలకును మగపిల్లలకును బాఠశా
లలను గట్టించి తామువ్యయము గాఁ జూచుచు నడపించుచున్నారు. అనేకములయి
న యితరదేశపుస్తకములను జపానుభాషలోనికిఁ దర్జుమాచేయుటకుగా నొకసభనిర్మించి
రి. కౌంటి ఇనోయీగా రెట్లో అట్లే కౌంటు ఓకుమాగారును ముసలివారయినను య
త్నములలోను దలంపులలోనుమాత్రము ముసలివారు కారు.

కౌంటు మట్సుకాటాయును మార్క్వెసు యామకాటాయును వయసుముదిరిన
రాజ్యతాంత్రికులలోఁ జేరినయిద్దఱు. మట్సుకాటా జపానురాజ్యవిషయములలో మి
క్కిలి పరిశ్రమకలవారు, బాల్యమున ఫ్రాంసుదేశమునకు వెళ్లియాదేశపు పాలనావిష
యములును నితరదేశముల విషయములును నేర్చుకొని తమదేశములోఁ దాము నేర్చినవిష
యములకు ఫలముగాంచిరి. మార్క్వెసు యామకాటాగారికి 65 సంవత్సరములవయ
సు. జపానురాజ్యతాంత్రికులలో మహాఖ్యాతిపొందినవారు. మార్క్వెసు అయిటో
కంటెసామర్థ్యశాలియని కొందఱు చెప్పుచున్నారు. అనేకపర్యాయములు ప్రథమ
మంత్రిగా నియమింపఁబడియెను. జపానుదేశసైన్యము అయిరోపావారివలనఁ బొగ
డ్తఁజెందునట్టి స్థితిలోనికివచ్చుట వారిసామర్థ్యమువలననే. అయిరోపాదేశములో
నాయాదేశములలోనున్న మగపిల్లవాండ్రందఱును గౌమారదశలోఁ గొన్నియేండ్లు సైన్య
ములోఁ జేరి యుద్ధయత్నములు నేర్చుకొనవలయునని ఖండితమయిన కట్టుఁబాటున్న
ట్లే జపానులోనుగూడ వీరొక కట్టుఁబాటుచేసిరి. చాలకాలము మార్క్వెస్ యామ
గాటా సైన్యాధిపతియై యుండెను. చక్రవర్తికి వీరియందు మహాప్రేమయని చె
ప్పుకొందురు. జనులకును మితిలేని గౌరవముగలదు.

సుమారు 35 సంవత్సరములకు ముందు అయిరోపావారివలన దూషింపఁబడు
చువచ్చిన జపానీయులింతస్వల్పకాలములో నాయైరోపావారివలననే తమతోసమాను
లుగ నంగీకరింపఁబడుటయును వారు జపానువారి స్నేహమును సహాయమును గోరివ
చ్చినదియును అయిరోపారాజ్యాంగమువారిలో మంచికీర్తి నిబొందియున్న యింగ్లీషు
వారు సమీపకాలములోఁ బరస్పరవిషయములలో సహాయమునిమిత్తము గానొక యొ
డంబడికను జేసికొనినదియును నీఘనుల సదాచేయు నాలోచనలవలనను జలింపనిధై
ర్యముతోఁ బాటుపడుటవలనను గదాసాధ్యమయినది!

జపాను ఇప్పటిస్థితిననుసరించి అయిరోపాదేశములవలె వృద్ధికిరాఁ దొడంగి స్వల్పకాలమే యైనందున నాదేశవర్తకము చిరివిగానుండదని నమ్మవచ్చును. 1868 సం॥ క్రొత్తయేర్పాటులు జరగినప్పుడు దాని దిగుమతి యెగుమతి వ్యాపారము స్వల్పముగానే యుండినను క్రమక్రమముగా 35 యేండ్లలోపుననే యొకటికి నాల్గువంతులు పెరిఁగినదని చెప్పినచో జప్పాను దొరతనమువిషయమయి కనఁబఱచుచుయుఁ దనమువలెనే వ్యాపారము వృద్ధిచేయుటలోను గూడ ధైర్యసాహసములు బుద్ధియుఁ గిలవారని తెల్పుచున్నది గదా.

జపానుదేశము విశేషముగా ఇంగ్లాండు, జర్మనీ, అమెరికా మొదలయిన దేశములనలెఁ జేతిపనిసామానులు చేసి యన్యదేశములకుఁ బంపుటలేదు. కాఁబట్టియును క్రొత్తనాగరికము నవలంబింప నాదేశమువారికి అయిరోపాదేశపు సామానులు చాల కావలసి యుండినందునను దామెగుమతియయు సామానులు తక్కువయయు దిగుమతియగు సామానులెక్కువయుగా నున్నది. ఎగుమతిదిగుమతులలోనుండు వ్యత్యాసమువలన జపానువారిద్రవ్యము దేశమునువిడిచి యితరదేశములకుఁ బోవుచున్నది. ఇండియాలోను మనదేశపుసొమ్ము యింగ్లాండుకు మిక్కుటముగాఁ గొనిపోఁ బడుచున్నదనిమనము విడువకుండ మొఱవెట్టుకొనుచునేయున్నాము. అయినను జప్పానువలెఁ గాకుండ మన యెగుమతిసరకులె దిగుమతిసరకులకంటె నధికముగానున్నవి. మనము బైటికెగుమతిచేయు సరకులును దేశములో దిగుమతియగు సరకులును మదింపులో సమానముగనుండినయెడల దేశమునకు వెలుపటిదేశములవ్యాపారమువలన సౌఖ్యములు సులభముగా దొరకకపోయినను ధననష్టమురాలేదని చెప్పుకొనవచ్చును. అట్లుసరిపోక, జపానుకు బైటదేశములనుండి సరకులెక్కువగాఁ దెప్పించుకొనవలసియున్నందున నది బైటికిఁ బంపుసరకులయొక్క మదింపునకుమించిన దిగుమతియొక్కమదింపు పరదేశవర్తకుల చేతిలోఁ బడును గాఁబట్టి యది జపానుకువచ్చునష్టమును దెలియపఱచును. అట్లుగాక యిండియావలెఁ బరదేశమునకు బంపుసరకుల వెలలో జాస్తియగునపుడా మదింపుమొత్తము మనచేతిలోఁ బడునేని మనకులాభమగును. వాస్తముగా నెవ్వరికిఁ జేరకుండ బైటికిఁ బంపు సరకులను మించిన మదింపుమొత్తమునునది మన మింగ్లాండునకుఁ బ్రతిసంవత్సరము పంపవలసిన సుమారు 180 లక్షలపౌనులకు సమమైనది యక్కడనే నిల్పచేయఁబడుచున్నందున నంతయు మనకు నష్టముగాఁ దేలుచున్నది.



జపాను తనయొక్క యిప్పటిస్థితిలోఁ దృప్తినిబొందకుండఁ జేతిపని సరకులు చేయుటలో మిక్కిలి యుపాయము ధైర్యమును గలిగి యున్నందున సమీపకాలములో నీవిధమగుపనుల వలన జేయఁబడుచున్న సామానులు బైటికిఁ బంపఁబడి లాభము సంపాదించుననుట కెంతమాత్రమును సందేహములేదు. తూర్పుదేశములలో నొకటియగుటచే జపాను తనసమీపములోనున్న తూర్పుదేశములతోడనే తనవ్యాపారమును విరివిచేయుటకు వీలగును. ఓడలురాకపోకలకగు వ్యయము అయిరోపాదేశములకు మిక్కిలిగాను జపానుకుఁ దక్కువగాను నుండుటచేతను జపానులోని పనివాండ్రకుఁ గూలి యిండియాలో నున్నట్లే తక్కువగానుండినందునను జపానుసరకులు కొరియా, చీనా, పిలిప్పయిన్ దీవులు, ఇండియా, సైబీరియా, మంచూరియా మొదలగు దేశములలో కిఫాయత్‌గా నమ్మవచ్చును. గుణమునందును నాసరకులు అయిరోపాసరకులుకంటె మంచివిగావని చెప్పవలనుపడదు. అయినను అయిరోపా అమెరికా వ్యాపారులతోఁ బోటీచేయుటలో జపానుకిప్పుడు కొన్నియాటంకములున్నవి. క్రొత్తగా వృద్ధిలోనికి వచ్చుచున్న దేశమగుటచేఁ జాలకాలమునుండి వర్తకములో మెలఁగి వృద్ధినొందియున్న దేశమువలె యంత్రములతోఁ బనిచేయుట మున్నగువానిలో నింకను వెనుకఁబడియే యున్నది. జపానుపనివాండ్రును దగినచదువును బరిశ్రమయును లేనివారగుట వలనను బడమటిదేశపుఁ బనివాండ్రవలెఁ గొంచెపుఁగాలములో విశేషము పనిచేయుటకు సాధ్యముకాదు. అట్లుసాధ్యమగుటకు రెండుమూఁడు తరములైనంబట్టును. ఆకాలమువచ్చునఱకు జపానువారు నించుమించుగాఁ జేయఁబడుచున్న సరకులే బైటికిఁ బంపి లాభమునుబొందుచుండఁ దగినదని వారు తెలిసికొనిరి. జపానులో రాతిసిబొగ్గు విశేషముగా దొరకుచున్నది. ఏకాధిపత్యమును బలుదీవులలోనిండియుండుటచే నీళ్ళలోనుండియే సరకుల రాకపోకలు చేయుటకు సులభముగానున్నది. ఈసాధనమువలననే సుమారు పదిసంవత్సరముల లోపుననే దూదితో సామానులు చేయుపనులు బొంబాయిలో వృద్ధియైయుండినట్లుగా జపానులో వృద్ధిగానున్నవి. జపానుకును ఆస్ట్రేలియాకును శీఘ్రకాలములోనే వ్యవహారసంబంధము స్థిరపడునట్లుతోఁచుచున్నది. ఇక్కాలమున నాస్ట్రేలియాలోనుండి విశేషముగా రోమమును రోమముతోఁ జేయఁబడిన సరకులును (వూలును వూలుతోఁ జేయబడిన సామానులును) జప్పానుకువచ్చుచున్నవి. వీనికిబదులుగా జపానువారు తమసముద్రపురేవులలో దొరకు చేపలను ఆస్ట్రేలియావారికి భోజనసామగ్రిగాఁ బంపుటకవశ్యమయిన యేర్పాటులు చేసికొనియుండిరి. జపానుకుత్తరదిశయందున్న సైబీరియా

యును విస్తారమయిన దేశములో నిప్పుడు రష్యాలోనుండి వచ్చుసరకులకంటె జపాను దేశసరకులు వెలలుసరసముగా నమ్మఁబడఁదగినవని తలఁచి యట్లునెఱవేర్చుటకు యత్నములు చేయఁబడుచున్నవి. సమీపకాలములో జప్పానువారు కొందఱు సైబీరియా వ్యాపారము వృద్ధియగునట్లేయుపాయములు చేయవచ్చునని శోధించి తెలిసికొనినట్లుగా నక్కడకు వెళ్ళి తమయభిప్రాయములను వెలిపఱచియున్నారు. చాలకాలము నుండి స్పెయిను రాజ్యాంగమువారి బాధలవలన శ్రేష్ఠతచెడియున్న ఫిలిప్పయిన్ ద్వీపములవారు వానినిసహింపక కలహముచేయ మొదలిడఁగా నాద్వీపములవారికి సహాయులుగా అమెరికావారు ప్రవేశించి స్పానియావారిని గొట్టి తొలంగించి యాద్వీపమును దమవశముచేసికొని వారిధనాభివృద్ధిని బాడుచేయుటయే వారిపనిగాఁ దలఁచియున్న వారికిఁ దగినట్లుగా నద్దీవిలోఁ బనులయభివృద్ధికొఱకు సంవత్సరమున కఱువది వేలటన్నుల నేలబొగ్గు జపానువారుపంపుటకుగా వారితో నొడంబడికనుజేసికొనియుండిరి. ఇప్పుడు ఫిలిప్పయిన్‌దీవియొక్క ముఖ్యస్థలమైన మానిల్లాలో జప్పానుదేశకార్యస్థులొకరుండి తమదేశవ్యాపారము వృద్ధియగుట కవశ్యమయిన ప్రయత్నములు చేయుచు వచ్చుచున్నారు. మొత్తమునఁ దూర్పుదేశముల వ్యాపారమును జపానువారే తమశక్తివలన సాధింపఁగలరని తలంచుటకు వీలున్నది. దానినిమించి అయిరోపా దేశమువారు తమశక్తిచూపింపకపోయినచో నష్టమువచ్చును.



## పదునైదవప్రకరణము.

ఇదివఱకు జప్పానుదేశ చరిత్రమును సంగ్రహముగాఁ జెప్పుటలో నాదేశమువారు తమచక్రవర్తియే దైవమని నమ్మి పూజించుచు వచ్చినందునను, ఒక్కటిగాఁ గూడి గొప్పవారందఱుఁ దక్కువవారు సకలమైనవారును దమలాభమునే చూచుకొనక సంఘక్షేమమునకే యత్నముచేయుటవలనను పూర్వాచారములను దలంపులను గాలమునకుఁ దగినట్లుగా నవశ్యమగునపుడు మార్చుచు వచ్చుటచేతను నిప్పటియభివృద్ధిలో నుండుటకుఁ గారణమయినట్లు చెప్పియుంటిమి. అయినను నెట్టిగుణములు గలిగియున్నను విద్యాధికులై బుద్ధివలనను దీర్ఘాలోచనమువలనను దమయత్నములను దగినరీతిగా సాగించుచు వచ్చిననేకాని లాభములేదు. దీని వాస్తవమును దెలిసికొని క్రొత్తయేర్పాటులు చేయఁబడినతక్షణమందే జప్పానువారి కిప్పటికి వీలయినట్లుగానే విద్యలు నేర్పవలయునని రాజ్యాంగమంత్రులు చింతింపమొదలుపెట్టిరి.

జపాను చరిత్ర లోకములోని యన్యులతో సంబంధములేకుండ నెప్పటివలెనే వేఱుగానుండి వృద్ధిపొందుచున్నందున నాదేశమువారు పొందుచువచ్చిన యైశ్వర్యమెప్పుడును నొక్కమొత్తముగా నుండును. అయినను నితరదేశములతో సంబంధమును గలిగించుకొని పెద్దదేశములలో నొకదేశముగాఁ బ్రకటనమైవచ్చు ఘనతను జప్పాను పొందియున్నందున దాని ననుసరించి నిర్వహించుటకుఁ దగినట్టు నూతనపద్ధతులు తమకమరి యుండుటకుఁ గ్రొత్తవిద్యలు నేర్చుకొనుట యవశ్యమైయున్నది. ఇండియాలో నుగూడ నట్లు కావలసియున్నదికదా? ఇండియాలోనిమన కింగ్లీషువారి సంబంధమును వారిసంబంధులగు నితరదేశములవారి సంబంధమును లేకపోయినయెడల మనము మన పూర్వులవిద్యలనే నేర్చుకొందుముగదా? హిందువులు ఇంగ్లీషుభాషను దమతల్లిభాషకంటె నెక్కువశ్రద్ధతో నేర్చుకొని యాంగ్లేయులతో సమానులుగానుండ యత్నించుచుండుటయును దేశములో నడుగంటిపోవుచున్న బహువిధములగు పనులు మరల మొలకెత్తునట్లుచేయుటకుఁ దగినచదువులు నేర్పింపవలసినదని మనమాశపడియుండుటయును మనదేశవ్యాపారమంతయు నాంగ్లేయులవశమయి మనధనమపరిమితముగా నితరదేశములకుఁ గొనిపోఁబడుచుండుటం గాంచి దుఃఖించి యావ్యాపారమన్ని దేశములలో నున్నట్లే దేశస్థులమయిన మనచేతిలోనుండవలయు నని కోరుటయును మనకన్యదేశములవారి సంబంధముండఁబట్టియే కదా?

జపానులో నన్యదేశస్థులు ప్రవేశింపఁ బ్రారంభించినది మొదలు జపానువారి కిండియావారికివలె నితరదేశములవారి సరకులనుపయోగింపవలయునని యుత్సాహపుట్టిన

ది. స్వదేశములోఁ జేయఁబడిన సరకులపై నభిమానము తగ్గి బైటినుండి సరకులను దెప్పించుకొని యుపయోగింప మొదలుపెట్టిరి. దేశములోని పనివాండ్రకు దీనివలన వృత్తిపడిపోవుటయే కాక జనులుకోరిన సరకులుచేసి యిచ్చునంతటిపనివాఁడు లేకపోయి నందున విశేషముగా నందఱకు నితరదేశములనుండి సామానులు రావలసినయవసరము కలిగినది. దొరతనమువారికిఁ గావలసిన యుద్ధసామగ్రి మొదలు సామాన్యసంసారి యింటిలోనికిఁ గావలసిన స్వల్పవస్తువులకు నితరులవలనఁ జేయించుకొని తెప్పించుకొనుట యవశ్యము కాఁబట్టి జపానులోఁ జేతిపనులు నశించి యిండియావలెనే కష్టముల నుబొందునని దేశాభిమానులు తలంచి యెప్పుడు రాచరికపుఁ బనులు అయిరోపాదొరతనమువారిపనుల ననుసరించి వచ్చుచున్నవో యప్పుడే జనులక్షేమాభివృద్ధికిఁ గావలసినవ్యాపారము చేతిపనులు మొదలయినవాని సంబంధమగు యత్నములును నాప్రకారముగానే వానిని వెంబడించి యుండినఁగాని దొరతనమొకభాగమును జనులక్షేమలాభముల యభివృద్ధి యొకభాగమునుగా భేదమునుబొంది సంఘక్షేమమున కాటంకములు సంప్రాప్తమగునని యాలోచించి ప్రభుత్వమున కనుసరించి జనులద్రవ్యాధారప్రయత్నములును మార్చుటయే యుచితమని ధైర్యము నవలంబించిరి.

అట్లుతలఁచి వృథాగాఁ దామసము చేయక దేశములో నున్న ముసలివారు బాలురనను రెండు తరములవారిలోనుండి తగినవారి నేఱితీసి అయిరోపాదేశములకు దొరతనమువారందులకగు ధనమునిచ్చి పంపి యందువృద్ధిలోనున్న శాస్త్రములను నాగరికము మొదలగువానిని గుఱించి యున్నస్థితిగతులను దెలిసికొని వానిని జపానులోఁగూడఁ బ్రారంభింపవలయునని నిశ్చయించిరి. ఆనిశ్చయప్రకారముగనే చేసి జపానులో స్వల్పకాలములోనే యనేకనూతనవిద్యాశాలలు దొరతనమువారి స్వంతధనముతోఁ గట్టింపఁ బడినవి. ప్రభుత్వమువారికిఁ గావలసిన విలువగల గొప్పగొప్పసామానులను జేయుట కనేకములగు కర్మశాలలను వానివలనఁగలుగు ధనవ్యయమును దానినడిపించుటలోఁ గలకష్టములను గమనింపకుండ రాజ్యాంగమువారే స్థాపించిరి. ప్రారంభములో అయిరోపాలోని విద్యాధికుల సహాయము ముఖ్యముగాఁ గావలసి యున్నప్పటికిని జపానులోనుండి బైటికిఁ బోయిన బుద్ధిమంతులు తిరిగి రానురాను అయిరోపావారి సహాయమనావశ్యకమయినది. ఎక్కడెక్కడ నైరోపావిద్వాంసులను నియమించుట యవశ్యమో యక్కడక్కడ జర్మనీ, ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా, కొరియా, రుషియా, ఇటలీ మొదలయిన దేశములనుండి జీతములిచ్చి రప్పించి నియమించిరి. 1899 సం॥ న జప్పానులో విద్యాస్థాపనములలో నిట్లు 52 యితరులు వచ్చియుం



డిరి. ఇతరులను దమదేశములో నియమించి దానితో రాజ్యాంగమువారూరక యుండలేదు. జపానీయులగు నుపాధ్యాయులు పెక్కుమందిని తెలిసికొని పిలిచి జర్మనీ మొదలగు దేశములకుఁ బంపిరి. విద్యార్థులగు చిన్నవాండ్రను పెక్కుమందిని గూడ నట్లె పంపఁగా 1900 మార్చిమాసము చివరివఱకు 100 జప్పానుదేశస్థులు పరదేశములో ముఖ్యముగా జర్మనీలో విద్య నేర్చుకొనువారయి యుండిరి. కాఁబట్టి కాలక్రమమున జప్పానుబోధనశాలలలో నితరదేశములనుండి వచ్చిన యుపాధ్యాయులను దక్కువచేసి జప్పానువారినే నియమించుటకు సాధ్యమయినది. ఇట్లు జపానుప్రభుత్వమువారు పడమరదేశములవలెనే మహత్తరములగు శాస్త్రములు మొదలగు వానిని జప్పానువారికే నేర్పి వారివలననే సమస్తసామగ్రియు నలవడునట్టి యుపాయములను జేయుచువచ్చు మార్గము, లిప్పుడు అయిరోదేశమువారు చాలమందియు, అమెరికా, కనడా మొదలగు దేశములవారును జేయుచువచ్చు మార్గమే కాని వేఱుకాదు.

ఎట్లు ప్రతిమనుజుఁడును దనప్రయత్నమువలననే ముందుకువచ్చుటకు సాధ్యమగునో అట్లే ప్రతివారును దమస్వప్రయత్నమువలననే గొప్పతనమును బొందవలయునను దానిని జపానువారు పూర్ణముగాఁ దలంచియున్నారు. కాఁబట్టి తమదేశమువారిని మూఢులనుగాఁ జేసి యన్యదేశీయులు ద్రవ్యమునున్న బుద్ధియును సామర్థ్యమును గొని జప్పానులోని పూర్వపుపనులను స్థిరపఱచి వృద్ధిచేసి దానివలన దొరకులాభములను వారేదీసికొనిపోఁగా దేశజనులు వారిచేతిక్రిందఁ బనిచేయుచు వారిచ్చుకూలియే చాలునని తృప్తినిబొంది యున్నవారుకారు. ఇండియాను బాలించుచున్న బ్రిటిషువారేయుద్దేశములచేతనో యేకారణమువలననో యిండియాలోనివారి కవశ్యమయిన గొప్పచదువులు చెప్పింపకుండ హిందువులు ప్రవేశించి నడిపింపవలసిన చేతిపనులను బయలుచేయుటయును ఇండియాలోఁ బుట్టి యక్కడనే పెరిఁగి యక్కడనే వచ్చునట్టి హిందువులకే స్వంతముగా ననుభవింప బాధ్యతగల యిండియాద్రవ్యమును బరదేశస్థులుగొని పోవుటయును మనస్సు నొవ్వకుండఁ జూచుచువచ్చుచున్నారు. ఇట్టి విపరీతపరిపాలనము వలననేగదా యిప్పుడిండియాలోనివా రుపయోగించుచువచ్చు సమస్తవస్తువులును నితరదేశములవారు చేసిపంప దానినే వెలకుఁ గొనవలసినవారయి దరిద్రులైయుండిరి? ఇట్లు వీరు వెలకుఁ గొనవలసిన సామానులు మనవలనఁ జేయ సాధ్యమయినవేగాని పరదేశములనుండి తెప్పించుకొనవలసినవికావు. ఇండియామహావిస్తీర్ణముగలదేశమే కాక ముప్పదికోట్లజనులుగలిగియున్నది. మఱియును శీతోష్ణస్థితులును భూసారమును జలాధారము భూములసమపాయములు నిండియాలో సులభ

ముగా ననువుపడుటకు వీలుకలిగియున్నందున నిక్కడ దొరకఁదగిన పదార్థములు కొన్నియు బైటినుండిరాఁదగినవి కొన్నియు ననువ్యత్యాసములేకుండ హిందువులైన 30 కోట్లజనులకును గావలసిన వస్త్రములేమి శరీరసౌఖ్యములకుఁ దగిన పదార్థములేమి బుద్ధికుశలతవలన సంపాదింపఁదగిన వేదికకళాజ్ఞానముచేఁ జేయఁదగిన చిత్రవిచిత్రవస్తువులేమి యిట్టివన్నియును జేయుటకుఁ గావలసిన సమస్తసామగ్రియును నిండియాలోనే దొరకఁగలదు. జనులు కేవలము మందబుద్ధికలవారుకారు. సుమారు 150 సంవత్సరములకు ముందు బ్రిటిషువారు ప్రవేశించి ఇండియాలోనివారి పనులు విద్యలు మొదలగు సామగ్రియంతయును బాడుచేయుటకుఁ బ్రారంభించిన కాలములో హిందువులు తమకవశ్యమయిన యన్నిసామానులను విద్యలను గలిగి ప్రపంచములోని యందఱివలెను బాగుపడుచుండినవారేగాని కేవలమ్లేచ్ఛులవలె నడవులలోని కాయలు దుంపలు తినుచు జంతువులను జంపితినుచు బ్రదుకుచున్నవారుకారు. కాఁబట్టి బ్రిటిషుదొరతనమువారి సహాయమును సలహాయును దొరకినయెడలఁ దిరిగియు నిండియావారు పూర్వమువలెఁ దమకుఁ గావలసిన సామానులను జేసికొనుచు సౌఖ్యముల ననుభవించుటకు సందేహము లేదు.

ఇవ్విషయములోనుగూడ నిండియావారి స్థితినిజూచి జపానువారు వివేకముగలవారయిరి. జపానువారినే తగినట్లు నేర్పించి వారితోనే కావలసినసకలసామానులున్నుఁ జేయించి దేశములోని చేతిపనులను వృద్ధిచేసి వానివలనఁ గలిగిన లాభమును జపానువారేయనుభవింప సమర్థులనుగాఁ జేసి స్వదేశమున నుపయోగింపఁ జాలినసామానులుగాక మిగిలినవానినితరదేశముల కెగుమతిచేసి యీవిధముగానున్న దేశమునకు లాభము కలుగఁ జేసి రాజ్యాంగవిషయములు దేశస్వతంత్రత్వమును స్థాపించి ధనము వృద్ధియగుటకును దేశములోనితరులు విక్రయింపకుండ జేసి స్వాధీనముచేయింపకపోయినచో ఇండియానుబోలియే జపానుదేశమున్ను దరిద్రస్థితిని బొందునని దేశాభిమానులు తలంచి యీయుద్దేశము సమకూడునట్లు సమస్తప్రయత్నములను జేయుచున్నారు.

---

# పదునాఱవప్రకరణము.

అయిరోపాజాతివారును అమెరికావారును దమతమ పేరాసలచేత లోకమునందంతటను గొప్పనుబొంది యధికారములను స్థాపించియున్నారని చెప్పియున్నారము. ఆసియాఖండముతోఁ జేరిన రుషియా, ఇండియా, సయాం, చీనా, పసిఫిక్కుదీవులు వీనియందు నట్లే తమయధికారమును స్థాపించి యాదేశముల ప్రభుత్వవిషయము లందును వర్తకవిషయములందును సంబంధము గలిగించుకొని యాక్రమించుకొని యుండిరి. ఇంతేయు నిప్పును జపానుపొందియున్న బలిమియుఁ బలుకుఁబడియును నైరోపావారి యత్యాశను కట్టిపెట్టించినందున జపానువారికిఁ జేరువుగానున్న పైనఁజెప్పిన దేశములవారలలోఁ దమకుఁ దమకుఁ దగిన గౌరవమునకు హానిలేకుండఁ గాపాడుచు వచ్చుచున్నారు. అయిరోపావారే ప్రవేశించి యీదేశములలో నున్న సమస్తవిధములయిన పదార్థములను నపహరింతురేని జపానువారికి స్వీయముగా లభింపఁ గూడిన రాఁబడులున్ను నున్నతస్థితియును దక్కువయగును. గావున నీదేశములకు సహాయముగా జపానువారునిలిచి వానిని రక్షించుట వారియొక్క బాధ్యతయై యున్నట్లు చెప్పఁబడుచున్నది. ఈయుద్దేశముతోడనే బ్రిటన్, జర్మనీ, రుషియా, అమెరికాయున్నగు దేశములవారు నితరములగు క్రిందిదేశములలోఁ దమతమయధికారమునే స్థాపింపఁ బోటీచేసి పోట్లాడుచున్నారు. పెర్షియాలో రుషియావారు ప్రవేశించి విశేషముగా దానిని దమకులోఁబడునట్లు చేసికొనిన వారయినప్పటికిని బ్రిటీషువారు తమయధికారమును గూడ నక్కడ స్థాపింపవలయునని రుషియావారితోఁ బంతములాడుచున్నారు. అప్పుడే మహావిస్తారమయిన చీనాయేకాధిపత్యములోనుగూడ నైరోపాయొక్క ముఖ్యప్రభువులు వారు నందఱును అమెరికావారును సమానాధికారమును స్థాపించి దానిసదుపాయములను చిన్నాభిన్నములుచేయుచు వచ్చుచున్నారు. తమకు బహుదూరమునందున్న విదేశములలోఁ బ్రవేశింప నైరోపావారు తమసైన్యబలమువలనను నాగరికమువలనను న్యాయమున్నదని సాధించినపుడు సయాము, చీనా, పిలిప్పయిన్ ద్వీపములు, కొరియా మొదలగునవి జపానుకు సమీపములో నున్నవేకాక యాదేశములచరిత్రములలోనుగూడ నాగరికవృద్ధియందును మొదటినుండియు జపానువారితో సంబంధముగలిగి యుండినందున జపానువారికి అయిరోపావారికంటె బలమయినన్యాయముకలదని వాదించుటకుఁ దగునని చెప్పవచ్చును. తక్కిన మొదటియంతస్తునుగల జాతివారితో జపానువారొడంబడిక మూలముగా నింతవఱకును వే సమానగౌరవమును బొందియున్నారు. కాఁబట్టి అయిరోపావారియున్నది

వీరికిని గలదుగదా? అయిరోపావారు తమలోపలనే చేసికొనువ్యవహారములలో జపానువారు ప్రవేశించుట న్యాయముకాకపోయినను తూర్పుదేశములవారి యేర్పాటులసంబంధమయిన ప్రశ్నలనుబట్టి జపానువారు బాధ్యతగలిగియే యున్నారు.

ఆదికాలమునుండియుఁ దూర్పుఏషియా యొక్క ముఖ్యమయిన యిండియా, చినా, భర్మా, సయాం, టిబెట్, కొరియా మొదలయిన దేశముల నాగరికమునకును మతసంబంధములకును జపానుయొక్క నాగరికతకును మతవిషయములకును దగ్గఱసంబంధము గలిగియున్నది. పైనఁ జెప్పిన దేశములలో నిండియాలోఁదప్ప దక్కినదేశములలో బౌద్ధమతము ప్రబలమయియున్నది. ఇదివఱకీ పుస్తకములోఁ జెప్పియున్నవిధమున బౌద్ధమతము ఇండియాలో నుత్పత్తియైనది. మొదట చీనాదేశమువారు ఇండియాకువచ్చి బౌద్ధమతాచార్యులయొద్ద నుపదేశమును బొందియు నామతము వృద్ధిలోనికివచ్చిన ముఖ్యస్థలములను గాంచియు బౌద్ధమతగ్రంథములను సంపాదించుకొనియును బోయిరి. చీనాలో బౌద్ధమతము స్థాపింపఁబడఁగా నితరదేశములలోనను స్థాపనయైనది. కాఁబట్టి యెట్లు అయిరోపాప్రభుత్వమువారు క్రీస్తుమతమవలంబించినవారికి సహాయులై యాక్రైస్తవులు క్రైస్తవులుకానివారివలనఁ గష్టములను బొందునపుడానుకొనుచున్నారో యట్లే జపానుదేశము బౌద్ధమతము నవలంబించినవారికిఁ గావలిగానుండవలయునుగదా? క్రీస్తుమతప్రవేశమయిన నాగరికత నెట్లు అయిరోపాజాతివారాదరింప స్వతంత్రత్వమును బొందియున్నారో యట్లే గ్రీస్తుమతసంబంధ నాగరికతకంటె నెన్నివందలసంవత్సరములో పురాతనమయిన హిందూ బౌద్ధమతములు ప్రవేశించిన తూర్పుఆసియానాగరికతను జపానువారాదరించు బాధ్యతగలవారగుట కొనియాడఁ దగినదియే.

మఱియుఁ బైనఁ జెప్పిన దేశములకును, ఆస్ట్రేలియా, పిలిప్పయిన్ ద్వీపముల వంటి పసిఫిక్కుసముద్రములోని ద్వీపములకును, జపాను, అయిరోపాదేశములకంటె మిక్కిలి దగ్గఱగా నున్నది. అసాధ్యసమయములు తటస్థించినపుడు జపాను తత్క్షణము బైలుదేఱి యాపదరాకుండ రక్షించుట కనువయినట్లు బ్రిటిషుదేశమువలనఁ గాని అమెరికావలనఁ గాని సాధ్యపడదు. కాఁబట్టి తూరుపునాడులలోఁ దమప్రాబల్యము గనఁబఱచుచువచ్చిన ఐరోపాదొరతనమువారికి జపానుయొక్క సహాయముకోరఁదగినది. పిలిప్పయినుద్వీపములిప్పుడమెరికావారి యాధీనమయిపోయినవి. వానికి రాజధాని మానిల్లాయనునది. మానిల్లాకును దానికి సమీపములోనున్న యమెరికావారి రేవుగానున్న సాన్‌ఫ్రాన్సిస్కో యనుదానికిని 14 మొదలు 20 దినములప్రయాణము దూరమున్నది. ఆరీతినే యింగ్లాండుతో సంబంధముగల ఆస్ట్రేలియాకు



సంభవించిన సమయములలో నింగ్లీషువారి సముద్రసేన కావలసిన యెడల నెప్పుడు నా[illegible]దు దక్షిణఆఫ్రికా, కనడా, ఇంగ్లండు మొదలయిన చోటులనుండి రావలయున్నది. జపానుదేశమునుండి రావలయునన్నచోఁ బదిదినములలో వచ్చిచేరఁగలవు. హిందూచీనాయను చోటపై ఫ్రాన్సువారికి స్వాతంత్ర్యముగలదు. వారును జపానువారికంటె దూరముననే యున్నారు. ఇట్లు పడమటిదిక్కునఁగల రాజాంగములవారితో సంబంధముగలిగియున్న తూర్పు ఆసియాదేశములు జప్పాను సమీపమునందుండుట దాని కనేకసౌకర్యములకు కారణమయియున్నది.

ఇదియునుగాక జప్పాను యొక్క సైన్యబలమిప్పుడు విశేషముగా వృద్ధియై యున్నది. ఇంగ్లాండువలె జప్పాను సముద్రమువలనఁ జుట్టఁబడియుండు ద్వీపములతో నిండిన దేశము. ఇతరులు దానిని దాడి జయించుట కష్టము. జప్పానువారికి బ్రిటిషువారికున్నట్లే సముద్రసైన్యమే ముఖ్యమైనది. ఇట్టి సేన సమీపకాలములోపలనే జప్పానువారు గూడఁబెట్టి బలపఱచుకొని యుండిరి. లోకములో నింగ్లాండుకంటె మఱియేదేశమును, అమెరికాకూడ నీవిషయములో జపానువారికి సమానముగా నేరదు. జపానుపైకితరులు దండెత్తకుండఁగాపాడుటయెట్లో యట్లే సముద్రము దాఁటి యితరదేశములవారితో వ్యాపారము నడపుటకును జపానువారికి నావికసేనాబలము విశేషముగాఁ గావలసియుండును. అట్లు గాకపోయిన నితరదేశములవారితోఁ బోటీచేసి సంబాళించుకొనుటకు వల్లగాదు. అమెరికా, ఫ్రాన్సు, రుషియా, జర్మనీ, యన్నిదేశములును దమతమ నావికసేన నధికరించుకొని వచ్చుచున్నవి. ఇఁక నింగ్లండో, నావికసేనయే జనులకాధారమయినదని నమ్మి యితరులు క్రొత్తగాఁ బడవోడలు నేయించినఁ దానిరువదియోడలు చేయించుచున్నది. ఇట్టితరదేశములవారు చేయుచుండుటఁ గాంచి వారికి సరిసమానముగాఁ బ[illegible] వృద్ధిచేయుచుండ జపాను గూడ నట్లే చేయవలసివచ్చి విశేషద్రవ్యము వెచ్చపెట్టి మొదటితరమయిన యుద్ధనావలు చేయుచున్నది. తమదేశమునకు ప్రక్కనున్న పసిఫిక్కుసముద్రములో దమకంటె గొప్పస్థితిలో నున్నవారుండకూడదని చక్రవర్తి మొదలు సాధారణజనులకు నందఱు నభిప్రాయపడ నందఱునుత్సాహముతో నేకీభవించి కావలసినవానిని జేర్చుకొనుచు వచ్చుచున్నారు. సమీపములో జపాను నావికసేనలను జేర్చిపెట్టిన చక్రవర్తిగారు జాగ్రత్తగానున్న యపుడక్కడనున్న యింగ్లీషువారు మొదలగు బహుదేశముల ప్రతినిధులున్ను ఆసేనయొక్క యాకారమున్ను వానిని నడపించుటలో జపాను సేనానాయకులు గనఁబఱచిన సామర్థ్యమున్ను నేకీభావముగాఁగల దేశాభిమాన

మున్న నోరునిండి పొర్లునట్లు పొగడిరి. దీనికిఁ దగినట్లు జపానులోఁ గావలసినంత తాతుసిబొగ్గు దొరకుచున్నదఁట. ఆబొగ్గులేకుండఁ బోగయోడలు నడువవుగదా? ఇతర దేశములవారికి ఫసిఫిక్కు సముద్రములో నావలకై నేలబొగ్గు కావలసియున్నయెడల జప్పాను ఆయావారికిఁ గావలసినబొగ్గు నిచ్చుటకు సిద్ధముగా నున్నదఁట. అమెరికాయోడలు ఫసిఫిక్కుసముద్రములో నున్నప్పుడు బొగ్గుకఱవుపడిన పక్షమున నెక్కడనుండి వారికివచ్చును? జపానువారితో స్నేహమున్నయెడల నత్యల్పకాలములోఁ దెప్పించుకొనుటకు వీలగునుగదా? ఈ సౌకర్యమునుద్దేశించియే యింతకుముందీవిషయమయి యీ రెండుదేశములకును నొకయొడంబడిక యేర్పడియున్నదని యొక వెనుకటి యధ్యాయములోఁ జెప్పియున్నారము.

ఇట్లు నావికసేనలలో బలవంతులై యుండుటయేగాక, కాల్బలము విషయమునఁ గూడ జపాను మిక్కిలి యభివృద్ధిలోనే యున్నది. ఏనిమిషములోనుగూడఁ గావలసినయెడల నైదులక్షలకాల్బలమును సిద్ధముచేయఁగలదు. బోయలవలె జపానువారును మహాపౌరుషముతోఁ జోటువిడిచి చోటుమార్పఁగల సామర్థ్యముగలవారు. చీనాలో 1901 సం॥న సంభవించిన బాక్సరుకలహములో జపానుపటాలములు కనఁబఱిచిన శౌర్యమును అయిరోపావారును జూచి యాశ్చర్యపడిరి. వారితోఁ గూడి కలహము నాపివేయుటకై యుద్ధముచేసిన అయిరోపాప్రభుత్వమువారు మాత్రము, జపాను సేనానాయకులిష్టప్రకారము చేయుటలో వారిని నిర్బంధపఱచకపోయినయెడల నింకనువారి సామర్థ్యమును గనఁబఱచియుందురు. అంతటిప్రయత్నములును శౌర్యమును గలసైన్యము సముద్రముచేత నావరింపఁబడిన జప్పానును గాపాడుటకు స్వదేశములోనుండ నవసరములేదు కాఁబట్టి యంతయును నితరదేశములవిషయమయి యుపయోగించుటకు సాధ్యమగును. జపానును శత్రువులు తొందరచేయకుండ నావికాసేన సముద్రములోనుండి రక్షించుచుండును గాఁబట్టి నాటుసేన (కాల్బలము) పసిఫిక్కుసముద్రప్రాంతమునఁ గలదేశములలో నెక్కడనైనఁ బ్రవేశించుట తేలిక. ఇట్టి మొదటితరపు సేనలేకుండ అయిరోపావారు బహుదూరమునుండి యుద్ధముచేయవలసియుండినయెడల జపానువారు సమీపములో నుండుటచే వారికిఁ గలసదుపాయములలో నొక్కగొప్పవిషయము.

ఇట్లు పోరునడపకుండఁ గేవలసాహాయ్యమువలననే నిర్వహింపవలసివచ్చిన యెడలనుగూడఁ దూర్పువిక్కున జపానువారికిఁ గలవసతులు అయిరోపావారికిలేవు. ఎట్లయిన నిక్కాలమున ముఖ్యముగా చీనాదేశసంబంధమయియే అయిరోపారాజ్యాం



గమువారు తమతమ యేర్పాటులను జెప్పి లాభమును బొంద యత్నించుచున్నారు. చీనారాజ్యాంగాధికారులు అయిరోపావారియందు నమ్మకముంచి కపటములేకుండ సమాధానము నడుపనొప్పుదలలేక యున్నారు. జపాన్‌వారియందుమట్టుకు చీనావారికి నమ్మకముగలదు. ఎందువలననఁగా:—రెండుదేశములవారు నొకరినొకరు నూర్లకొలఁది సంవత్సరములనుండి బాగుగా నెఱుఁగుదురు. ఒకరిమనోభిప్రాయములొకరికిఁ జక్కఁగాఁ దెలియును. ఇంతియకాక చీనాసంబంధమయి భూమిమీఁదనో యోడలమీఁదనో యుద్ధముజరపవలసివచ్చినచో జపానువారికి మార్గములు తెలిసియున్నవి. వర్తకవిషయమయి యేయేసరకులు చీనావారికుపయోగించును చీనాసరకులేవేవి యితరదేశములకుఁ బనికివచ్చుననునదియును జపానువారికిఁ దెలిసినట్లు అయిరోపావారికిఁ దెలియుటకు న్యాయములేదు.

ఈతూర్పుదేశములలో జపానువారు తేలికగా వ్యాపారముచేయుటకు వీలయినట్లు అయిరోపావారికిఁ జేయవీలులేదు. జపానువారు స్వల్పవ్యయము చేయవలసిన సామానుల నమ్మ ననువుపడును, ఏయేసరకులీదేశమువారికుపయోగమగునో యను విషయముగూడ వారికిఁ దెలియును. మఱియును సామానులు స్టీమరులపై నితరదేశములకుఁ దీసికొనివచ్చి యమ్ముటలో జపాను సమీపములో నుండుటచే కర్చులుస్వల్పముగా నగును. అయిరోపాసరకులు స్టీమరులలోవచ్చుటలో బహుదూరమగుటచే కేవు మిక్కిలి యధికముగా పట్టును. కాఁబట్టియే జపానువారు తమసరకులను చీనా, యిండియా, ఆస్ట్రేలియా, కొరియా, ఫిలిప్పయిన్ ద్వీపములు మొదలయిన పెద్దదేశములలో చవుకగా నమ్ముటకు వీలగుటవలన వారివ్యాపారమే వృద్ధియగును. ఇక్కాలములోని యంత్రములను జేసి ప్రయోగించుటలో జపానువారిప్పుడు పడమటిఖండములవారికి సమానులుకాకపోయినను జనులు మహాబుద్ధిశాలురగుటవలన నెటువంటి విద్యయైనను బహుశీఘ్రకాలములో నేర్చుకొనునంతటి సమర్థులయియుండిరి. హిందువులగు మనవలె 50 సంవత్సరములకు పూర్వము చేతులతోఁ జేయుపనుల నిప్పుడు అయిరోపావారివలె యంత్రములతోఁ జేయుచున్నారు. ఇండియాలోనే వారుచేయు సరకులన్నియు కర్చగుచున్నవి. పైఁ జెప్పిన దేశములలో అయిరోపాదేశవర్తకులు జపానుదేశస్థులతోఁ బోటీకివచ్చుట యెప్పటికిని సాధ్యముకాదు.

ఇట్లు ప్రపంచమునకుఁ దూర్పుభాగములో నొకబలమయిన రాజ్యము మదింపుగల గొప్పతనమును గాపాడుచు వచ్చుచుండఁ బైదేశములవారు చీనాపైఁ గన్నువేసి దానిని భాగములుగాఁ బంచుకొందమను నభిప్రాయముగలవారై యున్నప్పటికిఁ గ్రూ

డ వారి యిష్టమువచ్చినట్లు సైన్యబలములన సాధించుటకు వీలులేదు. ఎందువలన ననఁగా:—ఇతరులను ముందుకు రానిచ్చుటచే జపానుకు నష్టమువచ్చును. జపానువారెదిరించి యడ్డగింపసాగెదరు. చీనాదేశాధిపత్య పరిపాలన బాగుగా నుండి యమికకయును సావధానమును గలిగి జనులు మంచిస్థితిలో నుండవలయుననియే జపానువారి కోరికయైయున్నది. చీనా క్షేమముగానున్న యెడల జపాను వ్యాపారముచేసి లాభము పొందవచ్చును. అట్లే ప్రతిజాతివారికిని నుండును. ముఖ్యముగా బ్రిటిషుదేశమున్ను అమెరికాయును నీయభిప్రాయమునే గలిగియున్నవి. అట్లుండుటచేత నేగదా జపానీరెండుదేశములతోడను స్నేహభావమును గనఁబఱచి వారితోఁ గలసిగట్టుతనమున నుండ నాశకలిగియున్నది? బ్రిటనుమిత్రము గతించిన సంవత్సరారంభమునఁ జేసిన యొడంబడిక వలన జపానుకు స్వభావముగా నేర్పడియున్న విశేషసాధకముల నంగీకరించుటయైనది. అట్లే యమెరికాను జేరిన యైక్యమార్గాణములను గూడ చేయవలయును. అన్నిదేశములవారికిన్ని ప్రపంచము సమస్తమును దమవశముచేసికొనవలయునను నాశయుండవచ్చునుగాని వారివారికిఁ గలయమరికయును సాధనములును వసతులును భేదముగలిగి యుండుటచే నొకదేశమువారొక దేశభాగములోఁ దమయౌన్నత్యమును గనఁబఱచుచుండ వారింగాంచి రెండవవారు రెండవభాగములోఁ దలచూపినపుడితరులువిరోధముచేయకూడదు. కావున్ని అమెరికాయున్ను అది జపానుకిదివరలో కొన్నివిషయములలోనో స్నేహభావమును జూపించి సహాయమైనయట్లే యీవిషయములోఁ గూడ దానితోఁ గలసి దానిస్వాభావిక స్థానమును బలపఱచి చీనాకును దాని ప్రక్కలనున్న యితరదేశములకును క్షేమముగలిగించుటలో బ్రిటన్‌వలె సహాయభూమయి యుండునని నమ్మఁదగియున్నది

సమాప్తము.

The end



# I Love You.

1. If we love one another it will help us to love God,
   If we love God we will obey His Commandments.
   Then we hate Sin. Ex David & Jonathan
2. Faith & Hope will continue as far as man's death,
   but love will continue here & thereafter.
3. We can easily measure from East to West,
   But who can measure Love.
4. Love is Heaven & Heaven is Love.







